రాల్లో అందుకు విరుద్ధమైన భావన నిక్షిప్తమై వుండడం అంతకంటే వాస్తవం. రెండు దశాబ్దాల పర్యంతం అదొక తపస్సులాగా కొనసాగించిన సాహిత్య వ్యాసంగాన్ని గురించి తలచుకొని తను పరవశించిపోయేవాడు. ఆ కృషివల్ల తన బ్రతుక్కు లభించిన కాంతినీ, తనమనస్సుకు లభించిన శాంతినీ మినహాయిస్తే, తన జన్మ తృణంలా హీనమైనది. కాష్ఠంలా శుష్కమైనది. తన అంతర్ధానం వాళ్ళకెవరికో బాగా ఉపకరించింది. అవకాశం దొరకగానే వాళ్ళు తన వ్యక్తిత్వంపైన పేడనీళ్ళు చల్లేశారు. జరిగిపోయిన ఈ దురాగతంమూలంగా తన పేరూ, ప్రతిష్ఠ ఈపాటికి బూడిదలోపోసిన పన్నీరులా అణగారిపోయివుంటాయి.

కృతనిశ్చయుడై లేచి నిటారుగా కూర్చున్నాడు నీలూ. వీల్లేదు! అలా జరగడానికి వీల్లేదు! భార్గావా పాగల్లో చూరిపోయి, తన స్వరూపం వికృతంగా మారిపోయి వుండవచ్చు. ఇన్నేళ్ళతర్వాత యిప్పుడు వ్రాయడానికి పూనుకుంటే కలం సాఫీగా సాగక దస్తూరీ గూడా కుదరకపోవచ్చు. తానే నీలకంఠమని చెబితే లోకులు నమ్మలేకపోవచ్చు. కానీ తనలోని రచయిత ఏమాత్రం ప్రాణావశిష్టంగానైనా మిగిలివుంటే ఈ అవమానానికి ప్రతీకారం నెరపేదాకా తనకు నిద్ర పట్టదు. ఎంతోకాలం తను ప్రవాస జీవితం గడిపాడు. మరి కొద్దిరోజులు గడపలేకపోడు. పన్నెండేళ్ళ తన ప్రవాస చరిత్రను సింహావలోకనం చేసుకుంటే చాలు, ఒక బృహత్కథ తయారుగాకపోదు. రచయిత పేరు చెప్పుకుని రచన లమ్ముకోడం సవాలైతే, రచన మూలంగా రచయిత మళ్ళీ లోకంలోకి తిరిగి రావడం ఎదురు సవాలు. తనకు చుట్టుకున్న దుష్కీర్తి పాలిటికి తుడిచివేతగా, ఆ దుష్కీర్తిని తనకంటగట్టిన వాళ్ళ ముఖాల పాలిటికి మసిపూతగా తన రచన అవతరిస్తుంది.

ఆత్మవిశ్వాసాన్నంతా అరచేతిలోకి తెచ్చుకున్నట్టుగా పిడికిలి బిగించి, బల్లమీద ఒక గుద్దు గుద్దేశాడు నీలూ. చెల్లాచెదురుగా బల్లపైన పడివున్న పుస్తకాలు ఆ దెబ్బతో పైకెగిరి దబేలున నేలపైన పడిపోయాయి.

## 3

"మేనేజింగు ప్రొప్రయిటరుగారిని కలుసుకోవాలి" అన్నాడు నీలూ.

బొత్తులు బొత్తులుగా మూగివున్న కాగితాల ఎదుట కుర్చీలో కూర్చుని, ఏదో వ్రాసుకుంటున్న తరుణవయస్కుడు తలపైకెత్తి ఆగంతకుడికేసి చూస్తూ "కూర్చోండి" అన్నాడు.

ఊహించిన దొకటి. ఎదురైనది వేరొకటి. అక్లిష్ట ప్రముద్రణాగారమనగా అది మంచి మార్పులతో గూడిన పెద్ద సంస్థ కాబోలుననుకున్నాడు నీలూ. అలాంటిదేమీకాదు. దానికున్న ఒకే ఒక హంగు—వీధిలో వ్రేలాడుతున్న బోర్డు. లోపల హాల్లో ఈ యువకు డొక్కడు మాత్రం తదేక దీక్షగా తన పనేదో తాను చేసుకపోతున్నాడు.

"ఎందుకోసం వచ్చారో తెలుసుకోవచ్చా?" విస్మయం కలిగించేపాటి వినయంతో అతడు ప్రశ్నించాడు.

నీలూ జవాబు చెప్పే స్థితిలో లేడు. ఆ యువకుడి వాలకంలో అది, యిది అని ప్రత్యేకంగా వివరించి చెప్పడానికి వీల్లేని ఆకర్షణ ఏదో వుంది. నీలూకు వాకట్టు కట్టడం మాత్రమేగాదు, అది అతడి కళ్ళకు అనిమిషత్వాన్ని గూడా ప్రసాదించింది. ఈ పడుచువాణ్ణి తనెక్కడో చూచినట్టున్నాడు. లేదా చూచి మరచిపోయినట్టున్నాడు. ఏదో స్మృతి. ఏదో మరపు. ఆ రెండింటి మధ్య నీలూ మనసు ఉయ్యాలలూగుతోంది.

"ఎందుకోసం వచ్చారో తెలుసుకోవచ్చా?" మళ్ళీ అదే ప్రశ్న—ఈ సారి ఒక్కింత బిగ్గరగా.

"మరేంలేదు. నే నొక పుస్తకం వ్రాశాను. దాన్ని వెలుగులోకి తీసుకరావాలని సంకల్పం.... తెలిసిన వాళ్ళుకొందరు యిక్కడికొకసారి వెళ్ళి రమ్మన్నారు......"

"తీసుకొచ్చారా పుస్తకం?"

మిత వచనాలు. అంతకంటే మితమైన హావభావాలు. కొంపదీసి తాను మరమనిషితోగానీ వ్యవహరించడంలేదుగదా! నీలూ సందేహించాడు......

అందుకున్న పుస్తకాన్ని అత డొకటి రెండుచోట్ల మాత్రం తెరిచి చూచాడు. మళ్ళీ మొదటికే వచ్చాడు. అక్కడ దేనికోసమో వెదుకుతున్నట్టుగా ఒకటి రెండు క్షణాలు ఆగి, తటాలున తలపైకెత్తి, "ఇందులో రచయితపే రెక్కడా ఉదహరింపబడినట్టు లేదు......" అన్నాడు.

"నిజమే! ఉదహరింపవలసిన అవసరం లేదనుకున్నాను"

"అంటే?"

"ఈ రచన అనామకంగా—అంటే రచయిత పేరు లేకుండా ప్రకటింపబడాలన్నదే ఉద్దేశం"

"ఎందుకు?"

"రచయిత ఆ రంగానికి కొత్తవాడు కావచ్చు. లేదా సుప్రసిద్ధుడు గావచ్చు. అంటే ఏమన్నమాట? రచయిత పేరునుబట్టి పాఠకుడు ఆదిలోనే ఒక నిర్ణయానికి రావడానికి వీలుంటుందన్నమాట! నేను సూచిస్తున్న ఉపాయం ఆ ప్రమాదాన్ని పరిహరిస్తుంది......"

కానీ ఎదుటివ్యక్తి ఆ సమాధానాన్ని వినిపించుకున్నట్టే లేదు. అతడి చేతిలోని పుస్తకంలో నిమిషానికి నాలుగైదు కాగితాల లెక్కన వెనక్కువెళ్ళిపోతున్నాయి. ఆవిధంగా అతడు రచయిత నలాగే కుర్చీలో కూర్చోబెట్టి రచనను సాకల్యంగా చదివేసేటట్టున్నాడు......

పదిపదిహేను రోజులుగా మనసులో పొంగిపొరలుతున్న కోపం కట్టలు తెంచుకోడానికి సిద్ధంగావున్న ఆ తరుణంలో, మునిగాళ్ళమీద నిల్చున్న ఉక్రోషం ముందుకురకడానికి ఆత్రుల

చూస్తున్న ఆ సమయంలో ఎంతో బలవంతంమీద తననుతాను సంయమించుకుని నీలూ కుర్చీ కంటిపెట్టుకుని కూర్చున్నాడు. కానీ ఆశ్చర్యమేమిటంటే సూర్యరశ్మిలో పొగమంచులా అతడి భావోద్రేకం క్షణక్షణానికీ చప్పబడిపోతోంది. కన్నెత్తి ప్రత్యర్థి వైపు చూడగానే వాడిబలంలో సగం వాలికి సంక్రమించేదని ఓ పురాణగాథ చెబుతుంది ఎట్టయెదుట కుర్చీలో కూర్చున్న ఆ పడుచువాడి సాన్నిధ్యంలో నీలూ పరిస్థితి సైతం యించుమించు అలాగే పరిణమిస్తోంది. ఆ యువకుడిముఖంకేసి చూస్తుంటే కోపగించుకోడానికి మనస్కరించుడంలేదు సరిగదా అతగాడి అజ్ఞానాన్ని మన్నించివేయాలనిగూడా అనిపిస్తోంది. శత్రువే ఔగాక! అంతమాత్రాన వాడిలోని గుణవిశేషం ప్రశంసనీయం గాకపోదు. నిస్సందేహంగా మెచ్చుకోదగ్గది ఈ యువకుడి కార్యవ్యగ్రత. పట్టాభిషేకోత్సవ సందర్భంలో సాక్షాత్తు ఎలిజబెత్తు రాణి ఆవీధిగుండా ఊరేగుతోందని తెలిసినా అతడు చేస్తున్నపనిని వదలిపెట్టి కుర్చీలోనుంచీ లేచేటట్టు లేడు!

నీలూ అంతలో మనసు మార్చుకున్నాడు. ఈ యువకుడిది అజ్ఞానంగా తలపోస్తున్న తనకంటే అజ్ఞాని వేరొకడుండడు. త్రాగవలసిన పాలంతా త్రాగి నిరెత్తిన నిమ్మలా నిశ్చలంగా కూర్చున్న పిల్లికూనయిది! అదునకు నేర్చినగుణపాఠం వెయ్యి క్షీవజిక్షలపెట్టు! రచనాహోమంలో తాను అయుష్కాలాన్ని వెన్నలా కరిగించుకుంటే ఆ హవిస్సును దేవతలా భక్షించడానికి సిద్ధపడు?

పుటవైపోకసారిచూచి కంటికానిన ఒకటి రెండువాక్యాలనుబట్టి కథాక్రమాన్ని గ్రహిస్తూ వేగంగా చదువుకుంటూ వెళ్ళేపద్ధతిలో ఆయువకు డొక అరగంటసేపట్లో కథాంతంలోకి వచ్చేశాడు. పూర్తికాగానే పుస్తకం మూసేస్తూ అతడు నీలూవైపు వంగి "ఇందుకోసం చాలాశ్రమపడినట్టున్నారుమీరు" అన్నాడు.

"నాశ్రమ గుర్తింపబడినందుకు సంతోషం" అన్నాడు నీలూ.

"కానీ ఒక మాట చెబుతానుమీకు! ఈ పుస్తకం మీది! దీని వల్లమీకో అభిప్రాయంఏర్పడివుంటుంది. ఆ అభిప్రాయానికి విరుద్ధమైనమాట ఎవరైనా చెబితే మీకు కోపం వస్తుంది. ఐనా నిజంచెప్పకతప్పదు. ఉన్న యిబ్బంది అది! అందుకే ఒక్కమాటలో చెబుతున్నాను. మీశ్రమ వేరొకవిధంగా వినియోగమైవుంటే చాలాబాగుండేది".

నీలూ అందుకోడానికి వీలుగా పుస్తకాన్ని మేజాఅంచు దగ్గరగావుంచి అతడు మళ్ళీ కలం చేతికి తీసుకున్నాడు.

"ఇదిగో అబ్బాయ్!" గర్జించాడు నీలూ. "ఈపనికి మాలిన గొడవవల్ల యిప్పటికే నీపనికి అంతరాయం వాటిల్లింది. మరి కొంతసేపు మళ్ళీ అంతరాయానికి తట్టుకోకతప్పదు...."

"ఎందుకూ?" తెల్లబోతున్నట్టుగా అతడు ప్రశ్నించాడు.

"నువ్వు చేస్తున్న నామర్దానికన్నా నాప్రపంచం అమూల్యమైంది గనుక!"

"అలాగా!" చేతులు పైకెత్తి అతడు ఒళ్ళువిరుచుకోసాగాడు.

"కొందరిని ఎల్లకాలమూ మోసగించవచ్చు. అందరినీ కొంతకాలం మోసగించవచ్చు. కానీ ఎల్లకాలమూ అందరినీ మోసగించడం సాధ్యంకాదు...."

"తెలుసు! అది ఆంగ్లంలో ఒకసూక్తి...."

నీలూ అతడికేసి చురచుర చూచాడు. ఆ చూచినచూపుల్లో పాతకాలంనాటి జ్ఞాపకాల నీలినీడ లేవో పొడగట్టి ఎదుటివ్యక్తి త్రుళ్ళిపడ్డాడు.

"పండినపాపం కోతకు వచ్చినప్పుడు ఎలాంటి బింకాలైనా వదలిపోతాయి! నీలకంఠం సమాధిపైన డేరావేసుకుని నువ్వాడిన కపటనాటకానికి ఆయువు మూడింది. అసలైన నీలకంఠం కాదనుకో, అతడితాలూకు ప్రేతానికి నువ్విప్పుడు జవాబుచెప్పుకోవాలి. కుక్కమూతి పిందెలను రసగుల్లాలుగా చలామణీచేసిన సాహసానికి నువ్విప్పుడు సంజాయిషీ చెప్పుకోవాలి...."

యువకుడిముఖం వెలవెల పోడానికి క్షణంలో సగంసేపు పట్టలేదు. విచారమూ, విషాదమూ, విస్మయమూ ముప్పిరివేసుకపోయిన మానసికస్థితి అతడిముఖంలో స్పష్టంగా ప్రతిబింబిస్తోంది. ఉక్కుశలాకలాంటి ఆ పడుచువాడు వాడిపోయిన తోటకూర కాడలా బల్లపైకి వాలిపోయాడు.

"కాలం గడిచిపోతోంది" హెచ్చరించాడు నీలూ.

"నిజమే! దోషంనాది. అసందిగ్ధంగా నేను నా నేరాన్ని అంగీకరిస్తున్నానుగూడా!" అవనతముఖుడై నేలవైపు చూస్తూ ఆ యువకుడు మారుమాటలేకుండా తన నేరానికి ఒప్పికోలు ప్రకటించాడు.

ఒక్కనిముషంతరువాత మళ్ళీఅతడే కొనసాగించాడు.

"ఈ అభియోగంలో మీరువాదులు. నేను ప్రతివాదిని! మీరు నేరుగా న్యాయస్థానానికి వెళ్ళివుండవచ్చు. ఎందుకో వెళ్ళలేదుమీరు! బహుశా నాకొక అవకాశంయివ్వాలని భావించివుంటారు. ఈ అవకాశాన్ని సార్థకంచేసుకోవాలన్న ప్రయత్నం న్యాయంగాకపోదనుకుంటాను...."

"ఉపోద్ఘాతం అనవసరం!" నీలూ విరుచుక పడ్డాడు.

"మన్నించాలి మీరు! సూటిగా చెప్పడానికే ప్రయత్నిస్తున్నాను. లోకంలో లక్షలాదిమానవులు పుట్టిపెరిగి చనిపోతున్నారు. వేళ్ళకు నీళ్ళందకపోతే చెట్లుపెరగవు. సుఖంగా బతకాలనుకోడం, అందుకోసం ప్రయత్నించడమూ మానవుడి స్వభావం! నేను దురదృష్టవంతుణ్ణి! శారీరకంగానూ, మానసికంగానూ వికాసదశను అందుకోకమునుపే నేను బ్రతుకు బరు

పును మోయవలసివచ్చింది. ఆధారపీఠమంటూ ఒకటి లేనిదే మానవుడు నిల్వలేడు. నా బ్రతుక్కు ఆధారంగా మానాన్నగారు గడించిం దేమిటో చెబుతున్నాను. ఆయనొకవైపున కీర్తిని సంపాదించి రాశిపోశారు. మరొకవైపున దుర్భరమైన దారిద్ర్యాన్ని పెంచుకొచ్చారు. పిత్రార్జితమైన ఆ ఆస్తిపాస్తుల్లో మొదటిది పెట్టుబడిగా నేను రెండోదానితో పోరాడవలసివచ్చింది.."

మదిలో లీలగా మెదిలిన అనుమానం నిజంగా పర్యవసిస్తున్న ఆ తరుణంలో నీలా చేష్టలుడిగి అప్రతిభుడైపోయాడు.

ఆ యువకుడు తటాలున కుర్చీలోనుంచీ పైకి లేచాడు. ద్వారాన్ని సమీపించి బిగ్గరగా "అమ్మా" అని పిలిచాడు.

నీలా పాదాల క్రిందటి భూమి క్రుంగిపోతోంది.

"కానీ గాజుమేడలు కట్టుకున్నవాళ్ళు యితరుల యిళ్ళపైన రాళ్ళు విసరగూడదంటారు...." అతడు మళ్ళీ ప్రారంభించాడు. "మీ పేరూ ప్రతిష్ఠలు మీకు ముఖ్యం. వాటికోసం మీరు మీ నీడలో మిమ్మల్ని నమ్ముకున్నవాళ్ళను నిరంతర క్లేశాలపాలు చేయడానికి వెనుదీయరు. నా ఆరోపణలు రెండింటిలో యిది మొదటిది—స్వల్పమైనదిగూడా! రెండోది యిది. మీరు రచయితలు. మీ రచనలు మానవజగత్తునకు సంబంధించినవి. మనోధర్మ పరిశీలనం మీ రచనావ్యాసంగానికి ప్రాణం. రవిగాంచనిచో కవి గాంచగలడన్న లబ్ధప్రతిష్ఠ మీ సొత్తు. కానీ మీ దాకా వచ్చేసరికి మీరువప్పులో కాలువేయగలరు! పన్నెండేళ్ళు మీతోబాటుగా ఒకయింటి కప్పుక్రింద నివసించిన మానవజీవిని మీ రర్థంచేసుకోలేకపోయారంటే అది మీరు నిజంగా సిగ్గుపడవలసిన విషయం..."

టేబిలు సొరుగునులాగి పుస్తకాలక్రిందినుంచీ అత డొక కార్డుముక్కను పైకితీశాడు.

"మీ అభిమాన పాఠకమహాశయు డొకాయన వ్రాసిన ఉత్తరం యిది.—మీరు మాయమైపోయినతర్వాత ఆరు మాసాలకు యిది మీ చిరునామాకు చేరింది. కుటుంబదుస్థితికి జాలిపడుతూ ఆయనచేసిన సహాయాన్నిగురించిన ఉదంతం అందులోవుంది...."

"కాఫీ కోసమేనట్రా ప్రకాశం!"

జీవితంలో ప్రొద్దు పడమటి కింకా వ్రాలకపోయినా అప్పుడే జరాభరాన్ని మోస్తున్నట్టున్న మాతృమూర్తి కాఫీ గ్లాసుతో ద్వారం దగ్గర ప్రత్యక్షమైంది.

"అవునమ్మా! నా కోసంగాదు. ఆయనకోసం" అంటూ ప్రకాశం చరచరా బయటికి వెళ్ళిపోయాడు.

## 4

పై సంఘటన జరిగినతర్వాత మూడుమాసాలకు—

ఒకనాటి ఉదయం ఉపాహారం సేవించి చుట్టకాల్చుకుంటూ తీరిగ్గా మంచంపైన విశ్రమించాడు నీలకంఠం. చుట్టలోనుంచి పైకిలేచి వలయాలుగా తిరుగుతున్న ధూమమాలికల్లోకి చూస్తూ అతడున్నట్టుండి "చూడు పార్వతీ మాట...." అన్నాడు.

"ఏమిటండీ!" అంటూ దగ్గరగా వచ్చింది పార్వతమ్మ.

"ఏమిటోమరి! నేనూ ఆలోచిస్తున్నాననుకో. బోధపడి చావటంలేదు. బుద్ధి స్తబ్ధమైపోయినట్టుంది. అబ్బాయి చేసినపని మంచిదేనో కాదో తెలియదు. వాడు సృష్టించిన సాహిత్యం ఏదినుసుకు చెందిందో అదీతెలియదు. కానీ నే నొక్కమాట మాత్రం గట్టిగా చెప్పగలను. వాడు నాకంటే ప్రయోజకుడు...."

మళ్ళీ మూడుమాసాలు గడిచిపోయినతర్వాత ఓ రోజు వేకువజామున వీధితలుపుతీయడాని కోసం వెళ్తూ హాల్లోకి వచ్చింది పార్వతమ్మ. విద్యుద్దీపం క్రింద కూర్చుని ప్రకాశం వ్రాసుకుంటున్నాడు.

"అప్పుడే లేచావా అమ్మా!" పలకరించాడు ప్రకాశం.

"లేచానుగానీరా ప్రకాశం, నిన్నొకమాట అడగాలని! అదేమిట్రాబాబూ, నువ్వు మీ నాన్నగారి పుస్తకాన్ని తేలికచేసి పారేశావటగా?" విస్తుపోతూ అడిగింది పార్వతమ్మ.

ప్రకాశం మెల్లగా నవ్వాడు. అంతలో తల్లి మనసులోని ఆరాటాన్ని గ్రహించాడేమో, నవ్వును మధ్యలోనే త్రుంచేశాడు.

"అదికాదమ్మా! నేను నీబిడ్డను. నాలో ప్రకాశమొక్కడే కనిపిస్తాడునీకు! ప్రకాశంలో పాఠకుడున్నాడు. రచయిత వున్నాడు. పబ్లిషరున్నాడు. వీళ్ళల్లో ఎవడి అభిప్రాయాలు వాడివి. ఒక చేతితో చేసినదానం మరొకచేతికి తెలియనివ్వకపోవడం గొప్పదాతృత్వానికి లక్షణమని చెబుతారు. అలాగే నాలోని పాత్రలు ఒకదాని అభిప్రాయాలతో మిగిలినవి జోక్యంపెట్టుకోవు. ఐనా నాన్నగారి పుస్తకాని కిప్పుడేం తొందర? ఎప్పుడైనా వేసుకోవచ్చుదాన్ని! అది కాలగతికి మారొడ్డి కలకాలం నిలిచే పుస్తకం" అన్నాడు ప్రకాశం!

# తురగా రామకవి శ్రీనాథుని సమకాలీనుడా?

శ్రీ తురగా కృష్ణమూర్తి

లోకం పోకడ చాలా విచిత్రంగా ఉంటుంది. అందునా సాహితీలోకంలోని పోకడలు మరీవిచిత్రంగా వుంటాయి. గ్రంథకర్తృత్వవిషయాల్లో విభిన్నాభిప్రాయాలుద్భవిల్లి, తలపట్లు పట్టిస్తూ వుంటాయి. గ్రంథచౌర్యాలు కూడా కొందరుమహాను భావులకు అంటగట్టబడడం—వారు సజీవులై వుంటే సంజాయిషీ లిచ్చుకోవడం, లేకుంటే దోషులుగా ప్రజాదృష్టిలో తర తరాలుగా నిలిచిపోవడం జరుగుతూవుంటుంది. ఒక్కొక్కప్పుడు ఒకరు రచించిన పద్యం వేరొకరి గ్రంథాలలో కనబడటంతో బేరాలుసాగినవనో, చౌర్యాలు జరిగినవనో గాలిదుమారాలు రేగడంకూడాకద్దు! ముక్కు తిమ్మనపద్యాన్ని రామరాజభూషణుడు క్రయానికి పిలుచుకొన్నాడనీ, శ్రీనాథుడు రచించిన "క్రీడాభిరామాన్ని" వల్లభామాత్యుడు బేరమాడుకొన్నాడనీ అపవాదాల్ని సృష్టించి ఆత్మసంతృప్తినొందే అఖండ ప్రజ్ఞాధురీణులుకూడా లేకపోలేదు! ఎప్పుడో ఒకప్పుడీ అపవాదాల నిజమారసి, రుజావొనర్చి యదార్థాన్ని బయటపెట్టగల ధీమంతులు ప్రభవించి, లోకానికి నిజాన్ని ప్రసాదించి కన్నులు తెరపిస్తూ వుంటారు. అంతవరకీ అంథలోక మూ అపప్రథల్ని యథార్థాలుగా యెంచుకుంటూ, ఆనందిస్తూ వుంటుంది. కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారివంటి పండితులే యిట్టి అపోహకు లోనై శ్రీనాథుడు పచ్చిశృంగారి యను నిర్ణయానికివచ్చి శృంగారపద్య సంచయాన్ని యావత్తు అతని తలకే చుట్టి, ప్రజాదృష్టిలో కవిసార్వభౌముడైన శ్రీనాథుణ్ణి కాముకప్రవృత్తిగల రసికశేఖరునిగా చిత్రించడానికి వెనుకాడలేదు! గతానుగతికంగా ఆ వాదనను నమ్మి తదనుగుణ్యముగా శ్రీనాథుని శిలచిత్రణలోగూడ నీ రసజ్ఞతను జొప్పించి, ఆనందించిన మహానుభావులు గూడ లేకపోలేదు. ఈ దృష్టితోనే "క్రీడాభిరామం" శ్రీనాథకృతం అని వాదించడానికి గూడ వారు సంశయింపలేదు! అట్లే శ్రీనాథుని కృతులుగా పేర్వడిపోయిన శృంగారపు పద్యములలో కొన్ని యితర కవులవి ఉన్నప్పటికీ వాటిని పరిశీలించి, వివక్షించి, శ్రీనాథకర్తృకము లేవియో, కాని వేవియో విడమర్చి రూపింపగల సహనశక్తి కోల్పోయి, శృంగార రసజ్ఞత నెల్ల శ్రీనాథుని తలకు జుట్టి సంతసించినవారు కూడ యున్నారు. ఈవిషయాన్ని నిరూపించడానికి శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి అనుభవ మీయెడ నుటంకించి, వారి వాక్యాల నుదహించడం అప్రస్తుతం కాదనుకొంటాము.

"శ్రీనాథుని కృతులకుఁ జరిత్రముతోఁగల సంబంధము నెఱిగించుటలో నాకు ప్రథమముగ మార్గదర్శకమైనది కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన "శృంగార శ్రీనాథమే!" .... .... .... .... శృంగారశ్రీనాథమునందలి భావములు విశిష్టముగ నామనస్సున నాటుకొని యుండుటచే శ్రీనాథుడు శృంగారియను భావముతోడనే గూడియుండి తద్వాపరక్తచిత్తముతో నచ్చటచ్చట నొండురెండు వాక్యముల సంతరించియుంటిని. కాలక్రమమున శ్రీనాథుని కృతులన్నిటి మీద నాకుఁ దోచిన యూహాలను వెలార్చుచుండ నాతని రచనలలో జూపట్టెడి చరిత్రాంశములన్నియు సర్వథా సత్యము లను నిశ్చయమునకు వచ్చితిని. .... .... .... శ్రీనాథుడు తనకు సన్నిహితకాలమున గౌతమీతీరభూమిగా ప్రసిద్ధమై యున్న "కురవాటసీమ" ను తమ్మిలేటి పరిసరమునకు గొనిపోవుట యసంభవమనియు, నానాటి చరిత్రమునకు విరుద్ధమయిన యంశమీ క్రీడాభిరామమునగాని నమ్మచున్నదిగావున నిది శ్రీనాథ విరచితమెన్నటికిని గానేరదనియు నిశ్చయించుకొంటిని. అంత నటకును ప్రభాకరశాస్త్రిగారి రచనలలోని విషయమునందు నాకుగల ప్రత్యయముచే క్రీడాభిరామము శ్రీనాథవిరచితమే యనుకొంటినిగాని, యీ సంఘటనముతో నాదృష్టి మారిపోయినది. .... .... .... దానితోపాటు శ్రీనాథుని "శృంగారశేఖరు"నిగా నిరూపించుటకు క్రీడాభిరామ పీఠికలో శాస్త్రిగారు కూర్చిపెట్టిన యుపపత్తులెంతవరకు సరిపడునో పరికింప వలయునవిపించినది. క్రీడాభిరామ కర్తృత్వమును శ్రీనాథునకు గూర్చినవాడే శాస్త్రిగారి దృష్టిలో నాతడు శృంగారిశేఖరుడైనాడు. తత్కర్తృత్వ మాతనికి లేనినాడు ఆతడు శృంగారికూడ కాడనిపించినదినాకు. ఆదృష్టితోఁ బరిశీలనకుఁ బ్రారంభింపగా శ్రీనాథుని స్త్రీలోలునిగా దెలుపుటకు శాస్త్రిగారు క్రీడాభిరామపీఠికలోఁ గూర్చిపెట్టిన చాటువులన్నియు నాతనివగునా? కావా? యను సందియ మేర్పడినది."

పైన చెప్పినట్లు సత్యాసత్యనిరూపణాదిదృక్కులైన మనీషుల పరిశోధనాఫలితములు సత్ఫలదాయకములై కొందరి యపప్రథల్ని పోగొట్టి, నిజస్థితుల్ని యెరుకపరచడానికి దోహదం చేస్తూవుంటాయని రూఢి అవుతోంది. ఇంతవరకు శ్రీనాథునివిగా వ్యాప్తిలోనికి వచ్చిన శృంగారపరములైన చాటు పద్యములలో

ఉ॥ చూడఁగ నల్పుగాని పరిశోభిత దివ్య కురంగ నాభమే
జాడను రాజయోగ్యమగు జవ్వని నల్లని మేనుసంచుతో
నాడఁగరాదుగా! రతి రహస్యమెరింగిన చిత్తసంభవ
క్రీడలందేజీ చూడవలె గేదగి గంగి విచిత్రవైఖరుల్.

ఉ॥ భూతలమందుధాతకు నపూర్వతగల్గెనురెంటమూట,భా
గోతుల బుచ్చిగానికొక కొంచె ..... సేయుమిన్,
భీతకురంగనేత్రయగు పెండెలనాగికి .......
ఘాతము లుంచినందులకుగంగిని నల్వొనరించి వందుకున్

అనేవి "తురగారామకవి" రచనలుగా తేలి శ్రీనాథుని యవ ప్రథమ కొంతవరకు తగ్గిస్తున్నాయి!

ఈ "తురగారామకవి శ్రీనాథునికాలమువాడుగా వెలుఁగ బడుచున్నాడని" శ్రీపాదయ్యశాస్త్రిగారు తమ "శ్రీనాథకవితా సమీక్ష"లో వ్రాయుడంతో ఒకచిక్కును విడదీయబోయి, మరొకచిక్కును కల్పించినవారైనారు! శ్రీ శాస్త్రిగారు క్రీడాభిరామకృతికర్తృత్వమును గూర్చి చేసిన పరిశోధనలోగాని, లేక శ్రీనాథుని కవితా సమీక్షా కృషిలోగాని యీ రహస్యము బయల్పడియుండెనేమో గాని ఇది చారిత్రక సమన్వయ దృష్టికి నిలుచుటలేదు.

చారిత్రక సత్యములకే ప్రాధాన్య మిచ్చి శ్రీనాథుని కవితా సమీక్షచేసి, నూత్న సిద్ధాంతములను వెలార్చిన శ్రీ పాదయ్యశాస్త్రిగా రెట్టి యాధారములును లేకుండ తురగా రామకవి శ్రీనాథుని సమకాలీనుడని వాకొన సాహసింతురా? యను జిజ్ఞాస నన్ను ప్రేరేపించుటచే నీ వ్యాసము వ్రాయ వలసివచ్చినది. ఇందలి విషయములను సహృదయతతో పరికించి నిర్ణయింప ప్రాజ్ఞలోకమును వేడుచున్నాడను.

తొలుదొల్తగా తురగా రాముని ప్రస్తావన కొండవీటి రెడ్డిరాజగు కోమటి వేమారెడ్డి దాతృతాగుణ సంభావనములో కానుపించుచున్నది. అట్టి సంభావనావిషయకమైన పద్యమిది :

కోమటి వేముని త్యాగము
భూమి ప్రసిద్ధంబు, కల్ప భూజము చెంతన్
బాముున్న పగిదిఁ దురగా
రాముం డున్నాడు, చేరరా దెవ్వరికిన్.

ఈ పద్యములో తురగా రాముని ప్రసక్తి "కవి"గా గాక "ప్రధాని" గా చేయబడినట్లు తెల్లమగు చున్నది! కోమటి వేముని యాస్థానమున నున్న "తురగా రాముడు" కవియే యయ్యెనేని శ్రీనాథుని సమకాలీనుడై యుండెనని శ్రీ శాస్త్రిగారు చెప్పినవిషయము సమంజసమై యుండి యుండెడిది. కాని యీ "రాముడు" యమాత్యశేఖరుడగు "రాముడు" గాని అద్వితీయ కవితాప్రాభవుడగు "రాముడు" గా నిందు యెరుంగబడుటలేదు. ఒకవేళ నీ పద్యములో నుదహరింప బడిన "తురగా రాముడు" "రామకవి" యే యని యను కొన్నను అంతటి ప్రతిభావంతుడగు కవి తన యాస్థానములో నుంచుకొన్న కవితాప్రియుడగు ప్రభువు కోమటివేముడు గాని రెడ్లయశోగీతికల నల్దెసల గొంతెత్తి పాడిన శ్రీనాథుడు గాని, "రామకవి" ప్రశంసల నెందును జేయక నూరకుండుట సంభవింపదు. అదియునుఁ గాక దానగుణవిరతుడగు ప్రభువు నదుపాజ్ఞలలో పెట్టగల సామర్థ్యము యమాత్యశేఖరులకే గాని యన్యుల కుండి యుండదు. రాజభొక్కసముపై యధికారము కల్గి రాజకార్యముల నేమరక నడిపించు బాధ్యత వహించిన యమాత్యులే ప్రభువుల క్రీడా వినోదములకు, కవితా గోష్ఠులకు, దానధర్మములకు వెచ్చింపదగు ద్రవ్యముల సమకూర్పు విధివిధానముల నన్వేషింపుచు అదుపు ఆజ్ఞలను కల్గియుందురు గాని యన్యుల కీ విషయమై ఎట్టి అధికారములు నుండి యుండవు. ఆ దృష్టితో వీక్షించినచో కోమటివేముని త్యాగనిరతికి అడ్డుకట్టగా నిల్చిన "తురగా రాముడు" కోమటివేముని యమాత్యులలో నొకరై యుండవలెనే గాని, యాస్థాన కవిశేఖరులలో గాని ఆశ్రితులలో గాని నొకడగు "రామకవి" గా మాత్ర ముండుటసంభవము. ఈ పద్యములో నుదాహృతుడగు "రాముడు" కోమటివేముని సమకాలీను డగుటచే క్రీ. శ. 1403 మొదలు 1420 మధ్యకాలమువాడై యుండి యుండవలెననుట నిశ్చయము గదా! అట్లవుటచే నాతడు శ్రీనాథుని సమకాలీనుడై యుండి యుండుట సాధ్యమగుచున్నది. కాని— యీ రాముడు "మంత్రి రాముడు" గాని, "కవిరాముడు" గాడు. ఈ విషయమునే కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు "యీ కోమటి వేమారెడ్డి యాస్థానమున మామిడి సింగనాదులు మంత్రులు. తురగా రామన యను మంత్రి యున్నాడట! ఒక కవి వానిఁ బేర్కొనె" నని యీ పద్యమునే తమ "చాటుపద్యమణిమంజరి" లో నుదహరించినారు. అందువలన కోమటివేముని యాస్థానవాసియైన "తురగా రాముడు", "మంత్రిరాముడు" గాని, "కవి రాముడు" గా తెలియబడుటలేదు.

ఇక "నాగరఖండ" కర్తగా పేర్కొంచిన "తురగా రామకవి" మరొక డున్నాడు. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకాగారమున నీ నాగరఖండకావ్యప్రతులు రెండున్నవి. ఒకటి తాళపత్రగ్రంథము. రెండవది వ్రాతప్రతి. ఈ గ్రంథము విషయమై పరిచయవాక్యము లిట్లు వ్రాయ బడినవి.

"The authors of the work are Ayyanki Balasaraswati and Durga Rava (Rama) (Raja) Kavi of Saunaka gotra. The work was dedicated to Dhavaleswarapura Markandeya, son of Viranamba and Somavibhu and chief of Pendotapura. He is said to be a decendant of Viswakarma and an ally of Muhammad Kutubsha. He bore such titles as GhanaMeghaVahana anb Kanaka-Kuntalabharana."

ఈ వ్రాతలబట్టి నాగరఖండ ప్రబంధకర్తలు అయ్యంకి బాలసరస్వతి, దుర్గా రామ (రాజ) కవులనియు, శౌనకగోత్రులనియు తెలియనగుచున్నది. "దుర్గా" యనునది లేఖక ప్రమాదముగా నెంచి "తుర్గా" లేక "తురగా" యని నిర్ధరించితిమేని యది తుర్గా రామకవి లేక తుర్గా రాజకవి ప్రణీతముగా దేలుచున్నది. ఆశ్వాసాంతగద్యలో "ఇది శ్రీమద్దుర్గాదక్షిణామూర్తి వరప్రసాదభరితసారస్వత, తుర్కా రాజకవిన రాయ్యంకి బాలసరస్వతి నామధేయ ప్రణీతంబైన నాగరఖండంబునందు" నని యున్నది. క్రీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు యీ తుర్కా రాజకవినే తురగా రామకవిగా భ్రమించి, తమ "ఆంధ్రకవుల చరిత్రము" లో నిట్లు వ్రాసియున్నారు.

"ఈతడును నయ్యంకి బాలసరస్వతి యను మఱి యొక కవియు గలసి రచియించిన నాగరఖండ మనెడి యెనిమిదాశ్వాసముల గ్రంథమొకటి కానబడు చున్నది. ఈ యిద్దరు కవులును దమగ్రంథముయొక్క యాశ్వాసాంత గద్యము నీ ప్రకారముగా వ్రాసికొనియున్నారు. "ఇది శ్రీమద్దుర్గా దక్షిణామూర్తి వరప్రసాదాసాదిత సారస్వత తురగా రామ కవివరా య్యంకి బాలసరస్వతి నామధేయ ప్రణీతంబైన శ్రీ స్కాందంబను మహాపురాణమునందు సనత్కుమార సంహితను నాగరఖండము."

ఈ నాగరఖండము ధనశేశ్వరపు మార్కండేయుడను స్వర్ణకార కులజుని కంకితము చేయబడినది. ఈ విశ్వకర్మ వంశజుడు బెజవాడకుఁ బ్రభువుగా నుండినవాడు. ఈతడు మహమ్మదు కుతుబషాహి కాలములో నుండినట్లు నాగర ఖండ యవతారికలోని యీ క్రింది పద్యము వలన తెలియ నగు చున్నది.

> అతడు ప్రసిద్ధి వహించెన్
> క్షితినర గజపతుల గెల్చి వెలిగి జయశ్రీ
> సతి జేకొనిన మహమ్మదు
> కుతుబశహా చంద్రునకును గుడిభుజ మనగన్.

కుతుబషాహ్ క్రీ. శ. 1581 నుండి క్రీ. శ. 1611 వరకు గోలకొండ నవాబుగానుండి రాజ్యము చేసినటుల చరిత్రప్రసిద్ధి. కావున నీ కవిద్వయము గూడ నా కాలము వారేయై యుండవలెను. అట్లనుట వీరు క్రీ. శ. 16 వ శతాబ్ది చివరనో 17 వ శతాబ్దారంభముననో యుండి యుండవలెనని నిర్ధారణ మగుచున్నది. శ్రీనాథుండు క్రీ. శ. 1403 మొదలు క్రీ. శ. 1434 వరకు గాని, అంతకు మించి కొన్ని సంవత్సరములుగాని జీవించి యుండెనను కొన్నచో నీ తుర్కా రాజకవి లేక తురగా రామకవికి నూరు సంవత్సరముల ముందున్నవాడు శ్రీనాథుడని స్థిరీకరించవలసి వచ్చుచున్నది. అందుచే నాగరఖండకర్తయైన "తురగా రామకవి" (తుర్కా రాజకవి) శ్రీనాథుని సమకాలీనుడనుట అసంగతమని యందుమూలమున తేలుచున్నది. కీ. శే. చాగంటి శేషయ్యగారీ కవుల గూర్చి తమ "ఆంధ్రకవితరంగిణి" లో నిట్లు వ్రాసినారు.

"ముద్రిత ప్రతులలోను, అముద్రిత ప్రతులలోను మొదటి గ్రంథకర్తనామము "తుర్కా రాజకవి" అనియే యున్నది. ఆంధ్రకవుల చరిత్రములన బ్ర. శ్రీ వీరేశలింగంపంతులుగా రీతనిని తురగా రామకవి యని వ్రాసి యున్నారు. "రామకవి బొబ్బ పెద్ద ఫిరంగి దెబ్బ" అని తిట్టు కవులలో బ్రసిద్ధిగాంచిన తురగా రామకవి యొకడు గలడు. ఆత డీతడే యని పంతులుగారి యభిప్రాయము. పైని వ్రాసిన గద్యపద్యములను బట్టి యీ కవులేశాఖకు చెందిన బ్రాహ్మణులో, యెచ్చటివారో యేమియు దెలియుట లేదు. గోదావరి మండలమున తురగావారును, అయ్యంకి వారును నియోగిబ్రాహ్మణులలో నున్నారు. వారు శౌనక గోత్రులు. కావున నీ కవులును నియోగి బ్రాహ్మణులే యని నిశ్చయింపవచ్చును. గోదావరి మండలమునందు "దుర్గా" యను గృహనామము గల నియోగి బ్రాహ్మణు లున్నారు. కాని వారు శౌనకగోత్రులు గారు. భారద్వాజ గోత్రులు. గ్రంథాంతమున నున్న పద్యమువలన నా గ్రంథరచనా కాలము శ. శ. 1508 అనగా క్రీ. శ. 1583 వ సంవత్సర మని తెలియుచున్నది. ఇంతకును నాగరఖండ కృతికర్త "రాజన" కాని "రామకవి" గాడు. రామకవి ప్రసిద్ధు డగుటచే నీ పేరా గ్రంథమున కలిగించిరి. కాని యీ గ్రంథ కర్త "రామకవి" యనుటకు ఆధారములు లేవు.

గద్యయందీతని యింటిపేరు "తుర్కా" అని యున్నను శౌనక గోత్రజులైన నియోగి బ్రాహ్మణులలో "తుర్కా" వా రున్నారని బుజువగువరకును నీతని యింటి పేరు "తురగా" యనియు, తుర్కా యనునది లేఖక ప్రమాదము అనియు దలంతము."

ఈ వ్రాతలఁబట్టి నాగరఖండకర్త తురగా రాజ కవి (తురగా రామకవి) శ్రీనాథునకు తరువాత నూరు సంవత్సరముల ప్రాంతమున నున్నవాడుగా తేలుచున్నది. అందుచేత శ్రీ శాస్త్రిగారి వ్రాత సమర్థనీయమగుటలేదు.

ప్రబంధకర్తగా గాక చాటుపద్యముల వలనను, తిట్టుకవిత్వమువలనను పేరెన్నికగన్న "తురగా రామ కవి" మరొకడు గానవచ్చుచున్నాడు. ఈత డేమేని శ్రీనాథుని సమకాలీనుడేమో విచారింతము.

తురగా రామకవి కృతములని పేర్గాంచిన తిట్టు పద్యములు యీ క్రింద నుడివినవి వినవచ్చుచున్నవి :

> (1) అద్దిర ! శ్రీభూపిలలు
> ముద్దియ లా హరికి గలరు ముగురందఱిలో
> బెద్దమ్మ నాట్యమాడును
> దిద్దిమ్మని నత్పవాయి తిమ్మని యింటన్.

(2) సూరకవి తిట్టు కంసాలి సుత్తె పెట్టు
రామకవి బొబ్బ పెద్దఫిరంగి దెబ్బ

(3) అంగణము లెన్ని కేళీ గృహంబు లెన్ని
యోడు బిళ్లల యిండ్లెన్ని మేడలెన్ని
కబ్బె గాకేమి సూర్యప్రకాశరాయ
డుంగుటూరిండ్ల రాకాసు లుండవచ్చు.

(4) కూటికి గాకులు వెడలెదు
నేటావల మూకజేరి యేడువ దొడగెన్
గాటికి గబ్బెలు చేరెను
శేటవరపు పోతరాజ లేడా ? లేడా ?

ఈ పై తిట్టుపద్యముల జెప్పిన తురగా రామకవి యారువేలనియోగి బ్రాహ్మణుడును, నేటికి నూరు నూట యేబది సంవత్సరముల క్రిందట నుండినట్టును, అడిదము సూరకవితోడి సమకాలికు డయినట్టును యెల్లవారును వాడు చున్నారని శ్రీ వీరేశలింగం పంతులుగారు దమ ఆంధ్రకవుల చరిత్రములో వ్రాసియున్నారు. పై తిట్టుపద్యము లేయే సందర్భములందుఁ జెప్పబడినవో విచారించి, విమర్శించితి మేని, వాని కర్త యగు రామకవి యెప్పటివాడో నిర్ణ యించు కొనవచ్చును.

ఈ పద్యములలో మొదటి, రెండు పద్యములకును వెనుక చారిత్రక విశేషము లిమిడి యున్నవి. ఒకానొక యెడ పెద్దాపుర ప్రభువగు వత్సవాయ తిమ్మజగపతి దర్శనా ర్థము తురగా రామకవి వెడలినప్పుడు ఆయన నిరాదరణ చేసి, దర్శన మీయ నిరాకరింప, రామకవి కినిసి యీ పద్యమును చెప్పెననియు, వెంటనే వత్సవాయ తిమ్మ జగపతికి వార్త దెలిసి, పశ్చాత్తాపము వెలిబుచ్చ రామకవి కరుణించి, యీ దుర్గతి తిమ్మ జగపతి మనుమని కాలమున పెద్దాపుర సంస్థానమునకు బట్టునని శాపమును గ్రమ్మరించెననియు వాడుక. ఈ విషయమును కింకవీంద్ర ఘటాపంచాననులు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు తమ "కథలు—గాథలు" యను గ్రంథమున వర్ణించి యున్నారు. ఈ కథ యందలి యథార్థవిషయ మెట్లున్నను తురగా రామకవి వత్సవాయ తిమ్మజగపతి రాజ్యకాలమున నున్నట్లు నిరూపిత మగుచున్నది. పెద్దాపుర సంస్థానమును బరిపాలించిన తిమ్మ జగపతి రాజ్యకాలము క్రీ. శ. 1761 నుండి 1803 వరకు గలదు. అందుచే తిట్టు కవిత్వమున దిట్టయని యనిపించు కొనిన రామకవి గూడ క్రీ. శ. 1761—1803 ప్రాంతము వాడై యుండి యుండవలెనని స్పష్ట మగుచున్నది. ఈ విధిని చూచినను తురగా రామకవి శ్రీనాథుని సమకాలీను డగుట పొసగకున్నది. శ్రీ శాస్త్రిగారినిర్ణయము నిది అధఃకరించు చున్నది.

ఇక రెండవపద్యమున ప్రస్తావింపబడిన విశేష మిది :

రామకవి యిల్లు కట్టించుకొనుచు, దారిని పోవు వారి నందరను బిలిచి తన గోడ కిటుక లందీయుడని శాసించు చుండెనట ! ఒకనా డా దారిని అడిదము సూరకవి పోవు చుండగా, రామకవి యాతనినిఁ బిలిచి, తక్కినవారి వలెనే యాతని గూడ నిటుక లందీయ నియమించెనట ! సహజ ముగా నిరంకుశుడగు నా సూరకవి కోపించి "వా యెంతటి వానికా నీత డాదేశ మిచ్చు ఘనుడు ?" యని రోషించి అతడు రామకవి యని తెలియక,

సూరకవి తిట్టు కంసాలి సుత్తె పెట్టు

అని గర్జించి వలికి పోబోయెనట ! అందుపై రామకవి కోపించి, కన్ను లెఱ్ఱజేసి,

రామకవి బొబ్బ పెద్దఫిరంగి దెబ్బ

అని బొబ్బరించెనట ! అందుపై సూరకవి యాతని తురగా రామకవిగా నెరిగి యాతని యాప్సితము నీడేర్చి పోయెనట ! ఈ విషయము అనాదినుండియు గాథాస్వరూపమున ప్రచా రమునం దున్నది. ఈ కథలోని నిజానిజములు, సాధ్యాసాధ్య ములు మాట యెట్లున్నను సూరకవి, రామకవులు సమకాలీను లనియు యేకమండలవాసులనియు మన మెరుంగుటకు సావకాశ మిచ్చుచున్నది. అడిదము సూరకవి గోదావరీ మండ లములోని రామచంద్రపుర నివాసిగాక విశాఖమండలాంతర్గత రామచంద్రపుర నివాసిగా యెంచుకొన్నను, రామకవి, సూర కవుల సమకాలికత్వ సిద్ధాంతమునకు భంగ మేర్పడదు.

అడిదము సూరకవి క్రీ. శ. 1750 ప్రాంతములందు విశాఖమండల మందలి విజయనగరసంస్థాన ప్రభువగు పూసపాటి చినవిజయరామరాజుగారి యొద్ద గవీశ్వరుడుగా నున్న సంగతి జగద్విదితము. పూసపాడ్విజయరామరాజును, వత్సవాయ తిమ్మ జగపతిరాజులుంగారును విజయనగర పెద్దా పుర సంస్థానాధిపతులై, కవిపోషకులై వన్నె కెక్కినవారు. విజయనగరప్రభువు అడిదము వారిని యాస్థానకవిశేఖరు లుగ నియమించుకొన్న, వత్సవాయి వారు ఏనుగువారిని తమ సంస్థానములో యాస్థాన కవులుగా నిల్పుకొన్నవారు. అడిదము సూరకవి, ఏనుగు లక్ష్మణకవులు వరుసగా విజయనగర, పెద్దా పుర సంస్థానములలో నాస్థాన కవిశేఖర ఖ్యాతిగాంచి మించిన వారే ! కవిపోషకులును, సరసులును నగు విజయరామ, తిమ్మ జగపతులు విశాఖగోదావరీ మండలముల ప్రాభవ సంపన్నులై యుండు తరిని మధ్యమ యుగ ప్రబంధకవులలో పేరెన్నిక గన్న అడిదము సూరకవి, ఏనుగు లక్ష్మణకవి, పిండిప్రోలి లక్ష్మణకవి ప్రభృతులు సమకాలీనులై తమ కవితా ప్రాగ ల్భ్యముల దీపింప జేయుట యెల్ల రెరిగినదే ! అట్టి అడి

దము నూరకవి సమకాలీనుడుగా పేర్వడసిన రామకవి గూడ నాయా సంస్థానాధీశ్వరుల దర్శించి, బహుమానముల పొంది యుండె ననుటలో నబ్బుర మేమియు నుండరాదు!

ఈ తిట్టు పద్యములకు తోడు పిండిప్రోలి లక్ష్మణ కవి రచించిన "రావణ దమ్మీయమను లంకా విజయు" ప్రబంధమున

తెలియు వినుం రాఘు కవ్యా
దులు, నూరకవి ప్రముఖ పృథుప్రతిభావం
తులు, భీమ శ్రీనాథు
ల్వెలయుగ నా కరణీ తిట్టు లే రూఘమతిన్.

అని స్వోత్కర్షగా చెప్పుకున్న పద్యము వలన తిట్టు కవిత్వములో తిట్టలైన భీమకవి (వేములవాడ) శ్రీనాథులు, నూరకవి (అడిదము) రామకవ్యాదులు (తురగా) తన కీడు రారని లక్ష్మణకవి యుగ్గడించి యున్నాడు. పిండిప్రోలి లక్ష్మణకవి గోదావరీ మండలములోని రామచంద్ర పురమునకు సమీపమునందున్న "కుయ్యేరు" గ్రామకరణమనియు, కవి కాలము క్రీ.శ. 1771 నుండి 1840 వరకు అనియు శ్రీ వీరేశలింగం పంతులుగారు తమ "కవి జీవితము" లలో తెలిపి యున్నారు. పిండిప్రోలి లక్ష్మణకవి తన పద్యములో భీమశ్రీనాథ కవులను, అడిదము నూరకవి, తురగా రామ కవులను ప్రస్తావించుటచే వార లీతనికీ బూర్వులై యుండ వలెనని తెలుచున్నది గదా! అందుచే క్రీ. శ. 1771 నాటికి అడిదము నూరకవి, తురగా రామకవు లున్నటుల నిర్ణయింప నగుచున్నది. పిండిప్రోలి లక్ష్మణకవి, అడిదము నూరకవి, తురగా రామకవులు యించుమించు సమకాలీను లనియు, తిట్టు కవిత్వమునందు దిట్ట లనియు, నొకే మండలవాసు లనియు గూడ చెప్పనగుచున్నది! యీపై ఆధారమును బట్టి చూచినను తురగా రామకవి శ్రీనాథునకొ మూడువందల యేండ్లు తరువాతి వాడుగా కన్పట్టు చున్నది. దీనితో శ్రీ శాస్త్రిగారి సిద్ధాంతము మరింత దూర మునకు బోయినది.

ఇంక శ్రీనాథుని శృంగార పద్యముల కోవలోనికి బోయి వానివిగనే ప్రచార మందిన రెండుచాటువులను గూర్చి విమర్శింతము. ఆ రెండు పద్యములను యీవరకే నుదహరించి యున్నాడను. ఆ పద్యములలో నుదహరింపబడిన వేశ్యలు

పెండెంవాగి, పెద్ది, గేదగి గంగులు రామకవి గారికీ గూర్పు ప్రియురాండ్రని నిరూపించుటకీ క్రింది పద్యమే సాక్ష్యము!

ఉ. పెండెంవాగి కొప్పువయి, బెద్ది కటిస్థలి, గంగి గుబ్బ చ
న్గొండలనుండు రామకవి కుంజరు హస్తము క్రిందు
సేసె హో!
పండక బంటుమిల్లి, యది పండిన నీ కసుమాలధారుణీ
మండలనాథు బోలునొక మానవమాత్రుని వేడబోవునే ?

ఈ పద్యమును రామకవి శ్రీ మొగలితుర్తి ప్రభు సందర్శనానికి వెళ్లినపుడు దివాన్జీగారు రిక్తహస్తం చూపించగా చెప్పినట్లు శతావధానులు కీ. శే. వెల్లపిల్ల వేంకటశాస్త్రి గారు వక్కాణించి యున్నారు. శ్రీనాథునకు "బొడ్డుపల్లె" వలె రామకవికి "బంటుమిల్లి" కూడా యాచ్నా దైన్యాన్ని అంటగట్టింది! ఈ విషయంలో శ్రీనాథునకు, రామకవికి సన్నిహితత్వం వున్నది గాని సమకాలీనత్వం సాపడగంలేదు. బంటుమిల్లి కృష్ణా మండలములోనిది. మొగలితుర్రు సంస్థానము గూడ కృష్ణా మండలము లోనిదే! తిట్టు పద్యములలో నుదహరింపబడిన "ఉంగుటూరు" కూడ కృష్ణా మండలములోనిదే! అందుచేత రామకవి కృష్ణా మండల నివాసియై తన మనుగడకు తిట్టుకవిత్వముపై నాధారపడి, రసిక శేఖరుడుగా, వేశ్యాలోలుడుగా జీవితమును సాగించి యుండెనని స్పష్ట మగుచున్నది.

రామకవిగారి యాచనా పద్ధతిలో గూడ నొక శీవి రాజసము, శృంగార భావోన్మీలనము, అధికార దర్పము తొంగి చూచుచుండు ననుట కీ క్రింది పద్దెమే నిదర్శనము :

ఉ. రాతిరి మేము వస్తి, హయరత్నము వస్తి కవీంద్రగాయక
వ్రాతము వస్తి వర్మ సచివాగ్రణీ వస్తి .... ....
.... .... .... .... .... ....
.... .... .... పస్తికనేమి చెప్పుదున్.

ఈ పద్యములో రామకవిగారికి "పలివెల" వేశ్యకాంతలతో గూడ సంపర్క మున్నట్లు తెలియవచ్చుచున్నది. "పలివెల" గ్రామము ప్రస్తుతములో తూర్పుగోదావరి జిల్లాలో నున్న గ్రామమే! అందువలన నీ రామకవి దేశాటనలో వివిధ మండలములు దిరుగుచూ తన తిట్టు కవిత్వముచే నా మండలనాథుల బెదరించి గ్రాసవాసముల, వర్షాశనముల సంపాదించి, శృంగారిగా కాలము బుచ్చెడువాడని స్పష్టపడుచున్నది! ఈ పద్యములో రామకవి యింటిపేరు సార్థకముగా తురగాధిరూఢుడై విహరించుచుండెననుట గూడ ద్యోతక మగుచున్నది. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగా రితనిది యగునో, కాదో యను సందియము వెలిబుచ్చిన,

విప్పుతల ముండ తల్లి వివేకి గాదు
యెన్ని దిట్టిన నా భార్య యేభ్యరాశి
అన్నిటికీ దోడు నా కాలు అవటికాలు
రామకవి గాని బ్రతుకు శ్రీరామ! రామ!

అన్న పద్యము అక్షరాలా రామకవిగారిదే యని నొక్కి వక్కాణింప దగినదే! భార్య యేభ్యరాశి గావుననే రామకవి సంసార సుఖమునకు మొగము వాచి వేశ్యాలోలుడై యుండును! పాదద్వయములో నొకటి యవటి దగుటచేతనే నిత్యము తురంగాధిరోహణావసరము కలిగియుండవచ్చును! క్రియలో మాట— తురగా రామకవి పద్యములను తిలకించినచో తెలుగు కవులలోనే గాదు సంస్కృత కవులలో గూడ నింతటి తృణీకృత బ్రహ్మ పురందరుడు లేడనే తోస్తుంది! అతని ధారలో నొకానొక విధమైన "వైశిష్ట్యం" ధారావాహికంగా గోచరిస్తూ ఉంటుంది! ఏది ఏమైనప్పటికీ రామకవి ప్రబంధ కర్తగా దీపింపక పోవడం, తిట్టుకవిగా నిలిచిపోవడం తెనుగు సాహిత్యానికి లోటు అనే చెప్పవలసి యుంటుంది!

ఈ పై కారణాలబట్టి తురగా రామకవి శ్రీనాథుని సమకాలీను డనుట యెంతమాత్రము సమర్థనీయముగా కానపించుటలేదు! మరి— శ్రీ సాపయ్యశాస్త్రిగా రేల యిట్టి నిర్ణయము చేయ సాహసించిరో దురూహ్యము.

# ఆతిథ్యము

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

### పాత్రలు :

1. భావకవితాసరస్వతి
2. ఆమెతమ్ముడు  3. అతిథి

ఆగు మాగుము తెరువరీ ఆయాన
ఖేద మ్మపనయింపుము
మా గృహాంగణ కుసుమసముదయ
మధువు లియ్యవిగో

నీరజాప్త విశాలకిరణో
న్మీలితములై పరిమళించెడు
వారి రుహముల గుమ్మరిలిన తు
షార మి య్యదియే

మావి పూగుచ్ఛముల పసపు
న్మత్త మధుప చయమ్ము లాడగఁ
బ్రోవు వడిన పరాగమ్ములు వి
భూతి యియ్యదిగో

తూరుపున సిందూర రాగము
లొలుక తొయ్యలు లేరి తెచ్చిన
పారిజాత ప్రసవమాలా
బహుళ మియ్యదియే

ఆగు మాగుము తెరువరీ ఆయాస
ఖేదము నపనయింపుము
మా గృహాంగణ కుసుమసముదయ
మధువు లియ్యవిగో.

ఒక అతిథి : ఆహా, ఏమి మధురమైన స్వాగతము, ఏమి రమణీయమైన ఆతిథ్యము. అమ్మా నీ పేరేమి ?

సరస్వతి : ఆంధ్రభావకవితాసరస్వతి.

అతిథి : పూర్వ మిచ్చట లేవే ? ఎప్పుడు వచ్చితివి ? ఈ యిల్లు మీదేనా ?

సర : మాదే.

అతిథి : ఇంత పెద్ద యిల్లు ఎప్పుడు కట్టిరమ్మా. మీ అమ్మగారి పేరేమి ?

సర : ఆంధ్ర సరస్వతి.

అతిథి : నే నెప్పుడు చూడలేదు. ఎప్పుడు పుట్టితివి ? ఎట్లు పెరిగితివి ?

సర : మేము దేవతలము. మాకు పుట్టుటయు, పెరుగుటయు నుండదు. మేము పెరిగియే పుట్టుదుము.

అతిథి : మీ జన్మహేతు వెవరు ?

సర : అయ్యా, తమరు నన్ను చూచుచుండిరిగదా. నేను కనుపించుటమాత్రమే. మేము భావమూర్తులము. నా ప్రధానభావహేతువు లిద్దరున్నారు. ఒకాయనపేరు గురజాడ అప్పారావు. వినండి అదిగో వారి సందేశం.

*　　*　　*　　*

పాట, కోరస్ :—

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

పాడి పంటలు పొంగి పొరలే
దారిలో నువు పాటుపడవోయ్
తిండి కలిగితె కండ గలదోయ్
కండ గలవాడేను మనిషోయ్

ఆకులందున అణగి మణగి
కవిత కోకిల పలుకవలెనోయ్.
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్.

*　　*　　*　　*

అతి : రెండవ ఆయన ఎవరు ?

సర : ఆయన పేరు రాయప్రోలు సుబ్బారావు. వారి ప్రబోధం కూడా ఆలకించండి.

*　　*　　*　　*

పాట : కోరస్ :—

ఏదేశ మేగినా యెందు కాలిడినా
ఏ పీఠమెక్కినా యెవ్వ రెదురైనా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండుగర్వమ్ము

లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరు లింకెందు
ఏ పూర్వపుణ్యమో యే యోగబలమొ
జనియించినాడవీ స్వర్గలోకమున
ఏ మంచి పూవులన్ ప్రేమించినావో
నిను మోచె నీ తల్లి కనక గర్భమున.

*        *        *        *

అతిథి : వీ రిద్దరా నీ జన్మహేతువులు. ఆ యిద్దరీ గురించి కొంచెము చెప్పుము.

పర : అయ్యా, నాకంటె మా తమ్ము డున్నాడు. అతని కివన్నియు నెక్కువ తెలియును. మీ రూరకే యాతిథ్యమును స్వీకరించుటకు వచ్చి రనుకొంటిని. నే నందరకాతిథ్య మిచ్చుటకు మాత్రమే నిచ్చట నుంటిని. మా చరిత్ర కావలసినచో మా తమ్ముడు చెప్పగలడు. అతని కన్నియు బాగుగా తెలియును.

అతిథి : నీవు గ్రాంథికభాష మాటాడుచున్నావు. నీ జనన హేతువులు వాడుకభాషలో వ్రాసారు.

పర : అదిగో మా తమ్ముడు. అతడు మీ కిష్టము వచ్చినట్లు మాట్లాడ గలడు.

తమ్ము : నమస్తే. ఎవరండీ మీరు ? అదేమిటో యీ రోజుల్లో హాయిగా వచ్చి మంచి పళ్ళు తేనె ఆరగించి తృప్తిగా పోరు. అదేమి టిదేమిటని అడుగుతారు.

అతిథి : తెలియకుండా తింటే రుచేమిటయ్యా ?

తమ్ము : సరే. మీకేం కావాలి ?

అతిథి : గురజాడ రాయప్రోలులను గురించి కొంచెం చెప్పాలి. ఇద్దరిలో మొద లెవరు ?

తమ్ము : ఒకాయన విజయనగరంలో ఉంటే ఇంకొకాయన బాపట్లలో ఉన్నాడు. వారు వ్రాసిన మొదటి పాటలకు తారీఖులు వేయలేదు. ఎల్లా తెలుస్తుంది ? అదట్లాఉంచి యిద్దరూ మహాకవులే. గురజాడ అచ్చంగా పాటలే వ్రాశాడు. రాయప్రోలు పద్యాలు కూడా వ్రాశారు. తృణకంకణం మొదలైన మహా కావ్యాలు వ్రాశారు.

అతిథి : సరే. వా రిద్దరూ మొదలు పెట్టారు. మరి మీ భావ కవిత్వాన్ని పెంచినవా రెవరు ?

తమ్ము : పెంచినవారి మాట ఆట్లా అట్టేపెట్టి ఆ మొదటి వారిలోను మరికొందరు గొప్పవా రున్నారు. వారిని గురించి తెలుసుకోరా ?

అతిథి : అయ్యో అంతకంటె కావలసిన దేమిటి ?

తమ్ము : అందులో ఒకాయన అబ్బూరి రామకృష్ణరావు. అడుగో ఆయన . . . . .

*        *        *        *

పాట. : ఓ విశాలావనీ
శోభాతిపావనీ
ఆరంభ పుణ్యక్షణముల నీశుడు వినరిన నాటి
నీ యాదిసౌభాగ్య మెటుల వెళ్లెనో ? భవదీయ కాటి
యాకువచ్చని యాకులో
పండువెల్తురు రేకులో !

*        *        *        *

అతి : ఈయన యింకేమైనా వ్రాసాడా ?

తమ్ము : నదీ సుందరని ఒక నాటకం వ్రాశాడు. గొప్ప విమర్శకుడు. నాటకకళావేత్త.

అతి : నీ బండారం తెలిసింది. ఇదేనా భావ కవిత్వ మంటే ? భావకవిత్వ మేమిటయ్యా ? భావంలేని కవిత్వ ముంటుందా ?

తమ్ము : ఎందు కుండదు ? పూర్వకవులు వ్రాస్తారు. వనం తము, కోకిల, కవిసమయాలు అంతే. భావలక్షణమే ఉండదు.

అతిథి : బాగాచెప్పావు. అలాంటి వ్యర్థకవులు మీలో మాత్రం ఉండరా ?

తమ్ము : ఉంటారనుకో. ఎందు కుండరు ? ఎప్పుడూ ఉంటారు. ఆ మాట మీ రనకూడదు. నేను ఒప్పుకోకూడదు. భావ కవిత్వం అన్న మార్గాన కొందరు మహాకవులు ఆంధ్రసరస్వతిని తళతళలాడించారు. వారు మూలస్తంభములై నిల్చారు. వారిని పురస్కరించుకొని భావకవిత్వమనే ఒక శాఖ వెలిసింది. నన్నయాదుల చేత పురాణకవితకు మల్లే, పెద్ద నాదులచేత ప్రబంధకవితకు మల్లే, కొందరు మహానుభావులచేత ఈ భావకవిత్వమన్నమార్గం ఆంధ్రసరస్వతికి అలంకారాలు చేకూర్చింది.

అతిథి : వారి అందరిలో మేటి యెవరు ?

తమ్ము : అలా చెప్పటానికి వీలులేదు. కవిత్రయంలో మేటి యీయన అని అనటం ఎల్లా ? ప్రబంధకవులలో మేటి యీయన అనటంఎల్లా ?

అతిథి : కవిసం వలుగు రైదుగురిని చెప్పవచ్చును గదా.

తమ్ము : చెప్పవచ్చు. దేవులపల్లి కృష్ణశాస్త్రి ఒకడు. నన్నయ, తిక్కనలు మొదట యెట్లాగో తరువాత

పెద్దన్నగా రెలాగో భావకవిత్వానికి కృష్ణశాస్త్రి అట్లాంటివా డనవచ్చు. నాకు గట్టిగా చెప్పటానికి భయంవేస్తున్నది. ఎందుకంటే పెద్దన్న గొప్ప వాడూ అంటాం. పింగళిసూరన్న ఎందుకుగాడు.? భట్టుమూర్తి ఎందుకు కాదు అంటారు ?

అతిథి : మరి కృష్ణశాస్త్రి పేరు చెప్పావుగా.

తమ్ము : చెప్పాను. ఎవ్వ రేమన్నా భావకవిత్వ మనేదానికి రూపమిచ్చి పెంపొందించినవాడు కృష్ణశాస్త్రే. తక్కిన వాళ్లు ఒక అడుగు అక్కడా ఒక అడుగు ఇక్కడా వేశారు. కృష్ణశాస్త్రి అచ్చంగా భావకవిత్వమే వ్రాస్తాడు. అదీ అతనివైశిష్ట్యం. అడుగో.

*    *    *    *

పాట : ఎవరో హా, ఈ నిశీథి
వెగటి నీడవోలె నిలిచి
పిలుతు రెవరో, మూగకనులు
మోయలేని చూపులతో, ఎవరో హా, ఎవరో హా.
ఇపుడా నను పలుకరింతురు
మోయలేని నీరవగళ
మున జలించు కోరికతో
ఇపుడా నను బలుకరింతురు.
ఎవరని యీ రేయినిదుర
హృదయ మదర, వేయి చేయి
చాయలాడ పెనుచీకటి
సైగలతో నా కన్నుల
రక్తమురల లాగికొందురు.
ఎవరో నా హృదయవాళ
మేలా తునియలుగా నా
విర్శివవు జీవితమ్ము
నిట వదలుదురా ?
ఎవరో హా !
ఎవరో హా !
ఇపుడా నను పలుకరింతురు ?

*    *    *    *

అతిథి : అలాగా. ఇప్పుడు నాకు భావ కవిత్వ మంటే అర్థ మయింది.

తమ్ము : అంటే అర్థం కాలేదన్నమాట.

అతిథి : అదేమట్లా అంటావు ?

తమ్ము : భావ కవిత్వ మనేది అర్థమయ్యేవిషయం కాదు. హృదయానికి అవగతమయ్యే విషయం. నీ హృద యంలో ఏదో తారాడుతుంది. అది బాధగా ఉంటుంది. ఆ బాధలో ఒక సుఖం ఉంటుంది. జీవుణ్ణి అలా కద లిస్తుంది. ఇదమిత్థమని మనం చెప్పలేంది. అదే భావ కవిత్వం అంటే. అది వ్రాయగలవా డొక్కడే. అతని పేరు కృష్ణశాస్త్రి. అతని ననుసరించి చాలామంది వ్రాస్తారు. ఎవ్వడూ అతని నందుకోలేదు. అతని కాంతే మా సౌధం అంతా వ్యాపించిఉంది.

అతిథి : కాని మీ మేడలో తెలిసే భాగాలు చాలా ఉన్నాయి. చాలా సుమనోహరంగా కూడా ఉన్నాయి.

తమ్ము : ఆ మూల వాగు. అది యెట్లా ఉంది ?

అతిథి : నీవు చెప్పినదాని లక్షణంగా ఉంది.

తమ్ము : కొంత ఆ లక్షణం కన్పిస్తున్నది.

అతిథి : అతని పేరు బసవరాజు అప్పారావు. అత డొకడు అంత ఎత్తు పోకపోయినా దానికి వ్యాఖ్యానప్రాయంగా వ్రాసినవాడు. అడుగో.

*    *    *    *

పాట : ఎదమెత్త నాటకై
పొదగుందరా, అంత
మది గల ఆహమ్మెల్ల
వదలిపోవునురా !

వల పెరుంగక బ్రతికి
కులికి మురిసే కంటె
వలచి విఫల మ్మొంది
విలపింప మేలురా !

చెలి వలపులేని నీ
కలిమి కాల్పనె ! వినుము
వలపు తీగనె జీవ
ఫలము కాయునురా !

ప్రేమకంటె ఎక్కు
వేముందిరా, ఎల్ల
కామ్య పదవుల కన్న
ప్రేమె యెక్కువరా !
ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ఏమింక వలెనురా ?

*    *    *    *

తమ్ము : అది భావకవిత్వం తెలియటానికి మార్గమన్నమాట. ఇప్పుడు నీకు మరికొన్ని విషయాలు చెబుతాను వింటావా ?

అతిథి : నా కీపూట యేమీ పనిలేదు. కాలక్షేపం చేద్దామని వచ్చాను. నీ వెంతసేపు కూర్చోమంటే అంతసేపు కూర్చుంటాను.

తమ్ము : నేను మాత్రం ఎంతసేపు కూర్చోపెట్టగలను? ఏమీలేదు. ఇందులో ఒక చమత్కారం ఉన్నది. ఈ భావకవిత్వమనే దాని బాహిరలక్షణాలు చూస్తే ఇవ్వివ్విగా కన్పిస్తవి. ఒకరి భాష అచ్చంగా గ్రాంథికం కాదు. అయినా గ్రాంథికమల్లే ఉన్నట్టుంటుంది. ఇది ఒక లక్షణం. రెండవది ఏదో తనలోని తలపోతలు చెప్పికోలుగా ఉంటుంది. మూడవది తన చెదరి పోయిన ప్రేమనుగురించి చెప్పుకొంటున్నట్టుం టుంది. ఆ ప్రేమ స్త్రీగతమల్లె ఉండి భగవంతుని నుండి తాను పొందేవిరహాన్ని సూచిస్తున్న ట్టుం టుంది. పూర్వఛందస్సును వదలిపెడ్తుంది, వదలి పెట్టదు. ఒక్కొక్కప్పుడు పూర్తిగా వదలిపెట్టి రూపము చేత భావ కవిత్వము, భావముచేత ప్రౌఢమైన పూర్వ కవిత్వ మల్లే ఉంటుంది.

అతిథి : ఇది చమత్కారంగా ఉందే. అట్లాంటివాణ్ణి చూపించు నాకు.

తమ్ము : ఆయన పేరు నండూరి సుబ్బారావు. అడుగో.....

*　　*　　*　　*

పాట : సుక్కెక్క డున్నదో సూడవే చెల్లీ
బారెడైనా కొండపైకి సాగిందేమొ
సుక్కెక్క డున్నాదో సూడవే చెల్లీ

తాను నిలిపిన గడుపు
దాటిపోనేలేదు—
కాలు సేతులు పక్క
కంటుకొని పోవాయి
సుక్కెక్క డున్నదో సూడవే చెల్లీ
బారెడైనా కొండపైకి సాగిందేమొ
సుక్కెక్క డున్నాదో సూడవే చెల్లీ

సుక్కతోనే కొండ
లెక్కెత్తు తున్నాడు
మబ్బొ, మనిసా, కొండ
మలుపు పరకాయించి

సుక్కెక్క డున్నదో సూడవే చెల్లీ
బారెడైనా కొండపైకి సాగిందేమొ
సుక్కెక్క డున్నాదో సూడవే చెల్లీ

వొక టొకటిగా మెట్లు
వొదిగి దిగి రావాలి
తోట యెలవల గల గ
లేటా యినదీ వమ్మ !

సుక్కెక్క డున్నాదో సూడవే చెల్లీ
బారెడైనా కొండపైకి సాగిందేమొ
సుక్కెక్క డున్నాదో సూడవే చెల్లీ !

నా సొగసు నన్నైన
సూసుకోనీడమ్మ
ఆవు మెళ్లో మువ్వ
లట్టె మోగిన వేటా !

సుక్కెక్క డున్నదో సూడవే చెల్లీ
బారెడైనా కొండపైకి సాగిందేమొ
సుక్కెక్క డున్నాదో సూడవే చెల్లీ?

*　　*　　*　　*

తమ్ము : ఇట్లా పూర్వగ్రంథాల్లో ఉండే నాయికాలక్షణం పరమరమణీయంగా చూపుతూ భాష మాత్రం వాడుకభాషని ఆదరిస్తాడు. ఈయనలో కూడ భావవిషయంలో కొన్ని గడుసు భావకవిత్వపు పోకడ లున్నయ్.

అతిథి : అది సరేకాని భావం భావకవిత్వంవలె, భాష గ్రాంథి కంగాను వ్రాసినవాళ్లు ఉన్నారు!

తమ్ము : అట్టే మాట్లాడితే వాళ్లే ఎక్కువ ఉన్నారు. అందరూ వాళ్లే నేమో. నిజానికి ఆ కృష్ణశాస్త్రి అట్లాంటివా డనవచ్చేమో. అతని రచనలోని ప్రధాన మైన పాటలక్షణంచేత అట్లా అనిపించదు.

అతిథి : ఈ నండూరి సుబ్బారావు వంటివా రెవరైనా ఉన్నారా ?

తమ్ము : ఒకని వంటివా డింకొక డున్నాడా అని అడగకూడదు. ఇదంతా సమూహంగా చూస్తే భావకవిత్వం అను కోవాలి గాని వేరే అనటానికి వీలులేదు. ఇందులో ఒక విలక్షణమైన కవి ఉన్నాడు. అతని పేరు కవికొండలవెంకటావు. ఇంకొక డున్నాడు. అతని పేరు అడవిబాపిరాజు. వీళ్లిద్దరు పాటలవలె వ్రాస్తారు. ఒక చమత్కారంగా ఊహిస్తారు. ఒక చమత్కారంగా

వ్రాస్తారు. కవికొండలలో ఉన్న విలక్షణత్వం వట్టి కోటానికి పిల్లేదు. అడుగో.

*　　*　　*　　*

పాట. నిన్ను దలపోయుచునె నేఁ జిదుముకొని పోతి
పచ్చికాయలు వట్టి పూవుల్ల రేకుల్ల
ఫలమెంచనైతి
లోపలి తేనెఁ గొననైతి.

అల సముద్రపుటొర నైలిమరుగు కెరటాలు
ఇసుకతోఁ జీరు బుడగ లెత్తించుటలు గంటి
మునిఁగి ముత్తెపు మూట ముల్లె మోయగనైతి
నిన్నుఁ దలపోయుచునె నేఁ జిదుముకొనిపోతి
పచ్చికాయలు వట్టి పూవుల్ల రేకుల్ల.

కొండ నెత్తపుఁజెట్టు కొమ్మపైఁ దినఁదెన్ను
గనవచ్చు నొకచుక్క కాంతికళ నాపిస్తి
తెట్టతెన్నే పట్టు దిన్నె తెలియగనైతి
నిన్ను దలపోయుచునె నేఁ జిదుముకొని పోతి
పచ్చికాయలు వట్టి పూవుల్ల రేకుల్ల.

*　　*　　*　　*

అతిథి : ఆఁ, చాలా విలక్షణంగా ఉంది. ఆ అడవి బాపిరాజుగారు ఆయన్ను చూపించు.

తమ్ముడు : ఆయన వట్టి కవికాదు. గొప్ప నవలాకర్త. ఎన్నో గొప్పకథలు వ్రాసినవాఁడు. గొప్ప చిత్రకారుడు. అతను ఈ భావ కవిత్వం కూడా వ్రాశాడు. ఈ భావ కవిత్వం అతనికి హేల. కాని అతని కొన్ని రచనలు భావకవిత్వం పొలిమేరల్ని అట్లా ముట్టుకుంటాయి.

*　　*　　*　　*

యుగళగీతం:—

మువ్వా నేమా కలసి
పువ్వులో తావిలా
తావిలో తలపులా
మువ్వా నేమా కలసి
కోకిలా గొంతులా
గొంతులో కోర్కిలా
మువ్వా నేమా కలిసి
వెన్నెలా వెన్నెలా
వెన్నలో వెలుగులా
మువ్వా నేమా కలిసి
వింగిలో నీడలా
నీడలో విదరలా

*　　*　　*　　*

అతిథి : నీవు చెప్పినట్లు వీళ్లలో భావం, భావ కవిత్వ స్ఫురణలా ఉంటుంది. భాష మాత్రం కొత్తగా ఉంటుంది. భాష అచ్చగా పూర్వభాషల్లే ఉండి, భావంచేత భావకవు లనిపించుకునేవాళ్లున్నారా ?

తమ్ముడు : అసలు ఉన్నదే వాళ్లు. ఉన్న హేమాహేమీ లందరూ వాళ్లే. వాళ్లొకొకప్పుడు పాటలవలె వ్రాయ బోతారు. అదీ గ్రాంథిక భాషల్లనే ఉంటుంది. వాళ్లు బాగా పూర్వకావ్యాలు చదువుకొని పరిశ్రమ చేసి కాలాన్నిబట్టి యీ మార్గానికి వచ్చినవాళ్లు.

అతిథి : వాళ్లందరలో ప్రధానమైనవాణ్ణి చెప్పు—

తమ్ముడు : ఆయనపేరు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి. అడుగో ఆయన్ని చూచి నీ వనుకొనేది నీవనుకో.

*　　*　　*　　*

సంచలనశీలమ్మైన వాస్వాంత మెట్లు
విల్చుకొన్నావు నీపయి నిశ్చలముగ
ఎట్లు హృదయేశ్వరీ నీ కహీన గరిమ
గలిగె నింత మహా వశీకరణశక్తి
అన్యవశవర్తిగాక యిచ్ఛానుసార
గతిని జరియించు నీ మతంగజము నొర
కట్టినావు భవద్గుణ గణముతోడ
ఇట్టి యాథోరణత నీకు నెట్లు గలిగె.

విస్మయోద్దీపకము భవద్విజయ మహిమ
దేవి నా కించుకేనియు దెలియదాయె
ఇంత సులువుగ నీ మతిమంతు డధిక
గర్వియెట్టుల నీ పదాక్రాంతు డయ్యె

ఎంతటి ప్రభావమే లేనిదీ విధాన
భవ్య దివ్య మహా స్వరూపంబు దాల్చి
దేవి ఆత్మాభిమాని నతిస్వతంత్రు
చేసికొన్నావు దాసు విచిత్ర మొదవ.

అయ్యయో యేల చూచితి నట్లు నన్ను
ఆ దినమ్మున మధుర సాయాహ్నమందు
దేహళిని నిల్చి మోహినీ దృష్టిరోధ
పథము వెంబడి జనెడి విభ్రాంత హృదయు.

*　　*　　*　　*

అతిథి : ఈయన అందరికంటె గొప్పవాడా ?

తమ్ము : నీవు నా ప్రాణానికి బద్ధావు. ఎవరిని గురించీ ఆమాట అనగూడదు. అందరూ గుమ్మడికాయంతములవ్వాళే. ఒక్కొక్కని గొప్పతనం ఒక్కొక్క రీతిగా ఉంటుంది. ఒకనిలో రెండుమూడు గొప్పతనాలు కలసిఉంటై. ఈయన పలుమంది కవులకు గురువు. సాహితీసమితి అనిపెట్టి దానిలో చాలామందిని తయారు చేశాడు. అనేకమందికి ప్రోత్సాహ మిచ్చాడు. ఆయన్ని తల కట్టుగా చూచుకునేవాళ్ళు చాలామంది ఉన్నారు. ఆ 'ఆగు మాగుము తెరువరి' అన్న పాట వ్రాసిన కొడవటిగంటి ఆయన శిష్యుడు. వేదుల సత్యనారాయణ శాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామి మొదలైన ఎందరో కవులను కవులుగా యూరుచేసింది ఆయన. ఆయన మంచిపండితుడు. బహు భాషా వేత్త. అన్నింటికంటె ఆయన అనేకములైన పద్య గేయనాటకములను వ్రాసినాడు. పూర్వభారతదేశ మహాపండితుల చరిత్రములు గేయ నాటకములుగ వ్రాసినాడు.

అతిథి : ఆ వేదుల సత్యనారాయణశాస్త్రినిగూర్చి విన్నానే, ఆయన్ని గూర్చి యేమైనా చెప్పు.

తమ్ము : ఆయనకు గౌతమీ కోకిల అని బిరుదు. అతనికి పద్యరచన ఒక పరమమధురమైన హేల. అది ఒక తేనె పానకం. అతనిలో భావనగూడ చాల సుకుమా రంగా ఉంటుంది.

అతిథి : ఆయన పద్యాలు రెండు వినిపించు.

తమ్ముడు : అతడు పూర్ణిమ అని వ్రాశాడు. అది వింటావా?

అతిథి : వినటానికే కదా వచ్చాను.

తమ్ముడు : అదుగో . . . .

*     *     *     *

ఆ యుదయాద్రినుండి యరుణారుణమౌ
ముఖమెత్తి, గాఢ లజ్జాయుతయౌ నవోఢవలె
సందడి చేయక తొంగితొంగి లోలాయత దృష్టులన్
దశదిశాంతరముల్ పరికించి, శూన్యమై పోయిన
నా కుటీర పదమున్ గురుతింతువు
చాటు చాటునన్.
ఈ వలిగాడ్పు లెంత వడకించుచు నున్నను
నీ ప్రవాళరేఖావిలసన్ముఖంబు తడిగట్టెడు సిగ్గున
సంచలించినన్ మోవగరాని ప్రేమను
విముక్త గవాక్ష పథమ్ము డిగ్గి
నా ప్రేవకు వత్తు వెట్లొ పులకింపగ
నా తృణశీర్ణశయ్యయున్.

*     *     *     *

అతిథి : వంగభాషలో టాగోరు గీతాంజలి ఉన్నది. అట్లా ఎవ్వరూ వ్రాయలేదా ?

తమ్ము : ఎందుకు వ్రాయలేదు ? వేంకటపార్వతీశ్వర కవులని ఉన్నారు. వా రనేకగ్రంథాలు వ్రాసారు. అందులో ఏకాంతసేవ యని ఒకటున్నది. అది ముద్దు నుడుల మూట. అంతముద్దుగా మరియింకొకచోట తెలుగు బాస ఉండుననుటకు వీలులేదు. వారినోటికి వత్సక్త రమే రాదు. ఇదిగో . . . . . .

*     *     *     *

విరిదండ మెడలోన వేయుటే గాని
కన్నార నీ మూర్తి గాంచనేలేదు,
ప్రణమిల్లి యడుగులఁ బడుటయే కాని
చేతులారగ సేవ చేయనేలేదు.
నినుగాంచి ముగ్ధనై నిల్చుటేగాని
ప్రేమదేరగ బల్కరించనే లేదు
ఏమేమొ మనసులో నెంచుటే గాని
తిన్నగా నా కోర్కెఁ దెలుపనేలేదు
బోధంబులో సుప్తి పొడజూపఁబోలు
కనులలోఁ జూపులోఁ గావిరుల్ గ్రమ్మ
శుభ్రాభ్రపదములో నుడివుట్టబోలు
భక్తిలోఁ బూజలో భ్రాంతులు వొడమె
నాదంబులోఁ గంపనము పుట్టఁబోలు
తలఁపులోఁ బలుకులోఁ దడబాటు గదిరె
వెలుగులోఁ జీకటి విరిసెఁ గాబోలు
ఆనంద మందుటే యపచార మనుచు
నవశనై యుండుటే యపరాధ మనుచు
మదినెంచి యీ రీతిమాయలు సేయు
భావ్యమై తోచెనే ప్రాణేశ నీకు !

*     *     *     *

విన్నావు గదా ? ఎట్లా ఉంది ?

అతిథి : ఒక్కొక్కసారి ఒక్కొక్కవంటకం వడ్డించి ప్రతి సారి యెలా ఉన్నదంటే యెల్లా ? నీవు వొడ్డిస్తూ ఉండు. నేను తింటూ ఉంటాను.

తమ్ము : అన్నీ ఒకసారి వడ్డించటం ఎప్పుడూ పడదు. భావ కవిత్వం యొక్క లక్షణాలు నీకు చూపించాను. ఇంకా కొందర్నిగురించి చెప్తాను. అందర్నీ చెప్పలేదంటంమాత్రం న్యాయంగాదు. నీవు మాటిమాటికి మా యింటికి వస్తూ ఉండు. నేను రకరకాలైన రుచులు చూపిస్తాను. నేను ప్రధానుల్నే చెప్పుతున్నాను తప్ప అప్రధానులను చెప్పటంలేదు. అప్రధానులంటే భావకవిత్వం అనే మహావిషయం దృష్ట్యా అప్రధానులు కావచ్చు. అంతే

కాని కవితావిషయంచేతమాత్రం కాదు. ఇందాక చెప్పటం మరచిపోయినాను. చింతాదీక్షితులని ఒకాయన ఉన్నాడు. ఆయన ప్రధానంగా ముద్దుముద్దైన కథలు వ్రాసేవాడు. నడుమ నడుమ పాటలు వ్రాసేవాడు. అంతకంటె హొయ్యారంగా భావన చేసేవా ళ్లుండటం కష్టం. శబరి అనే నాటకం వ్రాశాడు. తప్పకుండా చదవాలి. వేదుల సత్యనారాయణ శాస్త్రి మార్గంలో మధురంగా చిక్కగా తీయగా పద్యరచన చేసేవా ళ్లున్నారు. కొడాలి ఆంజనేయులు మొదలైనవారు. ఇంతకంటె భిన్నమైన శైలులలో కొందరు వ్రాస్తారు. పింగళి, కాటూరులు సుకుమారమైన మార్గమున వ్రాస్తారు. దువ్వూరి రామిరెడ్డి చాలాగ్రంథాలు వ్రాసాడు. మధురమైన రచన చేస్తాడు. ఆయన్ని జేమ్స్. హెచ్. కజిన్స్ మెచ్చుకున్నాడు. ఆయన బ్రతికిఉంటే ఖండఖండాంతర ఖ్యాతి గడించేవాడు.

అతిథి : సరేకాని యెంతసేపూ భావకవిత్వం భాష, భావం ఈ రెంటిని గూర్చే చెప్పావు కాని మానవ హృదయంలో దేశభక్తి, ప్రేమ, దేశచరిత్ర మొదలైనవాటిని గూర్చి చెప్పలేదు.

తమ్ము : ఈ కవిత్వమంతా దానిలో నుంచే పుట్టింది. ప్రేమ కవిత్వానికి ఒక విలక్షణమైన వ్యక్తి ఉన్నాడు. అతని పేరు నాయని సుబ్బారావు. అతని రచన పింగళి సూరన్న, నాచన సోమన్నల మార్గాన ఉంటుంది. అతని ఊహ తెలుగు దేశపు సంస్కృతిని పరిమళిస్తూ ఉంటుంది. అత విప్పుడు జన్మభూమి అని ప్రబంధం వ్రాస్తున్నాడట. అంతటి సౌకుమార్యంతోకూడిన ప్రౌఢ రచన చేయటం చాలాకష్టం.

అతిథి : అతని పూర్వపుపద్యమేమైనా వినిపించు. తెలుగు దేశపు సంస్కృతిని పరిమళిస్తుందన్నావే.

తమ్ము : అయితే విను.

* * * *

ఇది పగిలిపోవు నను భయ మ్మింతవఱకు
ఈ తలంపున, నానంద మిపుడు పొంగు
పగిలిపోయిన చెక్కల పట్టువిడువ
కీవు పాటో విధాన మీ దించెదవని.

ఇది పగిలిపోవునను భయ మ్మింతవఱకు
ఈ తలంపున, నిపు డుల్ల మిగురులెత్తు
తునిగిపోయిన చెక్కలతో పయోధి
గర్భమున రత్నరథమీవు కట్టెదవని.

ఇది పగిలిపోవు నను భయ మ్మింతవరకు
ఈ తలంపున, నిపు డాత్మ కింత శాంతి
విరిగిపోయిన చెక్కల దరికి జేర్చి
నీ చితికి కాష్ఠములుగ మన్నించెదవని.

* * * *

అతిథి : ప్రేమ కీయన. దేశభక్తికి ?

తమ్ముడు : దేశభక్తికి కొడాలి సుబ్బారావు. అతడు హంపీ క్షేత్రమని రసవంతమైన కావ్యాన్ని వ్రాసాడు.

అతిథి : స్త్రీలల్లో ఎవ్వరూ లేరా ?

తమ్ముడు : తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ, సీతాదేవి మొదలైనవారు చాలామంది కలరు. స్త్రీ రచయితలు అన్న గ్రంథం చూస్తే తెలుస్తుంది.

అతిథి : మరి హరిజనుల్లో ఎవ్వరూ లేరా ?

తమ్ముడు : ఓరి నీ కడుపుడకా ? ఎంత ప్రశ్న వేశావోయ్ ! లేరా అంటావూ ! భావకవితా తారాపథంలో ధగద్ధగాయమానంగా వెలిగిన దివ్యతార ఉన్నాడోయ్ ఒకడు. అతని పేరు జాషువా. అతడు తెలుగు దేశాన్ని తన మధుర కవితా ప్రవాహంచేత ఉర్రూత లూగించివేశాడు.

అతిథి : అయితే అతని పద్యం ఒకటి చదువు.

తమ్ముడు : ఇదిగో శిశువు అన్న శీర్షికలోని పద్యం.

* * * *

బొటనవ్రేల ముల్లోకములు చూచి లోలోన
నానందపడు నోరులేని యోగి
తలిదండ్రుల తనూవల్లికా ద్వయికి న
వ్వియ బెట్టు తొమ్మిది నెలల పంట
అమృతంబు విషమును వ్యత్యాస మెరుగ కా
స్వాదింప జను వెఱ్ఱిబాగులాడు
అనుభవించుకొలంది నినుమడించుచు మరం
దము జాలువారు చైతన్య ఫలము
భాష రాదు వట్టి పాలు మాత్రమె త్రాగు
నిద్రవోవు లేచి నిలువలేడు
ఎవ రెరుంగ రితని దే దేశమో కాని
మొన్న మొన్న నిలకు మొలిచినాడు.

* * * *

అతిథి : ఇంకా ఎవరిని గురించైనా చెప్పాలా ?

తమ్ముడు : ఎవరూ లేరు.

అతిథి : జ్ఞాపకం చెయ్యనా ?

తమ్ముడు : ఓహో, అవును కరుణశ్రీ ఉన్నాడు. ఆయన పేరు జంధ్యాల పాపయ్యశాస్త్రి. ఆయనవి శిరీష కుసుమ పేశల సుధామయోక్తులు.

అతిథి : ఆయన నెలా మరచిపోయినావు ?

తమ్ముడు : అబ్బాయీ, మన ఇంట్లో విందు చేస్తున్నాం. ఎవరిని పిలవకపోతే తగాదా వస్తుందో వార్ని గూర్చి నంత శ్రద్ధ మనకైన వాళ్లనుగురించి ఉండదు.

అతిథి : అయితే నేను వెడుతున్నాను.

తమ్ముడు : అదేమయ్యా, ఇంతా విని వెడుతున్నా నంటావు.

అతిథి : అబ్బాయీ, ఒకమాట చెబుతున్నా విను. నాకు కవిత్వం రాదు. నాకు భాషాజ్ఞానం లేదు. ఏదో తెలుగువాణ్ణి. కవిత్వాలూ అవీ చదువుతూ ఉంటే వినటం అలవాటు గలవాణ్ణి. అందుచేత మంచివద్యం అంటూ ఉందని చదివితే సంతోషించగలను. కాని నా కొక్క అనుభవం ఉంది. వీళ్లందరూ కవులే. చాలా బాగా వ్రాస్తారు. వీళ్ల కవిత్వం వ్రాసేటప్పుడే మహానుభావులు గాని లోకంలో ప్రవర్తించటంలో అందరివంటి వాళ్లే. వాళ్ల కవిత్వం వింటే వాళ్ళు దేవత లనుకుంటాం. తీరా దగ్గరకు వెడ్తే వాళ్ల ప్రవర్తన చూస్తే వాళ్ల కంటే మనమే మంచివాళ్లమనిపిస్తుంది.

తమ్ము : నీ కటువంటికవి గావాలన్నమాట.

అతిథి : ఉన్నాడా ?

తమ్ముడు : ఎందుకు లేరయ్యా ?

అతిథి : ఒకణ్ణి చెప్పు.

తమ్ము : తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

అతిథి : ఆత్మకథ వ్రాసాడూ, ఆయనా ? ఆ ? ఒప్పుకొన్నాను. వెడుతున్నాను.

తమ్ము : బలేవాడవు. తెలంగాణా కవులున్నారు. అంత సత్పురుషుడు కావాలన్నావు కదా. అభినవపోతన్న వానమామలై వరదాచార్యులున్నాడు. నీ కెంతమంది కవులు కావలిస్తే అంతమంది ఉన్నారు.

అతిథి : చాలులే నే వెడుతున్నాను.

తమ్ము : మా అమ్మాయి ఒక పాట పాడుతుంది వినిపో.

అతిథి : ఎవరిదా పాట.

తమ్ముడు : ఎవరిది కావాలి ?

అతిథి : కృష్ణశాస్త్రిదైనా, నండూరి సుబ్బారావుదైనా—

తమ్ముడు : సరే.

* * * *

పూలబాసలు తెలుసు యెంకికీ ?
పూల మనసులు తెలుసు యెంకికీ ?
పూల మొక్కల నీటి
జాలుగని నిలుసుండి
పూలన్ని నీపాలె
ఆలించె నంటాది

పూలబాసలు తెలుసు యెంకికీ ?
పూల మనుసులు తెలుసు యెంకికీ ?

పూలంటుకాలంటె
పున్నెముందంటాది
పగలమారీ పడును
నగ దొడిగె నంటాది

పూల బాసలు తెలుసు యెంకికీ ?
పూల మనుసులు తెలుసు యెంకికీ ?

తెరలెత్తి పూ పడవ
పరిగెత్తుతా వుంటె
దారెంట పూ లొంగి
దణ్ణమిడె నంటాది

పూల బాసలు తెలుసు యెంకికీ ?
పూల మనుసులు తెలుసు యెంకికీ ?

పూలతో వియ్యాలు
పూలల్లో కయ్యాలు
మావల్లే వస్నుంచి
తానె పూ కానేమొ

పూల బాసలు తెలుసు యెంకికీ ?
పూల మనుసులు తెలుసు యెంకికీ ?

# మొగలి రేకులు

## "హితశ్రీ"

"నేను సుదినం" అన్నాడు దాసు.

"అవును. తిథివార నక్షత్రాలు దివ్యంగా ఉన్నాయి" అన్నాడు డాక్టర్ రావు.

"వాటిసంగతి ఎలాఉన్నా విందు దివ్యంగా ఉంది" అన్నాడు దాసు.

"పరాయి ఖర్చుమీదయితే అన్నీ బాగానే ఉంటాయి" అందుకున్నాడు డాక్టర్. అందరూ నవ్వారు. జగన్‌మోహనరావు ఎం. ఏ. ఎల్. ఎల్. బి. ప్యాసయ్యాడు. ఎం. ఏ. లో క్లాసువచ్చింది. ఉత్సాహంతో చిన్న విందు ఏర్పాటు చేశాడు. ముఖ్య స్నేహితులు డాక్టర్ రావు, అడ్వకేట్ దాసు, కాబోయేభార్య అని అందరూ అనుకుంటూఉన్న రజని హాజరయ్యారు. వేరే ఎవర్నీ పిలవలేదు. జగన్‌మోహనరావు ఇంటర్ జూనియర్ చదువుతుండగా, రావు బి. ఎస్. సి. ఫైనలియరూ, దాసు బి. ఏ. ఫైనల్ ఇయరూ చదువుతూ ఉండేవారు. ఆ సంవత్సరం ముగ్గురూ హాస్టల్లో ఒకేగదిలో ఉన్నారు. ఆ పరిచయమే క్రమంగా వృద్ధిపొంది, గాఢ స్నేహంగా మారింది. రజని జగన్‌మోహనరావు మేనమామ కూతురు. బి. ఏ. ప్యాసయింది. ఇద్దరికీ వివాహం దాదాపు నిశ్చయమైపోయింది. అయితే చదువు పూర్తయేదాకా జగన్‌మోహనరావు వివాహాన్ని వాయిదా వేశాడు.

"ఈ సందర్భంలో జగన్‌ని మన అందరి తరఫునా అభినందిస్తున్నాను." డాక్టర్ అన్నాడు. వెంటనే అందరూ చప్పట్లు కొట్టారు.

"మన స్నేహితుడిని పొగడటం నా కిష్టంలేదు కాని—"

"అవసరం" డాక్టర్ మాటల్ని మధ్యలోఆపి, అందుకున్నాడు దాసు.

"అతను తెలివైనవాడని నా నమ్మకం. జీవితప్రాంగణంలో అడుగుపెడుతున్నాడు. ఎప్పుడూ వెలుగుబాటమీదే ప్రయాణిస్తాడని ఆశిస్తున్నాను." కొంచెం కవిత్వపు ధోరణిలో అన్నాడు డాక్టర్.

"ఎప్పుడూ ఏం ప్రయాణం? కొంచెం విశ్రాంతి తీసుకోటం అవసరం" అని నవ్వాడు దాసు.

"అవునవును. ఈ రోజుల్లో ప్రయాణంఅంటేనే భయం వేస్తోంది. ఒకటే రద్దీగదా!" చిరునవ్వుతో అన్నాడు జగన్.

రజని అర్థవంతంగా నవ్వి, "పాపం, ఎప్పుడూ థర్డ్‌క్లాస్ ప్రయాణమేకదూ?" అంది.

"ఫస్ట్‌క్లాస్ ప్రయాణం నా కిష్టంలేదు. జనంలో కలిసిమెలిసిఉంటేగాని బాగుండదు నిజంచెప్పాలంటే. కాని నాన్న ఊరుకోడుగా. నెలరోజులముందునించే రిజర్వేషన్ అని గొడవ చేస్తాడు" అన్నాడు జగన్.

"బాగుంది. లేక కొందరు ఏడిస్తే, ఉండి కొంద రేడుస్తారు" అన్నాడు దాసు.

"లేకపోతే, దర్జాగా ఫస్ట్‌క్లాస్ ప్రయాణం చేసేవాళ్ళకి థర్డ్‌క్లాసు మనసేమిటి?" అంది రజని దాసుని సమర్థిస్తున్నట్టుగా.

"అది మనుషుల స్వభావాన్నిబట్టి ఉంటుంది. సరే, ఈ తీకదంపుడుకేం, ముందు కార్యక్రమమేమిటి?" అన్నాడు డాక్టర్.

"అదే ఆలోచనీయాంశం" అన్నాడు జగన్.

"కొంపదీసి బల్లకట్టవుకద?" భయపడ్డాడు దాసు.

"ఏం, పోటీకొస్తానని భయమా?" నవ్వాడు జగన్.

"పోటీ, వల్లకాడు. మన సంపాదన చూస్తూనే ఉన్నావుగా."

"కొంచెం ఓపిక పట్టాలి."

"లాభంలేదు బ్రదర్. జిల్లామునసబుగిరికి అప్లికేషన్ పారేశాను. అదొస్తే వచ్చినట్టు. లేకపోతే బల్ల తిప్పేస్తాను."

"అంటే?"

"సి. పి. దాస్, ప్రొప్రయిటర్, దాస్ ట్రేడింగ్ కంపెనీ. అన్నట్టు జగన్, నువ్వు వ్యాపారం చేయరాదూ?"

"ఏం వ్యాపారం?"

"ఉదాహరణకి షేర్లవ్యాపారంపెట్టొచ్చు. లేకపోతే పెద్దపెద్దకంపెనీలకి ఏజెన్సీలు తీసుకోవచ్చు."

"ఏం డాక్టర్?"

"వ్యాపారంవిషయంలో సలహా కావలిస్తే ఏడుసార్లు దివాలాతీసినవాడిని అడగమన్నారు."

అందరూ నవ్వారు.

"నామాట విని ఐ. ఏ. ఎస్. కి కట్టరాదూ?" అంది రజని, కొంచెం అధికార పూర్వకంగా.

"మళ్ళీ చదువా?"

"ఎంత. నాలుగైదు నెలలు కష్టపడి చదివితే జీవితాంతం సుఖపడొచ్చు" అంది రజని ఆశగా.

"ఐ. ఏ. ఎస్. సర్టిఫికెట్ జీవితంలో సుఖపడటానికి టిక్కెట్టు కాదుగా — సుఖపడతావని గ్యారంటీ ఏమిటి?" అన్నాడు జగన్.

"అలా ఎందుకనుకోవాలి?" అంది రజని అర్థంకాక.

"పోనీ సుఖపడొచ్చనే అనుకున్నా, సుఖమే పరమావధి కాదేమో. జీవితం పూర్తిగా జీవించాలంటే—"

రజని మధ్యలోనే అడ్డొచ్చింది.

"వేదాంతం మానెయ్యి జగన్."

"అయినా ఒకరికింద ఉద్యోగం చెయ్యటం ఏమంత ఘనం?"

"అది ఉద్యోగం హోదానిబట్టి ఉంటుంది."

"ఓహో!" అని ఆమెవైపు చూశాడు జగన్.

"గెజిటెడ్ ఆఫీసరయితే ఎంత హోదా! ఎంత దర్జా!" అంది రజని ఆకాశానికి నిచ్చెనలు వేస్తూ.

"ఎంత హోదా, ఎంత దర్జా!" వెక్కిరించాడు జగన్.

"హాస్యంకాదు" అంది రజని కొంచెం కోపం తెచ్చుకుని.

"ఆ గానుగలో పడితే ఉపజ్ఞ పూర్తిగా నశిస్తుంది. నీ సలహా ఏమిటి డాక్టర్?"

"ఎవరికీ సలహా ఇవ్వొద్దని నాకు చాలామంది సలహా ఇచ్చారు"

అందరూ పక్కున నవ్వారు.

"డాక్టర్లూ, ప్లీడర్లూ కాకపోతే సలహా ఇచ్చేదెవరు? నీ ఉద్దేశంలో ఐ. ఏ. ఎస్. కి కట్టటం మంచిదేనా?

"నా కావిషయం తెలియదోయ్. అనుభవంఉన్న ఆఫీసర్లని ఎవరినైనా కలుసుకుని మాట్లాడు."

"అబ్బ! డాక్టర్, బతిమాలించుకోవాలని సరదాగా ఉందా"

"నా కో అభిప్రాయముండండీ, అది నీకు చెప్పగలిగేముందు అందులోని లాభనష్టాలు నేను బాగా తర్కించిఉండాలి. ఈ లాభనష్టాలు అనేక విషయాలకి సంబంధించినవి. వ్యక్తి అభిరుచుల్నిబట్టి ఈ అంచనా జరుగుతుంది. నా అభిరుచులే నీ అభిరుచులు కానవసరం లేదుగా. నీ అభిప్రాయాలేమిటో నీకంటే నాకు బాగా తెలియదు. వాటికి సంబంధించకుండా నేనేం చెప్పినా నీకు లాభించదు. పైగా అపకారం జరుగుతుంది."

"అభిప్రాయాలు తెలిసికోటంలో తప్పేముంది?"

"తెలుసుకోవచ్చు. అందువల్ల వివిధ వ్యక్తుల ఇష్టాయిష్టాలు తెలుస్తాయి. వాటి ప్రతిబింబాలు నీ మనసులో ప్రతిఫలించి, నిలిచిపోకుండా చూసుకోవాలి. మనోబలం గట్టిది కాకపోతే, అంతకుముందున్న సొంతభావాలు తుడిచిపెట్టుకుపోగల ప్రమాదంఉంది. నీకేది మంచిదనితోస్తే ఆదే చెయ్యి. ఎందుకంటే, తలో సలహాఇస్తే, ఏ సలహా ఆచరించాలో పెద్ద సమస్యయి కూర్చుంటుంది. జగన్, సలహా అడగటం, ఇవ్వటం తప్పనికాదు. కాని ప్రయోజనం లేదేమో. నీకు నచ్చనిది నేను చెబితే నువ్వు పెడచెవిని పెడతావు. ఒకవేళ పాటించినా ఫలితాలకి విచారించవలసి రావచ్చు. కాదంటావా?"

"గంభీరంగా ఉపన్యసించావు. బాబోయ్, నిన్నెప్పుడూ సలహా అడగను" అన్నాడు జగన్ నవ్వుతూ.

రజనిమాత్రం ముఖం చిట్లించుకుంది. ఐ. ఏ. ఎస్. కి కట్టమని డాక్టర్ ప్రోత్సాహం ఇవ్వకపోవటం ఆమె కేమీ రుచించలేదు.

"మాటల్లో పడ్డాం. డాన్సు ప్రోగ్రాం ఉందికదా. ఎనిమిదవుతోంది. పోదామా?" అన్నాడుడాక్టర్ రజని నిరుత్సాహాన్ని కనిపెట్టి.

వెంటనే అందరూ లేచారు.

## 2

డాన్సు జరుగుతున్నంతసేపూ జగన్ నర్తకిని ఊరికే తెగ మెచ్చుకోటం రజనికి నచ్చలేదు.

"అబ్బ, తలనొప్పిగాఉంది" అంది విసుగ్గా.

జగన్ ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు.

మధ్య మధ్య మెచ్చుకుంటూ, రజనివైపుచూసి ఏదో అనబోయి, ఆమె ముఖ భంగిమలుచూసి మానేశాడు.

ఎప్పుడెప్పుడు నృత్యం ఐపోతుందా అని నిమిషాలు లెక్కపెట్టసాగింది రజని.

రజని నృత్యాన్ని ప్రశంసించకపోవటంవల్ల డాక్టర్తో, దాసుతో నృత్యాన్ని గురించి ప్రశంసా వాక్యాలు పలకసాగాడు జగన్. అది మరీ కంటకప్రాయమైంది ఆమెకి.

నృత్యం ఐపోయింది. నలుగురూ బయటికి వచ్చారు. జగన్ కొంచెం తటపటాయించి, "ఇప్పుడేవస్తా"నని గ్రీన్ రూమ్లోకి వెళ్ళిపోయాడు.

రజని తెల్లబోయింది. ఆమె ముఖం జేవురించింది. తనకా నృత్యం నచ్చలేదని తెలిసీ, జగన్ అలా ప్రవర్తించటం తన అభిరుచిని కించపరచటమేనని కోపంతో గిరుక్కున తలపక్కకి తిప్పేసుకుంది. కాని జగన్ ఆమె అయిష్టతని సరిగా గమనించలేదు.

గ్రీన్ రూమ్లో మేకప్ విప్పేస్తోంది శారద.

"నమస్తే" అన్నాడు జగన్.

నర్తకి శారద వెనక్కి తిరిగిచూసింది.

"నమస్తే."

"మీ నృత్యం చాలా అద్భుతంగా ఉందండీ. ఇంత చక్కని నృత్యం చూడటం నా కిదే మొదటిసారి" అన్నాడు జగన్ ఆరాధనా పూర్వకంగా.

"థాంక్స్" అంది శారద చిరునవ్వుతో.

"నృత్యం చూస్తున్నంతసేపూ ఏదో అలౌకికానందం కలిగింది. తమ కళ ఆమోదం పొందటంకంటె కళాకారులకి కోరదగ్గదేదీ ఉండదని నాకు తెలుసు. అందుకే అభినందనలు చెప్పటానికి వచ్చాను. సెలవు." వెళ్ళబోయాడు జగన్.

"ఒక్క నిమిషం. నా నృత్యం ఎందువల్ల బాగుందంటారు? అంటే ప్రత్యేకత ఏమైనా ఉందని మీ అభిప్రాయమా?" అతని ముఖంలోకి చూస్తూ, ఆసక్తితో అడిగింది నర్తకి.

"మీ అభినయం భావానుగుణంగాఉంది. ముఖ్యంగా సాత్వికాభినయంలో అద్భుత నైపుణ్యం ప్రదర్శించారు. నర్తకి ఉపజ్ఞ, శక్తిసామర్థ్యాలు, సాత్వికాభినయంలో వెల్లడవుతాయని నా అభిప్రాయం."

"మీకు నృత్యంలో ప్రవేశం ఉన్నట్టుంది."

"లేదు. కాని నృత్యం గురించి కొంచెం చదివాను."

శారద అతనివైపు మెచ్చుకోలుతో చూసింది.

"నా నృత్యం గురించి చాలామంది ప్రశంసించారుగాని, ఇలా విమర్శాపూర్వకంగా మెచ్చుకున్నది మీరే. ఎంతో ప్రోత్సాహం ఇచ్చారు. చాలా సంతోషం. కృతజ్ఞురాలిని" అందామె.

జగన్ ముఖంలో ఆనందం తాండవమాడింది. తన ఆనందాన్ని ఆమెకి తెలియచేసి, ప్రోత్సాహం ఇవ్వాలనే ఉద్దేశంతో ఆమెని అభినందించాడు, తన మెప్పు ఊరికే పోలేదు.

"నమస్కారం. వస్తానండీ" అన్నాడు, చప్పున రజని, స్నేహితులు తనకోసం ప్రతీక్షిస్తున్నారని జ్ఞప్తికివచ్చి.

"నమస్కారం. మీపేరు చెప్పలేదు."

"జగన్‌మోహన్‌రావు."

"ఓ" అంది శారద.

అతనిక ఏమీ అనక వెంటనే బయటికి వచ్చేశాడు. థియేటర్ గేటుదగ్గిర డాక్టర్ ఒక్కడే ఉన్నాడు. దాసు, రజని కనిపించకపోయేసరికి డాక్టర్ని అడిగాడు.

"రజనికి తలనొప్పిగాఉందట. ఇంటికి వెళ్ళిపోయింది" అన్నాడు డాక్టర్.

వెంటనే జగన్‌కి కొంచెం పశ్చాత్తాపం కలిగింది. ఆమె థియేటర్లో కూడా తలనొప్పిగా ఉందని చెప్పింది. కాని కొన్ని నిమిషాలు తనకోసం వెయిట్ చెయ్యటం అసాధ్యమైనంత తలనొప్పా? అతనికి సందేహం కలిగింది.

"తలనొప్పా? కోపమా?"

"కోపమెందుకు?"

"నేను ఆలస్యం చేశానని."

"అయితే రెండూవచ్చిఉంటాయి. అదిగాక, చలిగాలిలో ఎక్కువసేపు ఉండటం మంచిదికాదని నేను సలహా ఇచ్చాను."

"గొప్పపని చేశావు."

"ఏంచెయ్యను? చలిగాలిలో ఎక్కువసేపు ఉండటం మంచిదా? అని డాక్టర్ని అడిగితే మంచిదేనని చెబుతాడా? అందులో తలనొప్పిగా ఉన్నదాయె."

"అది శుద్ధ అబద్ధం" అన్నాడు జగన్. రజనికి అసలు తలనొప్పి రాలేదనీ, అంతా తనమీద కోపమేననీ తెలిసిందతనికి. తనేం చేశాడు?

"కావొచ్చు" అన్నాడు డాక్టర్ నవ్వి.

"ఇంత సంకుచితత్వంఅయితే ఎలా డాక్టర్?" కొంచెం బాధగా అడిగాడు.

"అలా అనకు. కోపానికీ, సంకుచితత్వానికీ చాలా తేడా ఉంది. కోపంరావటం స్త్రీల సహజధర్మం."

"నేను శారదతో మాట్లాడుతూ, తనని నిర్లక్ష్యం చేశానని అనుకుని ఉంటుంది."

"ఆమె ఏమి అనుకునిఉంటుందో నువ్వు ఊహాగానం చెయ్యటం పనికిరాదోయ్. మనుష్యుల్ని అపార్థం చేసుకోటానికి అంతకంటె తేలికమార్గం ఇంకోటిలేదు."

"అర్థం చేసుకోటానికి కూడా."

"ఆమె ఏదో ఊహించుకుని కోపం తెచ్చుకుందని అనుమానించి, ఆమె ఊహ ఏమయిఉంటుందోనని నువ్వు ఊహిస్తున్నావు. అంతకంటె ఆమె ప్రవర్తనకి నువ్వు ఎంతవరకు బాధ్యుడివో ఎందుకాలోచించవు."

"అయితే తప్పు నామీదే ఉందంటావు."

"ఎవరి తప్పయినా ఇబ్బందిలేదు. ఆమెకి కోపం వచ్చిందని నువ్వు కోపం తెచ్చుకుంటే నీ గొప్పతనం ఏముంది?"

"అయితే ఏమంటావు."

"మనుష్యుల్ని సానుభూతితో అర్థంచేసుకోటానికి ప్రయత్నించమంటాను."

జగన్ కాసేపు ఏమీమాట్లాడలేదు. తరవాత దాసు విషయం జ్ఞప్తికి వచ్చింది.

"దాసేడీ?"

"ఇద్దరూ కలిసివెళ్ళారు. నిన్నేమీ అనుకోవద్దని చెప్పమన్నారు."

అనుకోకుండా చప్పున డాక్టర్‌చెయ్యి పట్టుకున్నాడు జగన్. డాక్టర్ అతనివైపు కొంచెం ఆశ్చర్యంగా చూశాడు.

"రజనినిచూస్తే ఒక్కొక్కసారి నాకు వళ్ళుమండుతుంది" అన్నాడు జగన్. వెంటనే అలా అన్నందుకు విచారించాడు. రజని తనని కవ్వించటానికీ, తనకి కోపం తెప్పించటానికీ సంకోచించదు. దాసుతో కలిసి అలా వెళ్ళిపోవటం తనని ముఖంమీద చెప్పుతో కొట్టినట్టుగా ఉంటుందని ఆమె అభిప్రాయం! జగన్ అలా ఊహించగానే అతనిముఖం చిన్నబోయింది. రజని తనని అర్థంచేసుకోటానికి ప్రయత్నించదు. జగన్ నిట్టూర్చి అన్నాడు.

"సరే, మనిద్దరం మిగిలాం. పోదాం పద."

"మా దేశీయ ధర్మాసుపత్రికి థియేటర్ యజమాని చందా ఇస్తానన్నాడు. ఒకసారి వెళ్ళివస్తా."

"ఎంత?"

"మూటపదహార్లు."

"అంతేనా?"

"నువ్వెంతిస్తావేమిటి?"

"అదేనా అడిగేపద్ధతి?"

"అయ్యా, ధర్మాసుపత్రి ఒకటి స్థాపించి బీదలకి ఉచిత వైద్యం చేయటానికి సంకల్పించాను. పరికరాల నిమిత్తం చందాలు వసూలుచేస్తున్నాం. ఈవిధంగా వసూలుచేసిన డబ్బుకి ట్రస్టీలు ఏర్పాటుచేస్తాం. దయచేసి తమరు మీకు తోచింది ఇప్పిస్తే కృతజ్ఞులం."

జగన్ పగలబడి నవ్వాడు. డాక్టర్ కూడా శ్రుతికలిపాడు. జేబులోంచి చెక్‌బుక్‌తీసి వెయ్యిన్నూటపదహార్లకి చెక్కురాసి డాక్టర్‌చేతికిచ్చాడు.

డాక్టర్ కళ్ళు మెరిశాయి. జేబులో పెట్టుకున్నాడు.

"సరే, నువ్వు రజని ఇంటికివెళ్ళబోతున్నావని నాకు తెలుసు. నాదారి ఇటువైపు" అని నవ్వుతూ డాక్టర్ థియేటర్ ఆఫీసులోకి దారితీశాడు.

జగన్ ఒక్కసారిగా డాక్టర్‌వైపు ఆశ్చర్యంగాచూసి, అడుగుముందుకి వేశాడు. తను రజనీఇంటికే వెళ్ళబోతున్నాడు. డాక్టర్ ఎలా పసిగట్టాడు!

నెమ్మదిగా నడిచి రజని ఇంటిముందు ఆగాడు. వరండాలో మామయ్యావాళ్ళూ నిద్రపోతున్నారు. కిటికీదాకావెళ్ళి తొంగిచూశాడు. లైటు వెలుగుతోంది. రజని పొద్దుపోయేదాకా చదువుకుంటూనే ఉంటుంది మామూలుగా. పడకకుర్చీలో పడుకుని ఏదో ఆలోచిస్తున్న రజనిని చూశాడు. ఆమెమీది కోపం అంతా ఒక్కసారిగా అదృశ్యమైంది.

"రజనీ."

ఉలిక్కిపడిచూసి, తలుపుతీసింది రజని.

"అలా ఉలిక్కిపడ్డావేం?" లోపలికి వెడుతూ అడిగాడు.

"ఏదో పరధ్యానంగా ఆలోచిస్తున్నాను."

"నువ్వేం ఆలోచిస్తున్నావో నాకు తెలుసు."

"ఏం ఆలోచిస్తున్నాను?"

"నేనింకా ఎందుకు రాలేదని?"

"ఇంతరాత్రివేళ నువ్వెందుకొస్తావనుకుంటాను?"

"క్షమాపణ కోరటానికి."

"క్షమాపణా! ఎందుకు?"

"నామీద నీకు కోపం వచ్చినందుకు."

ఆమెకి కోపంలో కూడా నవ్వొచ్చింది.

"నాకెందుకు కోపం?"

"లేదా? అయితే బతికాను."

"అబ్బా! నేనంటే అంత పెద్దలక్ష్యం ఉన్నట్టు మాట్లాడతావేం?"

"కాబోయే అర్థాంగివి. నీ మీద లక్ష్యంలేకపోతే ఇంకెవరంటే లక్ష్యం ఉంటుంది."

"ఆ డాక్టరూ, నర్సూ ఉన్నారుగా."

"ఉన్నారు."

"ఉంటే తమరిక్కడెందుకున్నారు?"

"వాళ్ళు వెళ్ళిపొమ్మన్నారు."

"నేను వెళ్ళిపొమ్మని అనలేనుగా."

"నోరులేనిపిల్లవికదూ. సరే నువ్వు వెళ్ళమనకుండానే వెడతాలే."

"నేనంటే అంత నిర్లక్ష్యమని నాకు తెలుసు."

"అలా ఎందుకనుకుంటావు రజనీ?" అన్నాడు జాలిగా జగన్.

"నీకు డాక్టరు ఉపన్యాసాలు బాగా తలకెక్కుతున్నాయి"

"ఏ విషయంలో?"

"అన్నింటిలో. ఆఖరికి ఉద్యోగంవిషయంలో కూడా నా సలహా నీకు పనికిరాలేదు. సలహా ఇవ్వనంటూనే ఆయన పిచ్చి ఊహాలన్నీ నీకు బాగా తలకెక్కిస్తున్నాడు."

జగన్ నవ్వాడు.

"నువ్వలా చిన్నబుచ్చుకుంటా వనుకోలేదు. పోనీ, నీ ఇష్టప్రకారం ఐ. ఏ. ఎస్. కి కడతాలే. ఏం?"

"రేపాటికి మనసు మార్చుకోవూ?"

"పోనీ ప్రమాణం చెయ్యనా? ఇదిగో ఈ చెక్కుబుక్కు సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. భగవద్గీత లేదుగా."

జేబులోంచి కొంటెగా చెక్‌బుక్ తీశాడు. రజని చేతిలోంచిలాక్కుని కౌంటర్‌ఫాయిల్స్ చూసింది. వెంటనే ఆమె ముఖంలో ఆశ్చర్యమూ, కోపమూ, విసుగూ ప్రతిఫలించాయి.

"వెయ్యిన్నూటపదహార్లే! ఎందుకూ?" అందామె. పెళ్ళికాకపోయినా, ఖర్చుకి సంజాయిషీ అడిగే పద్ధతిలో ఆమె ప్రశ్నించేసరికి గట్టిగా కౌగిలిలోకి లాక్కుని "ప్లీజ్ అప్రూవ్" అనాలనిపించింది జగన్‌కి. తమాయించుకుని, "ధర్మాసుపత్రి పెడుతున్నాడుగా, చందా ఇవ్వాలే" అన్నాడు.

"వెయ్యిన్నూట పదహార్లే!" అందామె మళ్ళీ.

జగన్‌కి వెయ్యిన్నూట పదహార్లొక లెక్కకాదు. కావలసినంత ఆస్తికి ఒక్కడే వారసుడు. ఎందుకైనా మంచిదని తన పేరా, కొడుకుపేరా బ్యాంకులో రెండు అకౌంటులలో డబ్బు వేశాడు అతని తండ్రి. జగన్‌మీద ఆయనకి వల్లమాలిన విశ్వాసం. చెడిపోటానికి డబ్బే కారణం అని అందరూ అంటున్నా, అలాంటివాటికి జగన్ అతీతుడని ఆయన నమ్మకం. చెడిపోయేవాడు ఎప్పుడైనా చెడిపోవచ్చు. తన తదనంతరం చెడిపోయేవాడిని చెడిపోకుండా ఎవరు కాపాడుతారు? జగన్ కూడా తండ్రి విశ్వాసాన్ని గంగపాలు చేయలేదు. ఆ ఒక్కసారి మాత్రం ధర్మకార్యానికి చందా ఇచ్చాడు. డాక్టర్ మీద అభిమానంకొద్దీ, చేయూత ఇవ్వదలిచాడు.

"డాక్టర్ చేసేది మంచిపనికదా!" అన్నాడు.

"మంచిపనే!" అంది రజని ముఖంచిట్లించుకుని.

"రజనీ!" అన్నాడు చిరుకోపంతో.

"నేను చెప్పేదే చెప్పానుగా. ఆ డాక్టర్ మాటలువింటే కొంప గుండమే" అంది రజని ఏమాత్రం ఆలోచించకుండా.

జగన్‌కి ఆశాభంగం కలిగింది. తన ఔదార్యానికి రజని ప్రశంసిస్తుందని ఆశించాడు. తనమీద ఆమెకి మరింత గౌరవభావం కలుగుతుందని భ్రమపడ్డాడు. డాక్టర్ తనకి ఎంత మిత్రుడో ఆమెకి తెలుసు. అతను చేసేది మంచిపనికాదని ఎవరనగలరు. పరిస్థితి అర్థం చేసుకోకుండా అలా ఆమె తన మనసుని గాయపరచటం అతనికి బాధ కలిగించింది.

"డాక్టర్ నాకు ప్రాణస్నేహితుడు రజనీ" అన్నాడు బాధగా.

"అందుకే ఇలా ప్రాణం తీస్తున్నాడు" అంది రజని.

రజనివైపు దిగ్భ్రమతో చూశాడు. ఆమె భావాలు ఎటువంటివైనా, తన మనసుని గాయపరిచేమాటలంటుందని అత నెప్పుడూ అనుకోలేదు. అలా అంటె తన గుండెని గుప్పిట్లో నలిపినట్టవుతుందని ఆమెకి తెలియకపోలేదు. కాని డాక్టర్‌మీది కోపాన్ని వెళ్ళగక్కే ప్రయత్నంలో తనబాధని ఆమె లక్ష్యపెట్టదు. జగన్‌కి ఎక్కడలేని నిస్పృహ కలిగింది. ఆమె తనని అర్థంచేసుకోదు. కనీసం ప్రయత్నించదు. అసలు రజని

తనని ప్రేమిస్తోందా? ఈ అనుమానం కలగగానే ఆమె వద నాన్ని తీక్షణగా చూశాడు.

రజని!

ఎందుకో ఆమె అంటే ఎక్కడలేని ఆపేక్ష! ఎంతకోపం వచ్చినా, ఎలాగో సరిపెట్టుకుంటాడు. తన మనసూ, హృద యమూ గాయపడినా, ఆ ఎర్రటి పెదవులమీద ముద్దు పెట్టు కోవాలని తహతహపడ్డాడు.

"సరే, నీ ఇష్టం! నాకెందుకు. తీసికో నీ చెక్‌బుక్" ఇచ్చేసింది రజని. యాంత్రికంగా తీసుకున్నాడు. ఏమీ అనలేదు.

మొదటిసారిగా రజని జగన్ బాధపడేవిధంగా తను ప్రవర్తించినట్టు కనిపెట్టింది. సామాన్యంగా ఎంత కోపంలో ఉన్నా, ఏదో ఒక జవాబు చెబుతాడు. అతనలా జవాబు చెప్ప కుండా నిశ్శబ్దంగా నిలబడేసరికి జాలిగా, అనునయించే ధోరణిలో అంది.

"జగన్, అంటే నీకు కోపంగాని, ఇతర్ల డబ్బుతో పేరు సంపాదించుకోవటం ఘనకార్యమా, చెప్పు. వెయ్యికాదు. రెండ వేలైనా, నువ్వు ఇవ్వదలచుకుంటే ఇవ్వవచ్చు. కాని, ఒక్క దమ్మిడీఅయినా నువ్వు శోకరాలో పోగొట్టుకుంటే నాకు బాధగా ఉంటుంది."

"శోకరా! డాక్టర్ నాకు శోకరా వేశాడా రజనీ!" అన్నాడు జగన్ ఆమె అభిప్రాయం స్పష్టంగా తెలుసుకోటానికి కళ్ళలో చూస్తూ.

"మనుష్యుల నిజమైన మనస్తత్వాల్ని నువ్వు ఎందుకు అర్థం చేసుకోలేవో నా కర్థంకాదు జగన్."

రజని నిజంగా డాక్టర్ని సరిగా అర్థం చేసుకోలేదా? ఇంతవరకూ తను డాక్టర్‌తో చనువుగాఉంటూ, అతని మాటల్ని లక్ష్యపెట్టి తన మాటల్ని తోసివేస్తున్నాడనే ఊహతో ఆమె అలా ప్రవర్తిస్తోందని అనుకున్నాడు. కాని ఇప్పుడు ఆమె మాటలు వింటుంటే, ఎక్కడో ఏదో వక్రత ఉందని తట్టిం దతనికి. ఆలోచనగా ఆమెవైపు చూస్తూ అన్నాడు.

"నేను మనుష్యుల్ని అపార్థం చేసుకుంటున్నానని డాక్టర్ అన్నాడు. అసలు అర్థమే చేసుకోటంలేదని నువ్వంటున్నావు. చూస్తే వాది వట్టి మట్టిబుర్రలాఉంది."

రజని చిరునవ్వుతో ఆపేక్షగా అతనివైపు చూసింది.

"పాటిమట్టలే."

జగన్ బాధ, కోపమూ ఆక్షణంలో అదృశ్యమయ్యాయి.

"అలా అనకపోతే, ఐ. ఏ. ఎస్. కి కూర్చోనని భయం. ఏం?"

"అబ్బ. నన్ను ఉద్ధరించటానికేపాపం!"

"మరెవర్ని ఉద్ధరించటానికి?"

రజని నవ్వింది.

"ఎవర్నివాళ్ళు ఉద్ధరించుకుంటే చాలు. నిద్ర రావటం లేదా!"

రజని ఆవులించింది.

"వెళ్ళమని చెప్పరాదూ? సెలవు."

నవ్వుతూ జగన్ తలుపుదాకావెళ్ళి, వెనక్కి చూశాడు. అతనివైపే చూస్తున్న రజని చప్పున కళ్ళు మూసుకుంది.

## 3

ఆసుపత్రి ప్రారంభోత్సవం జరుగుతోంది. జగన్, దాసు, రజని ముఖ్యమైన అతిథులగదిలో కూర్చున్నారు. ప్రారంభోత్సవం అనుకున్న సమయానికి ప్రారంభం కాక పోవటంతో దాసు ఆవలించాడు.

"ఏం డాక్టర్, మీ ఆసుపత్రి ప్రారంభోత్సవం ఎన్నిం టికి?"

"మా ఆసుపత్రా! ఇది మాదికాదు దాసూ. మీ అంద రిదీ."

"మంచిదే. తలోసీసా పట్టుకు పొమ్మంటావా?"

"ఆ అవసరం కలక్కుండా ఉండాలనే డాక్టరైనవాడు కోరుకుంటాడు."

"పొరపాటు. అలాంటి అవసరం కలగాలనే డాక్టర్లు కాచుక్కూచుంటారు."

"అబ్బో. నీతో వాదించటమే. అధ్వకేటువి."

"కాబోయే డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌ని. వాదనవినటం అల వాటు చేసికోవద్దూ?"

"నువ్వు మున్సిఫ్ కావాలేగాని, నీ ఇష్టంవచ్చినంతసేపు వాదించి, తలనొప్పికి మందిచ్చిపోనూ?"

అందరూ నవ్వారు.

"బిల్లుమాత్రం వెయ్యకు నీ పుణ్యం. సరే, అసలు సంగతి, ప్రారంభోత్సవం ఇవాళ జరుగుతుందా?"

"కాస్త ఓపికపట్టుబాబూ. అప్పుడే ఆఫీసరైపోయా ననుకుంటే ఎలా?"

దాసు ఆవులించాడు.

"ఏం ఆఫీసరో! ఈ మధ్య బార్‌రూమ్‌లో నిద్రపోవటం అలవాటయింది. కాస్త కాఫీ తెప్పిద్దూ, నీ మేలు మర్చిపోను."

"ఓఅరగంట ఆగవయ్యా."

"అప్పటికి గాఢనిద్రలో ఉంటానేమో."

"బతికిపోతాం. అన్నట్టు డాక్టర్, శారదకోసం కారు పంపావా?" అన్నాడు జగన్.

మెడికల్ మాగజైన్ ఏదో తిరగేస్తూ, రజని ఆ మాటలు విని తలెత్తి జగన్‌వైపు చూసింది.

"ఆహా. వస్తూఉండాలి" అన్నాడు డాక్టర్.

"ఈమె నెక్కడపట్టావు రావుజీ?" అన్నాడు దాసు.

డాక్టర్‌ముఖం కొంచెం ఎర్రబడ్డది.

"ఆమెనిగురించి తేలిగ్గా మాట్లాడకు దాసూ. నూటికి కోటికి అలాంటివాళ్లుంటారు."

"అవునవును. ఆసుపత్రి సహాయార్థం ఉచితప్రద ర్శన ఇచ్చిందికదూ? ఆమాత్రం పొగడ్త తప్పదులే" అన్నాడు దాసు, డాక్టర్ మాటల్ని ఏమాత్రం లక్ష్యపెట్టకుండా.

"నోరుమూసుకోవోయ్, దాసూ" అన్నాడు జగన్.

"దానికేం భాగ్యం" అన్నాడు దాసు కొంచెం వెటకారంగా. "కళ్ళు మూసుకోమంటే కష్టంగాని."

జగన్ అతనివైపు ఆశ్చర్యంగా చూశాడు. డాక్టర్‌కి బాగా కోపం వచ్చింది.

"ఏమిటి దాసూ నువ్వు మాట్లాడేది?" కొంచెం గట్టిగానే అన్నాడు డాక్టర్.

"నిద్రవస్తోంది. కళ్ళు మూసుకోమన్నా మూసుకుంటాలే" అన్నాడు దాసు మరింత నిర్లక్ష్యంగా.

రజనికి తృప్తిగావుంది. డాక్టర్ జగన్‌వైపు చూశాడు. జగన్ డాక్టర్‌వైపు చూశాడు. దాసు ఏం ఉద్దేశించిందీ వాళ్ళిద్దరికీ అర్థం కాలేదు.

"నీ కెన్నిసార్లు చెప్పినా అంతే. మనుష్యుల్ని మహా తేలిగ్గా తీసేస్తావు, దాసూ" అన్నాడు డాక్టర్.

"శారదలో నువ్వు కనిపెట్టినదోషం ఏమిటి?" అన్నాడు జగన్.

"దోషి అని నిర్ణయమయ్యేదాకా ప్రతివాడినీ నిర్దోషిగానే భావించాలిఅంటుంది లా. నే నది ఒప్పుకోను. ఈ ప్రస్తుత ప్రపంచంలో నిర్దోషిగా, పూర్తిగా రుజువయేవరకూ ప్రతివాడూ దోషి అనే నా భావం. మనిషిని దోషం రాహువులా పట్టింది దోయ్, ఏంచెప్పేది?" అన్నాడు దాసు, తను చెప్పేది యుగ ధర్మం అని సూచిస్తూ.

"నువ్వొక వింత మనిషివి" అన్నాడు డాక్టర్ అతనితో వాదించటంవల్ల ప్రయోజనం లేదని తెలిసి.

"విద్యగలవాడు వింత పశువు. ఋజువు చెయ్యగలను కావాలంటే. విద్యనేర్పినవాడు టోపీ పెట్టినట్టు, విద్యరానివాడు పెట్టలేడు. కాదంటావా? ఏం డాక్టర్, గుండెమీద చెయ్యి వేసుకుచెప్పు" సవాలు చేశాడు దాసు.

డాక్టర్ ఏమీ సమాధానం చెప్పలేదు. నవ్వాడు. బయట కా రాగిన చప్పుడయింది. డాక్టరు బయటికి వెళ్ళాడు. అతనివైపుచూసి, దాసు భావగర్భితంగా నవ్వి, "స్నేహితుడైపోయాడుగాని, లేకపోతే డాక్టర్‌పని పట్టేవాడిని" అన్నాడు.

జగన్ కుతూహలంగా "ఏం జరిగిందేమిటి?" అన్నాడు.

"ఏం జరిగేదేమిటి, ఆ శారదలేదూ—" అని చప్పున రజనివైపు చూసి, నాలిక కరుచుకున్నాడు దాసు. ఆమె ఎటో చూస్తున్నట్టు ఆసక్తితో వినసాగింది.

"ఊఁ, శారద?"

"తరవాత చెబుతాలే" అన్నాడు దాసు.

"ష్. వెధవ సస్పెన్సు. చెప్పెయ్యి."

"పుకార్లు బయల్దేరాయి. డాక్టరూ, శారదా కలిసి తిరుగుతున్నారుట."

జగన్ తెల్లబోయాడు.

"ఛీ. వెధవ పుకార్లు. ఎవడో ఏదో కూస్తే, నీ నోటివెంబడి ఆ మాట ఎలా వచ్చింది?"

"చెప్పమని చంపితే ఏంచేసేది?" అన్నాడు దాసు, చీమ కుట్టినట్టయినా లేకుండా.

అతను మాట్లాడేతీరూ, ఆ మాటల వైఖరీచూసి జగన్ నమ్మలేనట్టుగా అతనివైపు తేరిపారచూశాడు. దాసు చాలా కటువుగానే మాట్లాడతాడు. ఎంత గంభీరమైన విషయమైనా, తేలిగ్గా తీసేస్తాడు. మిత్రుడైన డాక్టర్‌పట్ల అంత నిర్లక్ష్యంగా ఏమీ సంబంధంలేనటుగా ప్రవర్తించటంచూసి, జగన్‌కి కొంచెం అసహ్యం వేసింది.

"డాక్టర్ మన స్నేహితుడు, దాసూ. మర్చిపోతున్నావు."

"అందుకోసమేగా నోరు మూసుకున్నాను" అన్నాడు దాసు.

ఇంతలో డాక్టర్, శారదా గదిలోకి వచ్చారు. డాక్టర్ అందర్నీ శారదకి పరిచయం చేశాడు. తర్వాత ఏర్పాట్లకోసం బయటికి వెళ్ళిపోయాడు.

"నా నృత్యంగురించి మీరు స్థానికపత్రికలో వ్రాసిన వ్యాసం చదివానండీ. కృతజ్ఞురాలిని. కాని, నిర్హేతుక కటాక్షంతో ఆకాశంలో కూచోబెట్టారు" అంది శారద జగన్‌ని ఉద్దేశించి.

"నేను రాసిందాంట్లో అతిశయోక్తి ఏమీ లేదండీ. ఎప్పటికైనా మీరు నృత్యంలో అత్యున్నత శిఖరాన్ని అందుకోగలరని నా నమ్మకం."

"థాంక్స్."

"ఆ వ్యాసం నేను చదవనేలేదే. చెప్పలేదేం జగన్?" అన్నాడు దాసు.

"చెప్పేందుకేముంది?" అన్నాడు జగన్. రజని అతనివైపు చురచుర చూసింది.

"నృత్యంలో పారం చూడాలని ఆశయంమాత్రం ఉంది. కాని, అది ఒక మంచి కలగా మాత్రమే నిలిచిపోతుందేమోనని భయం. నృత్యానికే నా జీవితాన్ని అంకితంచేసి, లక్ష్యాన్ని అందుకోవాలని ప్రయత్నిస్తున్నానండీ. కాని కొన్ని సమయాల్లో ఏదో నిరుత్సాహం ఆవరిస్తుంది" అంది శారద.

"నిరుత్సాహం ఎందుకండీ? మీ ఆశయం తప్పక సిద్ధిస్తుంది"

"అబ్బో. దేవుడల్లే వరమిస్తున్నాడే" అనుకుంది రజని.

"శారదగారూ! మా రజని కూర్చున్నభంగిమ ఎలా ఉందంటారు?" అన్నాడు జగన్ ఆమెని ఉడికిస్తూ.

వెంటనే రజని, "సంతోషం" అని సరిగ్గా కూర్చుంది.

శారదనవ్వి, "అలిసిపోయినట్టున్నారే?" అంది.

మర్యాదకోసం "అవునండీ" అంది రజని ఇష్టం లేకపోయినా.

"మా రజనికి మీ డాన్సంటే గొప్ప అభిప్రాయం అండీ."

"నాలో గొప్పతనం లేకపోయినా, వారి అభిమానం అలా అనిపిస్తుంది" అంది శారద మర్యాదగా.

"మీకు పుణ్యం ఉంటుంది. ఆమెకి నృత్యం నేర్పుదురూ. మహా ఉబలాట పడుతోంది."

"అబద్ధాలకి హద్దుండాలి" అంది రజని.

"పోనీ, నేర్చుకోండి. తప్పేముంది?" అంది శారద నవ్వుతూ.

"అది ఒకటే తక్కువయింది."

"ఆ ఒకటీ కూడా తక్కువ కాకుండా ఉండాలనేగా."

"నేను చెప్తే నేర్చుకోను" అకస్మాత్తుగా రజనికి పౌరుష వహించింది.

"నేర్చుకోటానికేముండీ?" అంది శారద రాజీ ధోరణిలో.

"ఇన్ ంలేదండీ."

"అసలు అది పుట్టుకతో రావాల్లెండి. లలితకళలున్నాయి చూశారూ—"

"నేర్చుకుంటే ప్రతివాళ్ళకీ వస్తుంది" రజని అభిమానం ఉట్టిపడేట్టుఅంది అతన్ని వాక్యం పూర్తిచెయ్యనివ్వకుండా.

"మీకు తప్ప—"

"అవును. నాకురాదు. బి. ఏ. ప్యాసుకావటం డిస్క్వాలిఫికేషన్." వ్యంగ్యంగా అంది రజని శారదకంటె తను అన్నిటిలో అధికురాలినని నిరూపిస్తూ.

"మీకు తప్పకుండా వస్తుందని అనబోయాను. పూర్తిగా వినకుండా తొందరపడ్డావు రజనీ" అన్నాడు మరింత ఉడికిస్తూ.

అవుకోవాలనుకున్నా అందరూ నవ్వేశారు, రజని తప్ప.

"సమర్థించుకోటం అనవసరం." రజనికి బాగా కోపం వచ్చింది. కోపం దాచదలుచుకోలేదు.

"భావప్రకటన బాగుందంటారా?" అన్నాడు జగన్ శారదని ఉద్దేశించి, రజనివైపు కనుబొమ ఎగరవేస్తూ.

"అబ్బ. నా కసలే తలనొప్పిగాఉంది" అంది రజని. జగన్ నోరు కట్టుబడిపోయింది. రజని తలనొప్పిగాఉంది అని అంటే అది ప్రమాదపు సూచనే.

ఇంతలో డాక్టరు పిలుపు వినిపించింది. ప్రబతుకుజీవుడా అని లేచాడు జగన్. అందరూ అతన్ని అనుసరించి సమావేశం జరిగే స్థలానికి వెళ్ళారు. ఎక్కువమంది ఆహూతులులేరు. కొందరు ప్రముఖులుమాత్రం విచ్చేశారు. డాక్టర్ తన ఆశయాన్ని వివరించి, సహాయం చేసినవాళ్ళకి కృతజ్ఞత చెప్పాడు. ధర్మానుపత్రిఅంటే పూర్తిగా ధర్మానుపత్రి అనే అర్థంకాదనీ, అలాంటిది ఒకరిద్దరి వ్యక్తులకి సాధ్యంకాదనీ అన్నాడు. బీదలకి ఉచితంగా వైద్య సహాయం లభింపచేసే ఉద్దేశంతో స్థాపించబడిందనీ, రోజూ కొంతకాలం ఆ అనుపత్రి నిర్వహణకి తన సేవ వినియోగిస్తాననీ అన్నాడు. క్రమంగా ఇంకా విస్తృతం చేసి, సంఘ సేవాపరులైన ఒకరిద్దరిడాక్టర్ల సహాయంతో నిర్వహించే ఉద్దేశం ఉందనీ అన్నాడు.

తరవాత కొంతమంది మాట్లాడుతూ, తమ సహాయ సహకారాలని లభింపచేస్తూంటామని వాగ్దానం చేశారు. శారద కూడా మాట్లాడింది. డాక్టర్‌పట్ల తన కెంతో గౌరవం ఉందని చెప్పి, ఆయన సంఘసేవాసక్తికి అభినందనలు తెలియచేసింది. ఉడతాభక్తిని తను చేసిన సహాయం గొప్పచేసి చెప్పటంలోనే ఆయన ఉదాత్తత వెల్లడవుతోందనీ, యథాశక్తిని సహాయం చెయ్యటానికి తనెప్పుడూ సిద్ధమేననీ అంది. తన సహాయం మాటల్లోకాక, కార్యరూపంలో లభింపచేస్తాననీ, అవకాశం దొరికినప్పుడల్లా ప్రదర్శనలిచ్చి ధన సేకరణకి తోడ్పడతాననీ వాగ్దానం చేసింది. అయినా ఆమెకి తృప్తి కలగలేదు.

"డాక్టర్‌గారి నిస్వార్థ సేవ నాలో నిద్రాణమై ఉన్న సేవాశక్తినీ, ఉత్సాహాన్నీ మేలుకొల్పింది. ఈ అనుపత్రిలో రోజూ కొంత సమయాన్ని వర్చుగా రోగులకి సేవచేయుటంకోసం వినియోగిస్తానని వాగ్దానం చేస్తున్నాను" అంది ఉద్రేకంగా.

సభికులు చప్పట్లు కొట్టారు.

దాసు ముసి ముసి నవ్వులు నవ్వి, జగన్‌వైపు చూశాడు.

డాక్టర్ భావోద్రేకంతో గద్గదమైన స్వరంతో శారదకి కృతజ్ఞత తెలిపాడు.

సమావేశం అఖరయింది. అందరూ లేచారు.

"అదంతా డాక్టర్‌గారి సేవాప్రభావమేనా?" అన్నాడు దాసు, జగన్‌ని ఉద్దేశించి.

"ఊరుకో, దాసూ. మనస్మింతరవాత కాస్త జ్ఞానం ఉండాలి"

దాసు ముఖం చిట్లించుకున్నాడు.

ఇంతలో డాక్టర్‌వాళ్ళ దగ్గిరికి వచ్చాడు.

"నువ్వు నా స్నేహితుడివైనందుకు గర్వంగాఉంది డాక్టర్" అన్నాడు జగన్. ఆయన నవ్వి, "అంత అభిమానం పనికిరాదు" అన్నాడు.

"డాన్సర్ నర్స్‌గా ఏంరాణిస్తుంది మహాశయా?"

"దాసూ, వృత్తికీ, సేవకీ సంబంధంలేదు. అదికాక, నృత్యం ఆమెకి వృత్తికాదు. ఉబుసుపోక. సరిగా చెప్పాలంటే కళారాధనకోసం" అన్నాడు డాక్టర్.

"కళారాధన నర్సింగ్‌హోమ్‌లో ప్రారంభిస్తే రోగులకి కొంచెం ఉబుసుపోకగానే ఉంటుంది. నృత్యంవల్ల కూడా రోగాలు నయం చెయ్యవచ్చని నిరూపించారుగదా ఇద్దరూ కలిసి?"

డాక్టరు దాసువైపు చూశాడు. అతని మాటల్లో కనిపించీ కనిపించని వ్యంగ్యం పసికట్టి, "ఏం, బుద్ధిజాడ్యాలు కుదరొచ్చు" అని బుజం తట్టాడు.

## 4

అనుపత్రి విజయవంతంగా నడుస్తోంది. డాక్టరూ, శారదా బీదప్రజల్లో మంచిపేరు సంపాదించుకున్నారు. ప్రతి రోజూ శారద రెండుగంటలు ఉదయం అనుపత్రిలో పని చేస్తుంది. జగన్ తరుచుగా అనుపత్రికి రాక సాగించాడు. శారద సేవాభిలాష అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఒకసారి ఆమెని అడిగాడు.

"కళాభిరుచిఉన్నవాళ్ళు కళనిగురించి పాటుపడటం సహజం. ఇలా రోగులకోసం కాలాన్ని వృథా చేయుటం నాకు వింతగా ఉందండీ" అన్నాడు.

"వింతేముంది?" అందామె.

"కాదా? ఈకాలాన్ని నృత్యానికే వినియోగిస్తే మీ లక్ష్యానికి చేరువౌతారు. దీనివల్ల ఏంలాభం?"

"లాభంకోసమే మనం అన్నిపనులూ చేస్తామా?"

"అదికాదు. మీరేమీ అనుకోకపోతే ఒకమాట చెబుతాను. మీ రానాడు ఉద్రేకంతో వాగ్దానం చేశారు. మాట నిలబెట్టుకున్నారు. కాని, నిజంగా మీరిలా కాలాన్ని వృథాచేయుటం డాక్టర్‌కి

కూడా ఇష్టం ఉండదనుకుంటాను. మీరేమీ అనుకోకపోతే నేను డాక్టర్‌కి చెబుతాను, మిమ్మల్ని శ్రమపెట్టవద్దని."

"నేను శ్రమ అనుకోటంలేదండీ."

జగన్ ఆమెవైపు అపనమ్మకంతో చూశాడు. ఆమె నిజం చెబుతోందని నమ్మలేకపోయాడు.

"నిజం చెప్పండి."

"అబద్ధం చెప్పాలిసిన అవసరం ఏముందండీ?"

"మీ మనస్తత్వం చిత్రమైంది. ఎందుకంటే, ఒక లక్ష్యం ఎప్పుడైతేఉందో దాన్ని నెరవేర్చుకోటానికే ప్రయత్నిస్తాం, కాని మధ్యలో మనను మరోవిషయంమీదికి మరలించటానికి ఇష్టపడం."

"కావచ్చు. జీవితం బహుముఖమైంది కదండీ. జీవిత లక్ష్యాన్ని నెరవేర్చుకోటానికి ప్రయత్నించటం, అది నెరవేరితే సంతోషించటం ఇవన్నీ మామూలే. కాని, ఇతరులకి మనం ఏం చేశాం అని ఆలోచిస్తే భయంవేస్తుంది. సంఘంలో జీవిస్తున్నాం కనుక, ఏదోఒక విధంగా ఇతరులకి ఉపకారం చేస్తే ఉండే ఆత్మ తృప్తి, మన సొంత లక్ష్యాలని సాధించుకోటం కోసం ప్రయత్నించటంలో ఉండదు. 'స్వార్థత్యాగం'లాంటి పెద్దపేర్లు పెట్టకండి. తృప్తి అనేది ఎప్పుడూ ఆత్మాశ్రయమే. అది ఏయే మార్గాలలో లభిస్తుందో అన్వేషించటం ఒకవిధంగా స్వార్థమేకదా."

జగన్ నిశ్చేష్టంగా శారదవైపు చూశాడు. ఆమె అలా విషయాన్ని విశదీకరిస్తుందనుకోలేదు. ఇంతకాలం ఆమె కేవలం మాటకోసం సర్వీగా పని చేస్తోందని అనుకున్నాడు. కాని ఇంత ఆలోచన, ఇంత గాంభీర్యమూ ఆమె ప్రవర్తనని శాసిస్తున్నాయని తెలుసుకోలేకపోయాడు. ఆమెపట్ల అంతకిముందులేని గౌరవం కలిగింది.

"మీలో ఇంత ఆలోచనాశక్తి ఉందని అనుకోలేదండీ!"

"అదంతా డాక్టరుగారి చలవ."

జగన్ ఆమెవైపు నిశ్చలంగా చూశాడు. డాక్టర్ని ఆమె తనకంటె బాగా అర్థం చేసుకుందనిపించింది. అది ఎలా సంభవం? ఇంతకాలంనుంచీ, తాము మిత్రులుగా ఉంటున్నారు. డాక్టర్ స్వభావం కూలంకషంగా తనకి తెలుసనుకుంటున్నాడు. కాని తనలో అతను ఇన్ని ఆలోచనల్ని ఎప్పుడూ రేపలేదు. ఇంతకాలం నించీ డాక్టర్ని శారదవిషయం అడగలేదు. వారిద్దరికీ ఎలా పరిచయం కలిగిందో తెలుసుకోవా లనిపించింది.

"డాక్టర్ మీకెలా తెలుసు?"

"అనుపత్రి నిధిసేకరణకి నేను ప్రదర్శన ఇవ్వలేదండీ."

"అంతకిముందుతెలియదా?"

శారద ఒక్కక్షణం ఆగి తెలుసన్నట్టు తలూపింది.

"ఎలా?"

"పేషంటుగా."

"ఓ, అలాగా."

"అవునండీ. నృత్యప్రదర్శన ఏర్పాటైనరోజు అకస్మాత్తుగా కాలువాచి నొప్పిపుట్టింది. డాన్సుచెయ్యటం అసంభవం అనిపించింది. డాక్టర్‌గారిదగ్గరికి వెడితే "డాన్సు చెయ్యటానికి వీల్లేదు." అన్నారు. ఏమైనా నృత్యం మానటానికి వీల్లేదన్నాను. అయితే మందివ్వటానికి వీల్లేదన్నారు. బతిమాలాను. నాకోసంకాదనీ, టిక్కెట్లు కొనివచ్చినజనానికి ఆశాభంగం కొతుందనీ చెప్పాను. "వాళ్ళు ఆశాభంగం చెందకుండా ఉండటం ముఖ్యమా, కాలుముఖ్యమా?" అన్నారు. "కాలు ముఖ్యమే. కాని డాన్సుచేసినందువల్ల కొంతకాలం ట్రీట్‌మెంట్ తీసుకోవలసి వచ్చినా పరవాలేదు. ఎలాగో బాధపడతాను. అంత మందికి ఆశాభంగంకలిగితే మనసుకి కష్టంగా ఉంటుం" దన్నాను. ఆయన నవ్వి ఏదోఇంజక్షన్ ఇచ్చారు. చెయ్యిపెట్టి తీసేసి నట్టయింది నెప్పంతా. అదే పరిచయం."

"అయితే జనంకోసం కాలువిరగ్గొట్టుకోటానికి ఒప్పుకున్నారన్నమాట."

"చిత్రంగా మాట్లాడుతున్నారే. విరుగుతుందని తెలిస్తే ఎందుకొప్పుకుంటారండీ ఎవరుమాత్రం?"

జగన్ చిరునవ్వు నవ్వాడు.

"డాక్టర్ని ఒప్పించారంటే అఖండులే మీరు. సలహాలివ్వటం బాగాఅలవాటై, తన అభిప్రాయాల్ని ఇతర్లమీద రుద్దుతాడని మా రజని అంటుంది. మీరు డాక్టర్నే శాసించారే!"

"ఇంకానయం! అదేంమాటండీ?" చిరునవ్వుని బుగ్గల మధ్య నొక్కేస్తూ, పెదవులు బిగించి అంది శారద.

కెవ్వుమన్నాడు జగన్. పక్కనే టేబిల్‌మీద ఉన్న ఆపరేషన్ సామగ్రితో ఆడుతుంటే కత్తి చేతిలో దిగబడ్డది. శారద కేకకి అదిరిపడి, చెయ్యిచూసి వెంటనే కాటన్ స్పిరిట్‌లోముంచి రక్తం తుడిచేసి గాజ్ క్లాతు చింపి కట్టుకట్టింది.

"నర్సింగ్ బాగా నేర్చుకున్నారే" అన్నాడు జగన్.

"సమయానికి మీకు ఉపయోగపడ్డది నేర్చుకున్న విద్య."

కృతజ్ఞతతో ఆమెవైపు చూశాడు.

"నర్సింగ్‌లో కూడా మంచిప్రావీణ్యం ఉందని ఈసారి వ్యాసంలో రాస్తాను."

"వాళ్ళు డబ్బిస్తారు కాబోలు."

"అబ్బే. నేనే ఇచ్చివేయిస్తాను."

"పోనీ, మీరే పత్రిక పెట్టకూడదూ?"

"వండర్‌ఫుల్. బ్రహ్మాండమైన ఐడియా. ఇది మీకే తట్టిందా, లేక మరెవరి ప్రోద్బలమన్నా ఉందా?"

"ఉన్నారుగా మీ డాక్టర్."

"ఇంకేం అలా చెప్పండి. సలహా ఇవ్వవయ్యా అంటే పెద్ద లెక్చరిచ్చాడు. పరోక్షంగా చెప్పకపోతే ప్రత్యక్షంగా చెబితే నోటిముత్యాలు రాలుతాయా?"

"అలా చెప్పలేదండీ. ఊరికే సూచనగా ప్రస్తావనవస్తే అన్నారు. మీకు రచనలో మంచి ప్రావీణ్యం ఉందిట. మా జగన్ ఎడిటర్ అయితే పత్రిక్కి నేనూ వ్యాసాలు రాస్తాను అన్నారు."

"నేను ఎడిటర్నికాను. ఐ. ఏ. ఎస్. కి కూర్చుంటాను. అని చెప్పండి."

"అది ఆయనకి తెలుసులెండి. అందుకే చెప్పలేదు."

జగన్ ఆమెవైపు కొంచెం విస్మయంతో చూశాడు.
"ఎలా తెలుసో!"

"స్నేహితులుకదా! 'ఎన్ని కోతలుకోసినా, జగన్ ఆఫీసర్లై మనందర్నీ మర్చిపోతాడు, రజనిని తప్ప' అని అన్నారు డాక్టరుగారు."

జగన్ నవ్వాడు. అతనికి డాక్టర్‌స్వభావమూ, శారద స్వభావమూ తెలిసిపోయాయి. శారదనీ, రజనినీ పోల్చిచూశాడు. అసంతృప్తి మనసులో గూడుకట్టి హృదయాన్ని కలచివేసింది. శారద ఆలోచించే పద్ధతికీ, రజని పద్ధతికీ ఎంతో తేడా ఉంది. స్వార్థం, స్వార్థత్యాగం అనే పెద్ద మాటలు ఉపయోగించకుండానే ఇద్దరిస్వభావాలనీ పడికట్టితూస్తే రజని తేలిపోతుంది.

ఆ ఆలోచనరాగానే జగన్ నిట్టూర్పు విడిచాడు. మనసులో ఏదో సందేహం మెదిలింది. తను రజనిని నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తూ, లేనిపోనివి కల్పించుకుంటున్నాడా? ఇతరుల ప్రవర్తనతో, వారి దృక్పథాలతో పోల్చి, రజనికి అన్యాయం చేస్తున్నాడా? రజని వ్యక్తిత్వం రజనికి ఉంది. ఆమె ఉద్దేశాలనీ, భావాలనీ ఆమెపరిస్థితులలో పరిశీలించిచూస్తే రజనిని తప్పు పట్టటానికి వీలులేదేమో. ఆమెని అర్థంచేసుకోటానికి తను నిజంగా ప్రయత్నించాడా?

జగన్ ఏదో ఆలోచిస్తున్నట్టు పసికట్టింది శారద.
"ఏదో ఆలోచిస్తున్నారు?"

జగన్ ఆలోచనలోంచి తేరుకుని, "మా రజని మీ మాటలు వింటే ఏమంటుందోనని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

అదే సమయంలో డాక్టర్ వచ్చాడు.

"ఆసుపత్రిలో బాతాఖానీ వేస్తున్నారా? మంచిపనే."

"అందరికీ అంత సేవాతత్వం అలవాటు కావొద్దూ? డాక్టరుగారికి అభ్యంతరంగాఉంటే సెలవు తీసుకుంటాం."

"నిరభ్యంతరంగా."

"అంతేలే. వెయ్యిన్నూటపదహార్లు తీసుకునేటప్పుడు మాత్రం ఎక్కడలేని ఆప్యాయతా వస్తుందికదూ?"

డాక్టరు ఏమీ అనకుండా చిరునవ్వునవ్వాడు. జగన్ వమందని వెళ్ళిపోయాడు.

"పట్టి బోళామనిషి" అన్నాడు డాక్టర్.

"అలా అనకండి. చాలా యోగ్యులు" అంది శారద.

"ఎందుకూ? నిన్ను బాగా పొగిడాడనా?"

"పొగిడారనికాదు. మనసులోంచి వచ్చేమాటే బయటికి అంటారు. అందుకనే చాలా మంచివారు."

"గట్టిగా అనకు. రజనికి తెలిస్తే చిక్కు."

శారద నవ్వింది.

"ఆమెకి ఆయన మంచితనం తెలియదనా?"

"ఎందుకు తెలియదు. రజనినిగురించి నీ అభిప్రాయం ఏమిటి?"

"తప్పుపట్టటం నా అభిమతంకాదుగాని, ఆమె తనని గురించే ఆలోచిస్తుందేమోనండీ? అతని మనసు అర్థం చేసుకోలేదేమో అనిపిస్తుంది. వారిద్దరికీ వివాహం నిశ్చయమైందని మీరిదివరకు అంటే చెబుతున్నాను."

"నిశ్చయమైందనే అనుకుంటున్నాం."

"అంటే?"

"అహ—ఏంలేదు. జగన్ పట్టి తిక్కమనిషని నీకు తెలియదూ?"

"సూక్ష్మంగా ఆలోచించేవాళ్ళని తిక్కమనిషంటే ఎవరేంచేస్తారు. రజనిపట్ల అతనికెందుకో అసంతృప్తిగా ఉందని కనిపెట్టాను."

"పట్టి బోళామనిషని మళ్ళీ అంటున్నాను."

"తన అభిప్రాయాలకంటె ఇతర్ల అభిప్రాయాలకి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. తనవ్యక్తిత్వం సులభంగా మర్చిపో గలగటం అంత మంచిదికాదేమో."

డాక్టర్ విస్మయంతో రజనివైపు చూశాడు.

"మనస్తత్వ పరిశీలనలో నీకు మంచి నైపుణ్యం ఉంది."

"ఇంకా నయం. జగన్‌గారువింటే ఈ సారి వ్యాసంలో అది కూడా రాసేస్తారు."

డాక్టర్, ఒక్కక్షణంఆగి, సూటిగా శారద కళ్ళలోకి చూసి అన్నాడు. "అతన్ని వివాహం చేసుకునేఆమె అదృష్టవంతురాలనా, దురదృష్టవంతురాలనా నీ అభిప్రాయం."

శారద నిస్సంకోచంగా అనేసింది.

"అదృష్టవంతురాలే. సందేహమేముందీ!"

"ఒకవేళ రజనికీ, అతనికీ వివాహం జరక్కపోతే!"

డాక్టరు ఏం ఉద్దేశిస్తున్నాడో ఆమె శోధించసాగింది.

"పాపం, ఆయన మానసికంగా దెబ్బతింటారు."

"నువ్వతన్ని వివాహం చేసుకోగలవా?"

శారద అదిరిపడ్డది.

"డాక్టరుగారూ!" అని కేకపెట్టింది. ఆమె కళ్ళలో గిర్రున నీళ్ళు తిరగటం డాక్టర్ చూశాడు.

"హలో డాక్టర్" అంటూ దాసు ప్రవేశించాడు.

"ఓ, దాసూ. ఏమిటిసంగతి. కూర్చో" అన్నాడు డాక్టర్.

దాసు వస్తూనే చివరి సంభాషణలు విన్నాడు. మనసులో ఏవేవో ఆలోచనలు రేగాయి.

"ఏమిటి డాక్టర్, తీరిగ్గా ఉన్నారేం ఇద్దరూ?"

"మా మందులకి రోగాలు జడిసిపారిపోతున్నాయి. ఏం చెయ్యం?"

"రోగులు కాదుగద!"

డాక్టర్ నవ్వాడు.

"ఏం పారిపోదామనుకుంటున్నావా?"

'ఆ పోయేదేదో వైకుంఠానికే పారిపోతాను. కానీ కొంతకాలం ఆగాలి. కనీసం సెలెక్షన్ రిజల్టు తెలిసేదాకా? ఇప్పుడు వచ్చిన విశేషాలేమిటంటే మనకి ఇంటర్‌వ్యూ వచ్చింది. ఆ వార్త చెవినివేసి వెడదామని వచ్చాను. జగన్‌కి కూడా చెప్పాలి. వస్తానండీ శారదాదేవిగారూ" అనేసి చకచక వెళ్ళిపోయాడు దాసు.

ఇద్దరూ ఊపిరి పీల్చుకున్నారు.

డాక్టర్ మళ్ళీ ఇందాకటి ప్రసక్తి తేలేదు. శారద కూడా ఏమీ అనలేదు. ఇద్దరూ అలాగే నిశ్శబ్దంగా కూర్చుండిపోయారు.

## 5

"కంగ్రాట్యులేషన్స్ దాసూ."

"కంగ్రాట్యులేషన్స్ కేమిటిలే. అయినా ఇది ఇంటర్వ్యూ మాత్రమేగా. సెలెక్టయినప్పటి సంగతి. అదలాఉంచు. నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి."

"ఏమిటబ్బా అంత ముఖ్యమైన విషయం?"

"రజనికీ, నీకూ వివాహం స్థిరపడ్డట్టేనా?"

"నీకుతెలియని కొత్తవిషయం ఏమీలేదు."

దాసు సిగరెట్టు ముట్టించి జగన్ ముఖంలోకి చూసి అన్నాడు వార్నింగిస్తున్న ధోరణిలో.

"రోజులు మంచివికావు భాయ్"

"ఏం, ఏమయింది?"

"ఆ డాక్టర్ శారదలేదూ?"

"ఆ—మళ్ళీ ఇంకో పుకారేదైనావా? నీ కింకోపని లేదళ్లే ఉంది దాసూ."

నవ్వుతూ బల్లమీద మోచేతులానించి, తల చేతుల్లో పెట్టుకుని వంగి, దాసు ముఖంలోకి నవ్వేశాడు జగన్. మొదటిసారిగా అతనివేలికి కట్టుకట్టి ఉండటం చూశాడు దాసు.

"ఆ కట్టేమిటి?"

"చిన్నగాయమైందిలే."

"........?"

"పొరపాటున ఆపరేషన్ కత్తి తగిలింది."

"దాంతో ఎందుకు ఆడావు?"

"మాటలో పరాగ్గా ఉండగా గుచ్చుకుంది."

దాసుకి ఉన్నట్టుండి సందేహం కలిగింది.

"అదేమిటోయ్, అలా కొత్తగా నేర్చుకుంటున్నవాడిలా కట్టాడు కట్టు! బలే డాక్టర్."

"డాక్టరుకాదు, శారద."

గొప్ప సత్యం కనిపెట్టినట్టు కుతూహలంగా అతని ముఖంలోకిచూసి, "గాయం నువ్వు చేసుకున్నావా, పొరపాటున ఆమె చేసిందా? అంటే వేలుగాని కోరికి—" అన్నాడు దాసు.

"షటప్" అన్నాడు జగన్ వెంటనే.

"ఆ డాక్టర్ విషయంలో కొంచెం శ్రద్ధగా ఉండు, బ్రదర్."

"అబ్బ. దాసూ, ఆవిడని గురించి నీకేమీ తెలియదు."

"తెలియనివాళ్ళు తెలుసనుకుంటుంటే, తెలిసినవాళ్ళు తెలియదనుకోవాలి కాబోలు."

"ఏం తెలుసు, నీ ముఖం?" అన్నాడు జగన్ కొంచెం కోపంగా.

"డబ్బున్నవాడివి, పేరు ప్రతిష్ఠ ఉన్నవాడివి. అందువల్ల గాలం నీ మీదే పడుతోందోయ్, పిచ్చివాడా. ఇప్పుడు తప్పించుకోలేకపోతే, ఇహ నీ తరంకాదు. రోమాన్సు ప్రారంభమైన మొదట్లోనే తుంచివేయాలి—"

"నీకు బుద్ధిలేదు."

"దాందుంపతెగ లేకపోతే పోనీ. ఇవాళ డాక్టరు ఇంటికి వెళ్ళకనేపోదును బుద్ధి ఉంటే. వెళ్ళినా అలా అకస్మాత్తుగా వెళ్ళి ఉండేవాడినికాదు."

"ఏం జరిగిందంటావు?"

"డాక్టరుగారు శారదని అడుగుతున్నాడు 'నువ్వు జగన్‌ని పెళ్ళిచేసుకుంటావా?' అని."

తెల్లబోయాడు జగన్. అపనమ్మకంతో అతని కళ్ళలోకి చూశాడు.

"కట్టుకథచెప్పకు దాసూ. ఇది జీవితాలతో వ్యవహారం."

"అందుకే హెచ్చరిస్తున్నాను. జగన్, నువ్వేమనుకున్నా నాకు డాక్టర్ కంటే నువ్వే ఎక్కువ. నిజం చెప్తాను. జరిగిందిదీ!"

జగన్ ఎలాగో తేరుకుని, "అయితే ఆమె ఏమంది?" అన్నాడు బెరుకుగా.

"'డాక్టరుగారూ' అని ఏదో చెప్పబోయింది. ఇంతలో నేను రంగంమీదికిరావటం జరిగింది."

"ఏదో పొరపాటు జరిగింది."

"పొరపాటో, గ్రహపాటో. ఏ కడుపో కాలో అయి ఉంటుందని నా అనుమానం. అందుకని, ఆ భారం ఏదో నీ మీదికి తోసెయ్యాలని డాక్టర్ చూస్తున్నాడు." తన మామూలు కర్కశ ధోరణిలో అన్నాడు దాసు.

"ఛీ" అన్నాడు జగన్. "అలా అభాండాలు వెయ్యకు. ఆవిడ ఆశయం అవివాహితగా ఉండి నృత్యంలో చివరిమెట్టు చేరుకోటమని నీకు తెలియదూ?"

"అప్పటి ఆశయం అదీ. లేకపోతే, అదీ నటనే నేమో. ఎవరికి తెలుసు. అందనిఫలం అని అనుకుంటే మోజు మరింత జాస్తవుతుందని పాచికవేసిందేమో. మళ్ళీ చెబుతున్నాను. నిర్దోషిఅని గట్టిగా తేలిస్తేగాని, దోషం అంతో ఇంతో ఉండకపోదని ప్రతివాడినీ మనం అనుమానించాలిసివస్తుంది. కీడెంచి మేలెంచమన్నారు. తర్వాత నీ ఇష్టం."

"డాక్టర్ని అడగమంటావా?"

"కాని, డాక్టర్ నిజం చెబుతాడనుకోను. ప్చ్. ప్రపంచం. ఇంతకీ నువ్వు శారదని చేసుకుంటావేమిటి కొంపతీసి?"

"దాసూ, రజని కెప్పుడూ అన్యాయం చెయ్యను."

"అన్యాయం, న్యాయం అనేవి ఊరికే మాటల్లో దొర్లే పదాలు. వాటి అర్థం, విలువ ఎప్పటికప్పుడు మారిపోతూవుంటాయి."

"హాయిగా ఉన్న ప్రాణానికి ఏదో తెచ్చిపెట్టావు."

"లేకపోతే జీవితం ఫస్ట్‌క్లాస్ ప్రయాణం అనుకున్నావా? పిచ్చివాడా. వ్యవహారం ముదరనీయవుకదూ?"

అతని జవాబుకోసం నిరీక్షించాడు దాసు. ప్రత్యుత్తరంగా జగన్ ఒక నిట్టూర్పు విడిచాడు. కొన్ని క్షణాలంతర్వాత నెమ్మదిగా అన్నాడు.

"డాక్టర్ అన్యాయం చెయ్యడు దాసూ. ఎవరికీ అన్యాయం చెయ్యడు. శారదకీ, రజనికీ, నాకూ—"

"ప్రపంచంలో ఎవరికీ, ఏం, అంతేనా? మరి వెయ్యి న్నూట పదహార్లు ఏ గంగలో కలిశాయి స్వామీ?"

జగన్ ఆలోచనలో పడ్డాడు.

"ఆ రోజే అనుకున్నాం. ఏదో పొరపాటని సద్దుకున్నాం. కాని, ఈ మధ్య ప్రకటించిన నివేదిక చూశావుగా. వెయ్యి న్నూట పదహార్లిచ్చిన మహాదాత పే రేమైంది?"

"ఎలా పొరపాటుపడ్డాడు డాక్టర్ ?"

"ప్యాస్‌బుక్‌లో చూసి, విత్ డ్రా చేశాడని చెప్పావుగా."

"అవును. డబ్బు తీసుకున్నట్టు పాస్ బుక్‌లో ఎంట్రీ ఉంది."

"హరహర మహాదేవ."

"అదేమిటి?"

"కైంకర్యం."

"ఛా. అలా అనకు." ఏదో పొరపాటున అలా జరిగింది.

"జగన్, నేనైతే అనవసరంగా ఎవర్నీ, ఏ పనినీ సమర్థించను. ఏ మాత్రం అనుమానాస్పదంగాఉన్నా, నిశితంగా విమర్శించి తీరతాను. ఎవర్ని వాళ్ళు మోసగించుకోవటంలో అర్థం లేదు. సరే నీ ఇష్టం, నే వస్తా మరి."

దాసు త్వర త్వరగా వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన కొద్ది సేపటికే డాక్టరు వచ్చాడు. అతన్ని చూడగానే ముకుళించిన వదనంతో లేని నవ్వు తెచ్చుకుని, "ఇప్పుడే దాసు వచ్చి వెళ్ళాడు డాక్టర్. ఇంటర్‌వ్యూకి పిలుపు వచ్చిందిట" అన్నాడు.

"మంచిదే" అని డాక్టర్ కుర్చీలో కూర్చుని, అతని చేతి కొక పత్రిక ఇచ్చాడు.

జగన్ "ఏమిటిది?" అని అందుకుని, తెరిచి పేజీలు తిప్పాడు. ఒక వ్యాసం శీర్షిక 'స్థానిక ధర్మాసుపత్రి డాక్టరు అధర్మం' అని ఉంది.

ఆశ్చర్యంగా చదివాడు. డాక్టరు చందాల పేరుతో డబ్బు వసూలుచేసి, కైంకర్యం చేస్తున్నాడనిఉంది.

"ఏమిటిది డాక్టర్?" అన్నాడు జగన్ వాడిన ముఖంతో.

"పరిస్థితులు సరిగా తెలియని వాళ్ళు వదంతి లేవదీశారు, అంతే"

"ఎవరంటావు."

"ఎవరైతే ఏం."

"తెలిస్తే వెళ్ళి నిలదీసి అడగవచ్చుగదా."

"అడిగినందువల్ల ప్రయోజనం ఏముంది?"

"అయితే ఏం చేద్దాం."

"ఒక పెద్దమనిషి ఎవరైనా ఇది పట్టి అభాండంఅని జవాబురాస్తే బాగుంటుంది."

"నిజమే. ఎవరిచేత రాయిస్తావు?"

"నువ్వు రాయకూడదూ?"

"నేనా?"

"అవును. ఏం; రాయకూడదా?"

"అహా—ఎందుకు రాయకూడదూ? తప్పక రాస్తాను.'

డాక్టరు చిరునవ్వుతో అతనివైపు చూచాడు. జగన్ కళ్ళు పక్కకి తిప్పుకున్నాడు. తన వెయ్యిన్నూట పదహార్ల సంగతి అడుగుదామనుకున్నాడు. కాని, ఇప్పుడు ప్రసక్తి తెస్తే తను ఎవరిచేతో, ఆ వ్యాసం రాయించాడని అపోహ పడతాడేమో ననిపించింది. అది గాక, ఎలా ముఖంమీద అడగ్గలడు? అడిగినా ఏదో చెబుతాడు. కాజేసినవాడికి ఏదోవంక చెప్పటం లెక్కా? కాని డాక్టర్ నిజంగా తన డబ్బు కొట్టేశాడా! కొట్టేయదలచుకుంటే లెక్క చూపించి ఆ పని చెయ్యవచ్చుగదా! అసలు పేరేలేకుండాచేస్తే, తను అడగవచ్చని అనుమానించడా? ఇందులో ఏదో కుంభకోణం ఉంది. ఏమిటే నస్పెన్సు, అడిగి తేల్చుకుందామనీ, అడిగితే ఏమనుకుంటాడోననీ, డోలాయమానమానసుడైనాడు జగన్.

డాక్టర్ అతనివైపు దీక్షగాచూసి, "అయితే రాస్తావా?" అన్నాడు.

"ఏమిటిడాక్టర్, అలా అడుగుతావు. ఎందుకు రాయను? ఊరికే జవాబు రాయటంకాదు. ఏకిపారేస్తాను" అన్నాడు జగన్ అకస్మాత్తుగా పాత స్నేహమంతా కళ్ళ కట్టినట్టయి, ఉద్రేకంగా.

"అంత ఏకిపారెయ్యొద్దు. ఆరోపణ నిరాధారమని రాస్తే చాలు."

డాక్టర్ వెళ్ళటానికి లేచాడు. శారద విషయం అడగాలని తీర్మానించుకున్నాడు జగన్.

"డాక్టర్, శారద కులాసాగా ఉందా?" అన్నాడు ఎలా మొదలుపెట్టాలో తెలియక.

"ఆహా. ఇప్పుడేకదా అక్కడినించి వస్తున్నావు!" అన్నాడతను.

"ఇందాక ఆసుపత్రిలో వేలు తెగింది."

"ఓ, అవునవును. శారద చెప్పింది. అడగటం మర్చిపోయాను."

శారద చెప్పిందట! తనూహించినట్టే జరిగింది. ఒకవేళ శారదకి తనమీద ప్రేమ కలిగితే డాక్టర్ రాయబారం జరుపుతున్నాడా? అకస్మాత్తుగా అతని కింకో అనుమానం కలిగింది. తన డబ్బు కూడా లెక్కలో చూపించకుండా ఉండటం రజనికి తన అసమర్థతని నిరూపించి, అయిష్టత కలగచెయ్యటానికా. భగవాన్! తన బుద్ధి ఇలా వక్రిస్తోందేం? ఇలాంటి ఊహలు తనని ముంచెత్తి వేస్తున్నాయేం?

ధైర్యాన్ని కూడా కట్టుకుని అడిగేశాడు తను.

"దాసు చెప్పాడు. శారద వివాహ ప్రసక్తి తెచ్చావుటగా."

డాక్టర్ స్తబ్దుడయ్యాడు.

"ఈ ప్రశ్న అడక్కుండా ఉంటే బావుండేది."

జగన్ నిరుత్తరు డయ్యాడు. 'ఏం, ఎందు కడక్కూడదు ?" అనాలనిపించింది. కాని అడగలేకపోయాడు.

"కాని అడిగావు. దాసు మా సంభాషణ విన్నాడని నాకు తెలుసు. అది నీకు చేరవేస్తా డనుకోలేదు. అతని ఊహాపోహాల విషయం తెలియనిది కాదు. అందువల్ల ఎక్కువ ఆశ్చర్యపడ నవసరం లేదనుకో. సమాధానం చెబుతాను, జగన్. కాని ఇప్పుడు కాదు. సమయం వచ్చినప్పుడు చెబుతాను. కాని నువ్వేమీ ఊహాపోహాలు పెట్టుకోకు. వస్తా మరి."

జగన్ పెదవి మెదపకుండా బల్లమీది పుస్తకాల వైపు చూశాడు.

డాక్టర్ తలుపు దగ్గరికి వెళ్లగానే రజని లోపలి కొచ్చింది. ముభావంగా 'నమస్తే డాక్టరుగారూ' అంది. డాక్టర్ పెదవులమీద చిరునవ్వు చిందించి 'నమస్తే' అని వెళ్లిపోయాడు.

"రజనీ" అన్నాడు జగన్ ఆమె లోపలికి వచ్చి రావటంతోనే.

"బావా" అందామె.

జగన్ పత్రిక ఆమెవైపు నెట్టి "చూడు" అన్నాడు. ఆమె పత్రిక పేజీలు తిప్పి చూసి మూసేసి బల్లమీద పడేసింది.

"మరి లోకుల డబ్బు కాజేస్తుంటే ఊరుకుంటారా ?"

"ఆ వ్యాసానికి నేను సమాధానం రాయాలి."

"నువ్వా ?" ఆశ్చర్యంగా అంది రజని.

"అవును. డాక్టర్ అడిగాడు. రాస్తానని మాటిచ్చాను."

అతని కళ్లలోకి సూటిగా చూసింది రజని.

"ఎలా మాటిచ్చావు ? ఆ వ్యాసంలో ఆరోపణ అబద్ధమా ?"

"కావొచ్చు, కాకపోవచ్చు. కాని దాన్ని ఖండించటం నా ధర్మం."

"ధర్మం. ఏమిటి ధర్మం. గోముఖ వ్యాఘ్రాల్ని సమర్థించటమా ?"

"రజనీ. డాక్టర్ నా స్నేహితుడు."

"ఎవరు చేసినా తప్పు తప్పే. అభిమానా లెందుకు ?"

"డాక్టర్ డబ్బు కొట్టేశాడని రుజువుకాలేదు. ఎందుకు అనవసరంగా అతన్ని నిందించటం ?"

"ఇంకేం రుజువుకావాలి ?"

"ఆ చెక్కు ఆయన పారేసుకుంటే ఎవరైనా మార్చారేమో. లేకపోతే ఎవరికైనా యిచ్చి మార్చుకు రమ్మంటే అతను కొట్టేశాడేమో."

"ఇంత దౌర్బల్యం ఉందనుకోలేదు, బావా. నిక్కచ్చిగా ఎందుకు అడగవు ?"

"అడగటానికి తొందరేముంది ?"

"మనసు పాడుచేసుకుంటూ తొందరేముం దంటావేం?

"రజనీ, నా మనసు బాగాలేదు. నాపేర నువ్వే ఓ వ్యాసం రాయకూడదూ.?"

"నా వల్లకాదు."

"సరే, నేనే రాస్తాలే."

"నువ్వు రాయటానికి వీల్లేదు."

"ఏమిటి రజనీ, మొండిపట్టు పడతావేం ? పరిస్థితి అర్థంచేసుకోలేవా ?"

రజని ఒక్క క్షణం ఆలోచించింది.

"ఆ వ్యాసం రాసిం దెవరో తెలుసా ?"

"ఊహూఁ. తెలిస్తే ఆ చెంపా ఈ చెంపా వాయించే వాడిని."

"వాయిస్తావా ?"

"తప్పక."

"అయితే వాయించు. నేనే రాశాను."

జగన్ ఆమెవైపు చూసి దిగ్భ్రమచెందాడు.

"ఎవరు ? నువ్వా ?"

"నేనే."

"రజనీ !" వలపు తలపులు పెంచుకుని మురిపెంగా చూసుకుంటున్నరజని జీవితంలో మొట్ట మొదటి సారిగా గుండెలో తన్నినట్టయింది.

ముఖంలో కళాకాంతులు తగ్గిపోయాయి.

"ఎందుకు రాశావు రజనీ ?" అన్నాడు హీనస్వరంతో.

"అది నా కర్తవ్యం."

"కర్తవ్యం ! డాక్టరు మనసు కష్టపడితే నా మనసు కష్టపడుతుందని తెలియదా రజనీ ? తెలుసు, తెలుసు. నే నెలా బాధపడినా నీ కనవసరం. నీ కసి తీర్చుకోటమే నీకు కావలసింది. ఏం, అంతే కదూ ?"

"బావా, నువ్వు పరిస్థితుల్ని అర్థం చేసుకోటంలేదు. సంఘక్షేమం దృష్ట్యా చేసిన పనిని వ్యక్తిగత క్షేమం దృష్ట్యా విమర్శిస్తున్నావు."

"సంఘక్షేమం ! డాక్టర్ని నువ్వెంత ద్వేషిస్తున్నావో అతను నిన్నంత సానుభూతితో చూస్తున్నాడు. నీకు తెలియదు. నీలో సంకుచితత్వం, స్వార్థం, దురాశ, అహంభావం ఇల్లు కట్టుకొని—"

"చాలు. శబ్దాడంబరం అనవసరం."

"నీకు కోపం వస్తోంది. కర్కశమైన నిజం వింటుంటే కోపం రాదా! రజనీ, నాకోసం నువ్వేమీ చెయ్యలేవు. నీకు కావలసింది నేను కాదు. హోదా, అధికారం, దర్జా, డాబు, దర్పం—"

"జగన్." రజని అతనివైపు రోషంతో చూసింది.

"ఆవేశం తెచ్చుకోకు. నిజం తెలిస్తే దిద్దుకోటానికి వీలుంటుంది."

"నిజం సాకుతో నువ్వు చేసే అవమానం సహిస్తూ కూర్చునే అవసరం నాకు లేదు!"

"నువ్వు ఆలోచించవు. సరే. నీకో విషయం చెబుతున్నాను. నేను ఐ. ఏ. ఎస్. కి కూర్చోను."

"ఎవర్ని బెదిరిస్తున్నావు?"

"డాక్టర్‌మీద నాకున్న విశ్వాసం సడలితే సడలిందేమో. కాని అతను నాకు ముఖ్య స్నేహితుడు. కనీసం ఒకప్పుడైనా గాఢ స్నేహితుడు. జీవితాంతం నే నతన్ని స్నేహితుడుగానే చూడదలుచుకున్నాను."

"నష్టపడేది నువ్వే."

"ఇప్పుడు చెప్పు, నన్ను పెళ్లి చేసుకోటం నీ కిష్టమేనా?"

"మొగవాడివి కనుక అధికారం చెలాయిస్తున్నావు. అంతేనా?"

"కాదు. నా ఉద్దేశాలు చెబుతున్నాను. తర్వాత విచారించి ప్రయోజనంలేదు."

"పైగా విశాల హృదయుడి నని చాటుకుంటావు."

"నేనేం చాటుకోటంలేదు. నేను చాటుకునేది నా హృదయంలోని గాయాన్నే."

హృదయంమీద చెయ్యి పెట్టుకోగా, అతని వేలికి కట్టిన కట్టు చూసి గతుక్కుమని "ఈ కట్టేమిటి బావా?" అంది రజని అతని చెయ్యి చేతిలోకి తీసుకొని.

"ఆసుపత్రిలో శారదతో మాట్లాడుతూ పరధ్యానంగా ఉంటే ఆపరేషన్ కత్తి తగిలింది. శారద కట్టు కట్టిందిలే" అన్నా డతను.

అప్రయత్నంగా ఆమె చెయ్యి వదిలివేసింది.

"శారద!"

"అందుకేనా ఇప్పటిదాకా చెప్పలేదు?"

"ఎందుకు?"

'ఛీ. అందుకేనా అంత దౌర్జన్యంగా వదిలించుకోవాలని చూశావు?" అని అతని జవాబుకి కూడా ఎదురు చూడకుండా గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్లిపోయింది రజని.

అత నాశ్చర్యంగా ఆమె వెళ్లిన వైపే చూడసాగాడు.

దౌర్జన్యంగా వదిలించుకోట మేమిటో మొదట అతనికి అర్థంకాలేదు. తరువాత తెలిసి 'ఛీ' అనుకున్నాడు. రజనీ! రజని! జీవితంలో తను ఆమెకి అర్థంకాడు. ఎందుకీ అతకని బతుకుల సంసారం. విరక్తితో చేతుల్లో తల పెట్టుకుని శూన్యంలోకి చూడసాగాడు జగన్.

## 6

ఉన్నట్టుండి ఒకరోజు రాత్రి ఎవరికీ చెప్పకుండా జగన్ ఊరు విడిచి వెళ్లిపోయాడు. ఆ రోజు అతని ఇంటి నుండి అలా చరచర వచ్చిం తరవాత మళ్లీ అటువైపు వెళ్లలేదు రజని. జగన్ ఎక్కడికి వెళ్లాడో ఎవరికీ తెలియదు. మొదట ఏదో పనిమీద వెళ్లా డనుకున్నారు. కాని ఎవరికీ ఏ ఉత్తరమూ రాకపోయేసరికి గాబరాపడ్డారు. ఇంట్లో సామానంతా అలాగే ఉంది. తాళం పగులగొట్టి చూశారు. జగన్ మామయ్య అతని తండ్రికి రాశాడు. అందరూ గాబరాపడి వాకబుచేశారు. బ్యాంకులో కనుక్కుంటే అకౌంటులో డబ్బంతా ఢిల్లీకి మార్చారని తెలిసింది. ఇలా ఉండగా జగన్ తండ్రికి ఒక ఉత్తరం రాశాడు. అందులో తను క్షేమంగానే ఉన్నాననీ, ఇప్పట్లో తిరిగి రాననీ రాశాడు. పోనీ ఎక్కడో క్షేమంగా ఉన్నా డనుకున్నారు.

ఉత్తరంవచ్చి సంగతి తెలిసే వరకూ రజని గాబరా పడ్డది. ఉత్తరం వచ్చింతరవాత ఆమెకి వెన్నులో బాకు పెట్టి పొడిచినట్టయింది. తనకి ఉత్తరం రాయలేదు. అంటే తనని మర్చిపో దలుచుకున్నాడన్నమాట. తను అనుమానించి నంతా అయింది. మనసిచ్చాడని భ్రమించి మనసిచ్చింది. తన నెప్పుడు ఏ విషయంలోనూ లక్ష్యపెట్టలేదు. తనెంత తగ్గినా తన పట్టుమీదే ఉన్నాడు. ఎందుకో అంత అహంభావం!

రజని అలా మథనపడుతూండగా దాసు ఒకసారి ఆమెకి శారదతో డాక్టరు అన్న మాటలు చెప్పాడు. ఆ మాటలు వినగానే ఆమె ముఖం వివర్ణమయింది. శారదని ప్రశంసిస్తుంటే మొదటినుంచీ తనకి అనుమానంగానే ఉంది. చివరికి అదే నిజమయిపోయింది. తనేమో ఇంకా అతన్ని పట్టుకొని ప్రాకులాడాలని చూస్తోంది. సిగ్గుతో ఆమె తల దించుకుంది. ఛీ. ఎంత అన్యాయం చేశాడు? కాని శారదని వివాహం చేసుకోదలిస్తే ఇంతకాలం ఆగటం దేనికి? ముఖం తప్పించి తను సంబంధం నిరాకరించాడని రూఢి అయిం తర్వాత వచ్చి క్షేమంగా ఆమెని వివాహం చేసుకోవాలనా? అప్పటికి తనని వదిలించుకున్నట్టు నోటితో చెప్పకుండా క్రియారూపంగా చెప్పవచ్చు. బహుశా, వేరే సంబంధం చూసుకోమని రాస్తాడు కాబోలు. రజనికి తీరని అవమానం కలిగింది. అతను వద్దనేదాకా తను కనిపెట్టుకు కూచోటం అవమానకరం. ప్రతీకారం చేయాలి. రజనిజీవితాన్ని తన యిష్టం వచ్చినట్టు శాసించలేడని తెలిసి వచ్చేట్టు చేయాలి. గుండె దిటవు చేసుకుని రజని తల్లితో చెప్పేసింది స్పష్టంగా. అందరూ ఆశ్చర్యపోయారు. జగన్ చెప్పా పెట్టకుండా ఊరు విడిచి వెళ్లినప్పుడే ఇద్దరికీ పొరపొచ్చా లేవేవో వచ్చాయని అనుకున్నారు. రజనికి ఉత్తరం కూడా రాకపోయేటప్పటికి అది రూఢి అయింది. ఇప్పుడు రజని తను జగన్‌ని చేసుకోనని చెప్పటంతో ఆ సంగతి పూర్తిగా స్పష్టమైపోయింది.

ఎన్నో నచ్చచెప్పారు. జగన్ వచ్చిందాకా ఆగి సంగతేమిటో తేల్చుకుందా మనుకున్నారు. కాని రజని కచ్చితంగా తన నిర్ణయానికి తిరుగు లేదని చెప్పటంతోనూ, జగన్ వెళ్ళి ఏడెనిమిది నెలలయినా ఉత్తరం కూడా లేకపోవటంతోనూ వేరే సంబంధం చూసే ప్రయత్నంలో పడ్డారు.

ఈ మధ్యలోనే దాసుకి డిస్ట్రిక్ట్ మున్సిఫ్ సెలెక్షన్ వచ్చింది. హుషారుగా డాక్టర్‌తో చెప్పాడు. డాక్టర్ కంగ్రాట్యులేషన్స్ చెప్పాడు. దాసు ముఖ్యులకి విందొకటి ఏర్పాటు చేశాడు. జగన్ ఊరు విడిచి వెళ్ళినప్పటినుంచీ డాక్టర్ మనసు మనసులో లేడు. అతనిలో ఉత్సాహం తగ్గిపోయింది. ఏ కారణంవల్ల అతను ఊరు విడిచి వెళ్ళిపోయి ఎవరికీ తెలియకుండా దాక్కున్నాడో తెలియక బాధపడ్డాడు. రజనికి కూడా ఉత్తరం లేదని తెలిసేసరికి వాళ్ళిద్దరి మధ్యా ఏవో భేదాభిప్రాయాలు వచ్చిఉంటాయనీ, అందుకే తిరిగి ముఖం చూపించటం ఇష్టంలేక రాలేదనీ, చివరికి తనకి రాయకపోవటానికి కూడా అదను తెలుస్తుందనే కారణంవల్లనే నని తీర్మానించాడు. దాసు పిలిచిన విందుకి వెళ్ళటం ఇష్టంలేకపోయినా వెళ్ళకపోతే బాగుండదని హాజరయ్యాడు.

దాసుకి కూడా జగన్ వెళ్ళిపోయిన కారణం మొదట తెలీలేదు. తర్వాత రజనితో మాట్లాడితే అతనికి విషయం కొంత స్పష్టమైంది. రజని అతన్ని తిరస్కరించిందనీ, దాంతో అతనికి విరక్తి కలిగి వెళ్ళిపోయాడనీ అనుకున్నాడు. ఆ తర్వాత, ఇద్దరూ ఒకరంటే ఒకరికి అయిష్టత కలిగి పెళ్ళి ఇష్టపడలేదనీ అభిప్రాయపడ్డాడు. విందులో జగన్ లేకపోవటం అందరికీ పెద్ద లోపంగా ఉంది. రజని ఇంటికి వచ్చి రాత్రంతా ఏడ్చింది. తెల్లారి తన బలహీనతకి తిట్టుకుంది. లేనిపోని వ్యామోహంతో తనెందుకు బాధపడాలి. ప్రతీకారం చేసి తీరాలనుకుంది. తను లేకపోతే తన జీవితం పట్టి ఎడారి అని భ్రమించి ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించినవాడికి నీతి పాఠం చెప్పటం తన కర్తవ్యం.

జగన్ సంబంధం కాదని తేలిపోయేటప్పటికి రజని తండ్రి దృష్టిలోనికి దాసు వచ్చాడు. గెజిటెడ్ ఆఫీసరయ్యాడు. ఆస్తి ఎక్కువ లేకపోయినా ఇబ్బంది లేదనుకున్నారు. ఈ మాట రజనితో అనేసరికి ఆమెగుండెలు గతుక్కుమన్నాయి. ఆ భావాన్ని ఆమె సరిపెట్టుకోలేక పోయింది. కాని దాసు దగ్గిర ఈ ప్రసక్తి వచ్చినప్పుడు అతను ఇష్టపడ్డట్టే మాట్లాడాడని తెలిసి తండ్రి రజనిని కొంత బలవంతం చేశాడు. మంచి పదవిలో ఉన్నవాడు, తెలిసినవాడు. ఒకసారి రజనితో దాసే ఈ విషయం కదిపాడు. ఆమె ఆలోచించి చెబుతానంది. నిర్ణయించేసే సమయంలో ఆమె గుండెలు దడదడ లాడాయి. హృదయంలో ఏమూలో 'రజనీ' అని జగన్ పిలిచినట్టయింది. ఆ రోజల్లా ఏడ్చింది. కాని మళ్ళీ గుండె దిటవు చేసుకుని తన అంగీకారాన్ని తెలిపింది. దాసు సంతోషించాడు.

శుభలేఖలు అచ్చయేదాకా డాక్టరుకి ఈ విషయం తెలియలేదు. రజని వివాహం నిరాడంబరంగా జరగాలని అంది. శుభలేఖలు కూడా కొద్దిమంది మిత్రులకీ, బంధువులకీ మాత్రం పంపటం జరిగింది. వివాహం నిశ్చయమైందని తెలిసినరోజే డాక్టర్ రజనిని కలుసుకున్నాడు. నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు.

"తొందరపడుతున్నావమ్మా" అన్నాడు.

రజనికి డాక్టరుమీద గొంతుదాకా ఉంది. ఈ అనర్థాలన్నిటికీ అతనే మూలం అని ఆమె గాఢనమ్మకం.

"నా సంగతి నేను చూసుకోగలను. పసిదానను కాదు గదండీ డాక్టరుగారూ" అంది. డాక్టర్ చేసేదిలేక నిట్టూర్పు విడిచి వచ్చివేశాడు.

మర్నాడే ముహూర్తం.

"జగన్ ఇలా చేస్తాడని ఎప్పుడూ అనుకోలేదు, శారదా" అన్నాడు ఆనపత్రిలో డాక్టరురావు గుండె బరువుతో.

"ఏదో గట్టి కారణమే ఉండాలి" అందామె బాధగా.

"ఏవేవో కల్పించుకుని ఉంటాడు. అనుమానిస్తూనే ఉన్నా గాని మరీ ఇంత తొందర పడతాడని అనుకోలేదు. రజనీ జగన్‌ల ప్రవర్తన మొదటినుంచీ నాకు తెలిసినంత వరకూ అలాగే ఉంది. ఒక్కొక్కసారి ఇద్దరూ వెన్నలా కరిగి పోతారు. మరోసారి బిర్రబిగిసి పోతారు."

"ఎవరు డాక్టర్ బిర్ర బిగిసేది ?"

అదిరిపడి డాక్టర్, శారదా ఇద్దరూ తలుపువైపు చూశారు.

"హల్లో జగన్" ఆనందంతో కౌగిలించుకున్నాడు డాక్టర్.

చేతిలోని పేపరు బల్లమీద కొట్టి "ఏమిటి డాక్టర్ ఈ దురన్యాయం ?" అన్నాడు జగన్.

ఫొటోలతో సహా రజనీ, దాసుల వివాహం జరగబోతోందని ప్రకటన !

"అవును" అన్నాడు డాక్టర్. "కాని నువ్వు వచ్చావుగా. నాకు ధైర్యంగా ఉంది. శారదా, రజనిని అర్జంటుగా ఇక్కడికి రమ్మని కబురుచెయ్యి." శారద బయటికి వెళ్ళింది.

"ఏమిటి ధైర్యం ?" అన్నాడు జగన్.

"ఏ విషయం నువ్వు చూసుకోగలవని—"

"డాక్టర్—స్నేహితుడివై వుండీ, ఈ విషయం నాకు తెలియపరచలేదు కదూ ?"

"జగన్, తెలియపరచకుండా ఉండగలనా. ఈ ప్రకటన వేసిం దెవరు ? నేను కదూ ? సమయానికి వచ్చావు, జగన్. నువ్వు చూస్తావనే ఆశ ఏ మూలో కిరణంలా వెలిగింది."

జగన్ డాక్టర్‌వైపు తదేకంగా చూసి "డాక్టర్" అని కౌగిలించుకొన్నాడు.

"జగన్, చెప్పకుండా వెళ్ళాలిసిన అవసరం ఏం వచ్చింది.'

జరిగింది చెప్పాడతను డాక్టర్‌కి. తన పొరపాట్ల వల్లే అంతా అలా జరిగిందని పశ్చాత్తాప పడ్డాడు డాక్టరు.

"నీ చందా విషయం మొదట పొరపాటువల్ల మర్చి పోయాను. తర్వాత నీ రియాక్షన్ చూడాలనుకున్నాను. డబ్బుసంగతి నువ్వు అడుగుతావని ఆశించాను. ఎప్పుడూ అడగలేదు. చివరికి అవకాశం యిచ్చినా నువ్వు ఉపయోగించు కోలేదు. కాని లోలోపల బాధపడ్డావు. ఇహ నేనే చెప్పేద్దా మనుకుంటుండగానే ఈ ఉపద్రవం జరిగింది. జగన్, ఏవేవో ఊహించుకుని బాధపడటం కంటే స్పష్టంగా అడిగి తేల్చేసుకో కూడదా ? నీకు ఈ విషయం బాగా తెలిసిరావాలనే అలా చేశాను. అది ఇలా పరిణమించింది" అన్నాడు డాక్టర్ బాధగా.

"వివాహ ప్రసక్తిని గురించి సమయం వచ్చినప్పుడు చెబుతా నన్నావు. ఇప్పటికైనా సమయం వచ్చిందను కుంటాను."

"చెబుతాను జగన్. నీకూ రజనికీ తత్వాలపట్ల అసంతృప్తి ఉందని నాకు తెలుసు. అనేకసార్లు మాటల సందర్భంలో బయటపడ్డారు. కాని మీ రిద్దరూ ప్రేమించు కున్నారని కూడా తెలుసు. అయితే ఏ కారణంవల్ల నైనా మీ యిద్దరికీ వివాహం జరక్కపోతే నీ మనసు దెబ్బతింటుం దని గ్రహించాను. జీవితం ప్రారంభం అయ్యే తరుణంలోనే ఒక వ్యక్తి నిరాశావాది ఐపోతే మానవుడి ప్రగతికి ఓ కళ్ళెం తగిలించినట్టు అవుతుంది. జగన్, మనసుని మంచీ, చెడూ చెరొకవైపుకీ లాగుతాయి. తొలి అనుభవాలే ఎదురుదెబ్బ లైతే ఎటుచూసినా నైరాశ్యమే కలుగుతుంది. తరువాత ప్రతి విషయం ఆ దృక్పథంతోనే పరిశీలించే అవకాశం ఉంది. మనసు గట్టిది కాకపోతే ఈ ప్రమాదం మరీ ఎక్కువ. దీనికి క్రమంగా లోబడే అవకాశం ఉందని నాకు తెలుసు. చిత్ర మేమంటే నీతో స్వల్పకాల పరిచయమే ఉన్నా శారద ఆ విషయాన్ని గ్రహించింది. రజనికి తెలియదు. వా రిద్దరికీ ఇదే తేడా. ఆ పరిస్థితిలో, నీ మనసుకి దెబ్బ తగిలితే కాపాడ గల ధైర్య స్థైర్యాలు శారదకి ఉన్నాయని అనుకున్నాను. అయితే స్వార్థత్యాగం కూడా కావాలి. అందుకనే శారదని కదిలించాను. కాని పొరబడ్డాను .... మనసు ఒక్కటే కాదు జగన్. హృదయం కూడా కావాలి. హృదయంలో ప్రేమలేనిదే ఏమీ చెయ్యలేము. శారద .... శారద .... సరే ఆ విషయం అలా వదిలేయి. ఇప్పటి కార్యక్రమం ఏమిటో తేల్చు.

ఇద్దరూ ఆలోచిస్తూండగా బయట అడుగులచప్పు డయింది.

ఎవరో చూసి వస్తానని డాక్టర్ బయటికి వెళ్ళాడు.

రజని !

"రజనీ!" అని కేకవేసి చేతులు చాపాడు జగన్. కాని ఆమె దూరంగానే నిలబడి గాద్గదిక స్వరంతో 'బావా' అంది.

"రజనీ, కోపంలో ఏదో అంటే ఇలా తొందర పడతావా ?"

"తొందరపడ్డాను. నిజమే. క్షమించు బావా" అంది రజని గిర్రున తిరిగే కన్నీటిని తుడుచుకుంటూ.

"నేను ఐ. ఏ. ఎస్. పరీక్షకి కూచున్నాను. సెలెక్ట్ కూడా కావచ్చు. రజనీ" అన్నాడు ప్రేమగా.

రజని దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. బల్లమీద తల పెట్టుకుని "బావా, నాకోసం నువ్వు ఏదైనా చేయగలవు. తెలుసుకోలేకపోయాను. నీ మనసుకి తృప్తిగా నేనేమీ చేయ లేక పోయాను" అని కన్నీటి ధారలతో అభిషేకిస్తుండగా అతనామె కన్నీటిని రుమాలుతో తుడవసాగాడు.

"కొంచెం దూరంగా ఉండు బావా, నేను తుడుచు కుంటాలే" అంది రజని బాధగా.

"రజనీ" అన్నాడు హృదయంమీద చెయ్యి వేసుకొని జగన్. కాని కదలలేకపోయాడు.

"హల్లో డాక్టర్. హృదయపూర్వకమైన ఆహ్వానం— అరె జగన్ ! రజని !—ఓ, సారీ. డాక్టర్ ఉన్నాడనుకున్నాను. బావా మరదళ్ళ సరసం బాగుండలేదు. జగన్ క్షమించాలి." దాసు గబగబ లోపలికి ప్రవేశించి వాళ్ళని చూసి అన్నాడు.

"దాసూ, ఏమిటా మాటలు ?" అన్నాడు జగన్.

"జగన్, నువ్వు నా స్నేహితుడివే. కాని అనుమానాస్పదమైన విషయాలు జరగటం నేను సహించను. క్షమించాలి. నా సంగతి నీకు తెలుసుకదూ ?" అన్నాడు దాసు.

"తెలుసు దాసూ, చక్కటి మొగలిపువ్వు యిస్తే ముందు రేకులముళ్ళే చూస్తావు. సరే, డాక్టరు దయవల్ల నువ్వేమీ సహించాలిసిన అవసరంలేదు. తరువాత తీరిగ్గా మిగతా విషయాలు మాట్లాడుకో కూడదూ ?" అన్నాడు జగన్. చప్పున ముఖ కవళికలు మార్చి ఇద్దరివంకా ఓసారి చూసి "అలాగే, నేను మాత్రం నీ స్నేహితుణ్ణే కాదా, జగన్" అనేసి దాసు బయటికి వెళ్ళిపోయాడు.

అతని స్వరంలోని సహజత్వానికి జగన్ ఆశ్చర్యపడ సాగాడు. అతని కళ్ళలోకి సాలోచనగా చూస్తూ "జగన్‌కి మొగలిపువ్వంటే అంత ఇష్టమా !" అనుకుంది రజని.

# నన్నయరచనలో కొన్ని సవరణలు

శ్రీ మంగిపూడి కృష్ణమూర్తి

ఆంధ్రగ్రంథ ముద్రణోద్యమము ప్రారంభింపబడి ఇప్పటికి సుమారు నూట పదియేను సంవత్సరాలైనది. అంతకు ముందు తెలుగులో వ్రాతప్రతులేకాని, ముద్రిత గ్రంథాలులేవు. వీటిలో మొట్టమొదట ముద్రింపబడినవి భాగవత భారత రామాయణములు. తక్కిన గ్రంథము లన్నిటికంటె హెచ్చు సవరణలతోనూ, పాఠాంతరాలతోనూ కూడుకొన్నది ఆంధ్ర మహాభారతం. అందులోనూ ఆది సభా పర్వములలో పాఠాంతరముల సంఖ్య అత్యధికముగా కన్పించుచున్నది. ఆంగ్ల భాషా గ్రంథములలో ఈ పాఠాంతరముల బెడద చాల తక్కువ. కారణమేమనగా, ఆంగ్లభాషలోని ముఖ్య గ్రంథములన్నియును— ఒక్క ఛాసరు రచనలు తప్ప (Chaucer) ఇంగ్లండులో అచ్చు యంత్రములు విరివిగా వ్యాప్తిలోనికి వచ్చిన తరువాత రచింపబడినవే. వాటికి వ్రాత ప్రతుల బాహుళ్యములేదు. షేక్స్పియరు నాటకములలో అక్కడక్కడ కొన్ని పాఠాంతరములు కన్పించుచున్నవి. మిల్టను రచించిన 'పేరడైజ్ లాస్టు' (Paradise Lost) అను గ్రంథములో పరిష్కర్తల అభిరుచులబట్టి సవరణలు చేయబడియున్నవి. (ఈ విషయమై యింకను వివరములను తెలుసుకొనగోరువారు 15—10—1956 తేదీని సర్ మారిస్ బౌరా యిచ్చిన ఉపన్యాసాలను చూడవచ్చును. Sir Maurice Bowra's Presidential address delivered to the members of the Birmingham and Midland Institute)[1]. మన తెనుగు భాషలో రచింపబడిన ప్రతిగ్రంథమునకును (ఆధునిక గ్రంథములకు కాదు) వందలకొలది వ్రాతప్రతులు నేడు కన్పించుచున్నవి. ఒక ప్రతిలో ఒక విధముగానున్న పాఠములు, మరియొక ప్రతిలో మరియొక విధముగా కన్పడుచున్నవి. వీనిలో లేఖకుల ప్రమాదములవలన కలిగినవి కొన్నియు, పరిష్కర్తల ఊహాపోహలను బట్టి మార్చి వేయబడినవి కొన్నియు, వ్యాకరణకర్తలును, నిఘంటుకారులును, తమ తమ వాదములకు అనుకూలముగా దిద్దివేసినవి మరికొన్నియునూ-ఈవిధముగా ఒక్కొక్క గ్రంథమున వేలకొలదియు సవరణలు తయారైనవి.

ఈ పాఠాంతరముల సాధుత్వాసాధుత్వములను నిర్ణయించవలసిన బాధ్యత నేటి పండితోత్తములపై నున్నది. అనువాదిత గ్రంథములను పరిష్కరించవలెనన్నచో మూల గ్రంథమును సమగ్రముగా పరిశీలించుట చాల ముఖ్యము. అనువాదమును మూలముతో సరిపోల్చి చూచినచో చాలచోట్ల మనకు సందేహ నివృత్తియగును. ఇది ఒక ప్రధానమైన మార్గము. ఇంక మూలమును అతిక్రమించి వ్రాయబడిన సందర్భములలో, పూజ్యశ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు నుడివినట్లు, "భాషా స్వరూపము, కవి ప్రయోగ విశేషము, కవి హృదయము, ప్రకరణమునందలి సందర్భశుద్ధి మొదలగువానిని గమనించి" చక్కబరచవలెను.[2]

ఏ తత్కార్యమును నిర్వహించుటకు ఎంతో ఓర్పును, నేర్పును, సారస్యగ్రహణపారీణతయు నుండవలెను. కాకలు తీరిన భాషా మర్మవేత్తలు బాగుగా చర్చించి, విమర్శించి, సరియైన సాధు పాఠములను సాధించవలెను. సాధింపబడిన సాధు పాఠములు, అచ్చు తప్పులు లేకుండ ముద్రింపబడునట్లు ప్రూఫులు దిద్దవలెను. ఇంత శ్రమకోర్చి శ్రీ వావిళ్లవారు ముద్రించిన ఆంధ్ర మహాభారతములోనే నేటికి లెక్కకు మిక్కిలియైన స్ఖాలిత్యములు ప్రత్యక్షమగుచున్నచో, తక్కిన చిల్లర ముద్రాపకులచే ముద్రింపబడిన గ్రంథముల మాట వేరుగా చెప్పనేం?

పూర్వ గ్రంథములలోని పాఠాంతరములనుగురించి శ్రీ తిమ్మావజ్ఝలవారు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు—మొదలైన సాహిత్యోపాసకోత్తములు ఇటీవల 'భారతి'లో వ్యాసములను ప్రకటించి, ఆంధ్రభాషకు చిరస్మరణీయమగు ఉపకారము చేయుచున్నారు. సుమారు 17 సంవత్సరములక్రిందట 'షాడబము' అను పదముయొక్క అర్థమును నిర్ణయించుటకై ఒక సంవత్సర కాలము భారతీపత్రికా ముఖమున చర్చలును, వాదోపవాదములును జరిగినవి. ఇప్పుడు 'ధనంజయ ప్రవరుడు' అను ప్రయోగమునుగురించి చర్చ జరుగుచున్నది. ఇట్టి చర్చలవలన విద్యార్థులకునూ, ఉపాధ్యాయులకునూ, తదితర సాహిత్యోపాసకులకునూ గూడ ఎన్నియో నూతనవిషయములను తెలుసుకొనుటకు అవ

---

1. చూడు. English Critical Essays, Twentieth Century, Second Series-page 137.
2. చూ భారతి 1961 డిసెంబరు. పుట 38.

కాశము గలుగుచున్నది. నేను ఆంధ్రమహాభారతమును కేవలము కథను మాత్రమే తెలుసుకొనవలెనను ఉద్దేశముతో బాల్యమున ఒకటి రెండు పర్యాయములు చదివినాను. ఇటీవల పరిశోధనా దృష్టితో మరల మూలమును దగ్గరనుంచుకొని మూడు పర్యాయములు చదివినాను. అందులో నాకు కన్పించిన అసమంజస పాఠములలో కొన్నిటినిగురించి మనవి చేయుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

## 1. చెప్పనివాఁడు?—చెప్పనివాఁడు

తన యెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా యిది యెట్లు సెప్పుమని యడిగినఁ జె
ప్పని వాఁడును, సత్యము సె
ప్పని వాఁడును ఘోర నరక పంకమునఁ బడున్.

(ఆ—1—137)

ఇవి భృగునితో అగ్నిదేవుడు చెప్పిన మాటలు. ఈ పద్యములోని మూడవ, నాల్గవ పాదములలో 'జెప్పనివాఁడు' 'సత్యము సెప్పని వాఁడు' అను పాఠములకు బదులుగా 'జెప్పనివాఁడును, 'సత్యము సెప్పని వాఁడును' అను పాఠాంతరము తీయబడినవి. పరిష్కర్తలు 'వాఁడు' అను కాలసూచక పద పాఠమును ఏల గ్రహించినారో తెలియుటలేదు. సంస్కృత భారతములో పై పద్యమునకు మూలము—

పృష్టోహి సాక్షీ య స్సాక్ష్యం
జానానోఽన్యథా వదేత్
సపూర్వా నాత్మనస్సప్త
కులే హన్యాత్తథా పరాన్
యశ్చ కార్యార్థ తత్త్వజ్ఞో
జానానో ఽపి న భాషతే
సోఽపి తేనైవ పాపేన
లిప్యతే నాత్ర సంశయః"

(ఆది—7—3,4)

అని యున్నది. యః, సః, అని యుండుటచేత 'చెప్పనివాఁడు' అనునదియే సాధు పాఠమని సంస్కృతభాషయందు ఏమాత్రపు జ్ఞానమున్నవారికైనను స్ఫురించును. 'వాఁడు' అనునది లేఖకుని ప్రమాద జనితమై యుండి యుండనోపు.

## 2. అంగములు వదలె

తలవడఁకఁ దొడఁగఁ బింద్రిలు
ముం గర్వమడంగె, నంగములు వదలె పలి
తంబులయ్యె వగరును
దలయేరును సుక్కినయును దలకొనుదెంచెన్

(ఆది—3—19)

పై పద్యము యయాతి మహారాజయొక్క వార్ధక్యమును వర్ణించునట్టిది. దీనిలో 'అంగములు వదలె' అని ముద్రింపబడియున్నది. వదలు (దే. క్రి)=విడుచు, వీడు—అని నిఘంటువులోని అర్థము. (చూడు. శబ్దరత్నా). అయినచో మరి అంగములు విడుచుట యేమి? మూలమున అటువంటి యర్థము నిచ్చు పద మేదియు ప్రయుక్తము కాలేదు.

"జరాం ప్రాప్య యయాతిస్తు
స్వపురం చైవ ప్రాప్యహి
పుత్రం జ్యేష్ఠం వరిష్ఠం చ
యదు మి త్యబ్రవీద్వచః"
జరావళీ చ మాం తాత
పలితాని చ పర్యగుః
కావ్య స్యోశనస శ్శాపా
న్న చ తృప్తోఽస్మి యౌవనే"

(ఆది—84—1,2)

కావున పై కందపద్యములోనున్న వదలె యను పదమునకు ఇచ్చట సందర్భము కుదురుటలేదు. అందుచే 'వదలె' అనుటకు బదులుగా 'వడలె' అనిగాని, 'సడలె' అని గాని, 'వదిలె' అనిగాని యుండియుండవలెను.

వడలుట=వాడుట, మ్లానమగుట
సడలుట=బిగుతు తప్పుట
వదులుట=వదులగుట, బిగుతు తప్పుట (దీనికి భూతకాలరూపము 'వదిలె' అని యగును.)

## 3. తం సు ధీ రు డు

అతనికి సరస్వతినది
మతి ననురక్తయయి వాని మానుఁగ దనకుం
బతిఁ జేసికొనియె ధర్మ
స్థితి నయ్యిరువురకుఁ ద్రసుఁడు ధీరుఁడు పుట్టెన్

(ఆది, 4—4)

సరస్వతీనది మతినార మహారాజును పెండ్లియాడినది. వారిరువురకును 'తంసుడు' అను పేరుగలవాడు జన్మించినాడు. తంసుడు అనుటకు బదులుగా పరిష్కర్తలు అతని పేరును 'త్రసుడు' అని మార్చివేసినారు. సంస్కృత భారతములో పై పద్యమునకు మూలములగు శ్లోకములలో ఈ విధముగా నున్నది.

మతినార ఇతి ఖ్యాతో
రాజా పరమధార్మికః
మతినార సుతా రాజన్
చత్వారోఽమిత విక్రమాః
తంసుర్మహాన్ సతిరథో
ద్రుహ్యశ్చ ప్రతిమద్యుతిః
తేషాం తంసు ర్మహావీర్యః
పౌరవం వంశముద్వహన్'
(ఆది—94—14, 15)

కావున ఇతని పేరు తంసుడే కాని 'త్రసుఁడు' కాదు. ఈ విషయము మూలమువలన స్పష్టమగుచున్నది. పై పద్యములోని 'త్రసుఁడు ధీరుఁడు' అనుదానికి బదులుగా 'తంసుధీరుఁడు' అను పాఠాంతర మీయబడియున్నది. 'తంసు ధీరుఁడు' అనునదియే సరియైన పాఠము. కాని 'తంసుధీరుఁడు' అను ప్రయోగమును సహింపలేని వారెవరో 'త్రసుఁడు ధీరుఁడు' అను పాఠాంతరమును కల్పించినారు. ఈ తంసుధీరుఁడు అను సమాసము కూడ 'ధనంజయ ప్రవరుఁడు' వంటిదే. 'ధీరశ్చాసౌ తంసుః=తంసు ధీరః' అని నిస్సందేహముగా చెప్పుకొనవచ్చును. ఇంకనూ, ఇట్టి ప్రయోగమును మరొక దానిని చూపించుచున్నాను. శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు దయతో పరిశీలించెదరు గాక.

.......అంబుజనాభుఁడు నీవు పాండవ
ప్రవరులకెల్ల ప్రొద్దును శుభంబ
తలంతురు కాదె నెమ్మితోన్ (ఆది—8—56)

సంజ్ఞపై విశేషణము పూర్వపదముగాగాని, పర పదముగాగాని ఉండగూడదనియు, ఇట్టి ప్రయోగములుండవనియు శ్రీ అనంతకృష్ణశర్మగారి మతము. అందుచేతనే వారు "నేను సేవించిన సాహితీ రసిక పండితు లెవరుకాని, చదువుకొన్న మహాకవి రచనలేవిగాని, శ్రీరరాముడు, శూరకృష్ణుడు— ఇట్టి విశేషణ పూర్వ పద కర్మ ధారయములనే మన్నింపలేదు' అని అన్నారు. (చూడు. భారతి 1961 డిసెంబరు పుట 40). కాని, ఈ విషయమునందు గూడ వారు పొరపడినారు. ఇట్టి విశేషణ పూర్వపదకర్మధారయ సమాసమును గూడ శబ్దశాసనుడు ప్రయోగించియున్నాడు. చూడుడు.

అతులబలుల్ పరస్పరజయార్థులు పార్థివపుంగవుల్ మరుత్ప్రత మగధేశ్వరుల్ సమరశూరులు దారుణలీలఁ బోరి రూక్షిత భుజదర్ప మేర్పడఁగ సింహగజేంద్రములట్లు, వజ్రపర్వతములయట్లు, ఘోరతర వాసవవృత్రుల యట్లు నిద్దరున్
(సభా—1—206)

పై పద్యములోని వాల్గవపాదములో 'ఘోరతర' అను విశేషణము సంజ్ఞకు పూర్వపదముగానుండి కర్మధారయమునందు అతుకుకొని యుండుట గమనింపదగినది. ఇంతే కాక, 'పూర్వాపర ప్రథమ చరమ జఘన్య సమాన మధ్య మధ్యమ వీరాశ్చ' (కౌముది 2—1—58) అను పాణినీయశాసనము పై తొమ్మిది పదములకు కర్మధారయమున పూర్వపదత్వమును విధించుచున్నది......'దర్పక వీరుడు' అనుటకంటె 'వీర దర్పకుడు' అనుటయే ఎక్కువగా లోకసిద్ధమయిన రూపమని భాషా నిష్ణాతులందరును భావింతురు' అని సెలవిచ్చినారు శ్రీ అనంత కృష్ణశర్మగారు. కాని కవిత్రయప్రయోగములలో 'పాండవ వీరుడు' వంటి ప్రయోగములు అధికముగా కన్పించుచున్నవి. ఉదాహరణకు:

చేర జనుదెంచి పాండవ
వీరుడు........ (విరా—1—261)

ఇట్లే 'మధ్యమ' శబ్దము పూర్వపరనిపాతత్వములు గల్గి 'మధ్యమ పాండవుడు', 'పాండవ మధ్యముడు' అను ప్రయోగములు కన్పించుచున్నవి. చూడుడు. విరాట 4—113; విరాట 4—194 మొదలైనవి.

సిద్ధాంత కౌముదియందలి పై సూత్రము ననుసరించి, జఘన్యశబ్దము కూడ సమాసమున పూర్వ పదముగా నుండవలెనని శ్రీ శర్మగారి యభిప్రాయము గదా. కానీ జఘన్య శబ్దముకూడ, మధ్యమ, వీర శబ్దములవలె, ఉత్తరపదముగా చేసి, మహాకవి నిర్మితములైన సమాసము లున్నవి.

మచ్చునకు: తిరుపతి వేంకటకవులు తమ పాండవ విజయ నాటకమున ఈ విధముగా సమాసమును ప్రయోగించిరి.

"భీముడు—"ఓరీ దురాత్మ! కౌరవజఘన్య......"
(చూ. పాం. విజయము, అష్టమాంకము)

సాహితీరసికపండితులును, మహాకవులును, భాషా నిష్ణాతులును అగు తిరుపతి వేంకటకవుల ప్రయోగము తిరుగు లేనిదికదా. వీనినిబట్టి, పాండవప్రవరులు, పాండవవరులు, పాండవ వీరులు, కౌరవ జఘన్యుడు, ఘోరతరవాసవుడు, శూర తమ కుమారుడు, ధనంజయప్రవరుడు, తంసుధీరుడు— ఇత్యాది ప్రయోగములు, సంప్రదాయ సిద్ధములు, మహాకవి ప్రయుక్తములు, వ్యాకరణ సమ్మతములు అని మనము గ్రహించవలెను. తంసుధీరుడు అను సమాసమును భట్టోజీ దీక్షితుని 'జైమిని కడారః' అను ఉదాహరణమునుబట్టి గ్రహించవలెను.

ఏది యేమైనను, ఇంద్ర, చంద్ర, ఇన, రాజ, నాథ— మొదలగు శబ్దములవలెనే, ధీర, ప్రవర, శబ్దములు కూడా నన్నయభట్టు వాడినాడు. ఇయ్యవి జాతివాచకములతోను, సంజ్ఞావాచకములతోను, సమాసములలో పరనిపాతత్వమును బొందవచ్చునని అతని మతము. దీనిని మనము అంగీకరించక పోయినందువలన, నన్నయ్యకు వచ్చెడి నష్టమునూలేదు. అతని ప్రసన్న కథా కవితార్థ యుక్తికి భంగమునూ కలుగదు. అలమతి విస్తరేణ.

## 4. కానీన

ఏను నీ చెప్పినవారి లోపల నెవ్వాఁడఁగాను
గానీన, సర్వశస్త్రాస్త్ర విద్యలఁ గడుఁ బ్రసిద్ధుండ
భూసుత బ్రహ్మతేజోధికుఁడ నిన్ను బోరిలో నోర్వ
గానున్న వీరుఁడ....... (ఆది—7—202)

పై పద్యము అర్జునుడు మత్స్యయంత్రము భేదించిన పిమ్మట కర్ణునితో ద్వంద్వయుద్ధముసేయ సమకట్టిన సందర్భము లోనిది. ఇవి అర్జునుడు కర్ణునితో పలికిన మాటలు. ఇంతవరకును బాగుగనే యున్నది. కాని, దీనిలో అర్జునుడు కర్ణుని 'కానీన' అని సంబోధించినట్లు వ్రాయబడినది. ఇది మిక్కిలి అనుచితము. కర్ణుడు కానీనుడని అప్పటి కింకను అర్జునునకు తెలియదు కదా. పోనీ, మూలమున అటువంటి సంబోధన ఏదైన గలదా యన్నచో వ్యాసమహర్షి అట్టి పొరపాటేమియు చేయుటలేదు.

తమేవం వాదినం తత్ర
ఫల్గునః ప్రత్యభాషత
నాస్మి కర్ణ ధనుర్వేదో
నాస్మి రామః ప్రతాపవాన్.
బ్రాహ్మణోస్మి యుధాం శ్రేష్ఠః
సర్వ శస్త్ర భృతాం వరః
(ఆది—190—20, 21)

ఇచ్చట మూలమునందు అర్జునుడు కర్ణుని 'కర్ణ' అని పేర్కొనినాడేకాని, 'కానీన' అని పిలుచుటలేదు. అప్పటికి అతడు కర్ణుని కర్ణునిగా నెరుగును గాని కానీనునిగా నెరుంగడు. తథాపి, పరిష్కర్తలు అతనిని కానీనునిగా నెరుగుదురుగదా! అందుచే 'కానీన' అని ముద్రింపించి అనౌచిత్యమును సంఘటించినారు. ఈ పద్యమునకు దిగువ ఒక పాఠాంతర మీవిధముగా నీయ బడియున్నది.

'గాని శస్త్రాస్త్ర విద్యలయందు గడుఁ బ్రసిద్ధుండ'— అని రెండవ పాదమునకు పాఠాంతరము చూపబడినది. ఈ పాఠాంతరము, మూలమునగల అర్థమును సరిగా చూపుచున్నది. కాని, దీనిని మనము గ్రహించుటకు వీలులేదు. ఎందుచేతననగా, ఈ పాఠాంతరమువలన మధ్యాక్కరపాదమునకు గణభంగము వాటిల్లును. అందుచే నిది అగ్రాహ్యము. సరియైన సాధు పాఠ మీ క్రింది విధముగా నుండి యుండవలెనని నా యభిప్రాయము.

'గాని సమస్త శస్త్రాస్త్రవిద్యలఁ గడుఁ బ్రసిద్ధుండ'— అని. దీనివలన మూలవైరుధ్య మేర్పడదు. అనౌచిత్యము వాటిల్లదు. గణభంగము కలుగనేరదు.

## 5. మాధవి?

"ధర్మతత్త్వజ్ఞుఁ డీ ధర్మతనూజుండు
ధర్మమార్గం బెల తప్పఁ బలుకు
దేవతామూర్తి యీదేవి మాధవి యేం
తా నెరుంగక యనృతంబు పలుకు (ఆది—7—256)

పై మాటలు వ్యాసుఁడు, ద్రుపదునితో చెప్పినవి. 'ద్రౌపదిని పాండవుల కైదుగురకును ఇచ్చి పెండ్లిసేయుము. ఇది అధర్మముకాదు. ధర్మ తత్త్వజ్ఞుడైన ధర్మరాజు ధర్మ విరుద్ధములైన మాటల నాడడు. దేవతామూర్తియైన యీ కుంతి అసత్యమాడదు'—అని దీని తాత్పర్యము. ఇచ్చట 'కుంతి' యను అర్థము వచ్చుటకు 'మాధవి' అను పదము వాడబడినది. మాధవి అనగా 'బండి గురివెంద పువ్వు, లక్ష్మి, కుంటెన కత్తె'—ఇత్యాది అర్థము లను నిఘంటువు లిచ్చుచున్నవి. (చూడు. శబ్దరత్నా). కాని ఆ అర్థము లేవియు నిచ్చట పొసగవు. అయినచో మరి యీ 'మాధవి' ఎట్లువచ్చినది. ఆలోచించినచో ఇక్కడ 'మాధవి' లేఖకప్రమాదవరసంభూతయని తోచుచున్నది. అసలు పాఠము 'యాదవి' అని యుండవలెను. యాదవి — యదువంశమున బుట్టినది—కుంతి. నన్నపార్యు డీ 'యాదవి' పదమును ఇతరత్ర ప్రయోగించియున్నాడు.

యాదవుల నాదరింపక
యాదవిఁ దోడ్కొని కిరీటి యరిగెను......
(ఆది—8—204)

కనుక 'యాదవి' అను పాఠమే సమంజసమైనది.

## 6. బహిర్గిరోపగిరులు

అతుల చతురంగ సేనా
యుతుఁ డంతర్గిరి బహిర్గిరోపగిరుల భూ
పతుల నని నోర్చి కౌర్యో
న్నతిఁ గొనియెను వారిచేత నానా ధనముల్
(సభా—1—235)

ఇది అర్జునుడు ఉత్తరదిగ్విజయము చేయు ఘట్టములోనిది. అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరి అను ప్రదేశములను అర్జునుడు జయించినాడు.

"అంతర్గిరించ కౌంతేయ
స్తథైవచ బహిర్గిరిం
తథైవోపగిరిం చైవ
విజిగ్యే పురుషర్షభః"
(సభా—27—3)

ఈ శ్లోకమును అనువదించుటలో నన్నయభట్టు పై కందపద్యములోని రెండవ పాదమున అంతర్గిరి బహిర్గిరోపగిరుల' అను సమాసమును కూర్చినాడు. ఇది కుసంధి దోషము. యణాదేశసంధికి బదులుగా పొరపాటున గుణసంధి వచ్చినది. 'బహిర్గిరి+ఉపగిరులు=బహిర్గిర్యుపగిరులు'అని యుండవలెను కదా. కాని అట్లున్నచో గణభంగము కలుగును. దీనికి

పాఠాంతరమేదియు కనబడుటలేదు. పండితప్రవరులు దీని గురించి ఆలోచించెదరు గాక.

## 7. భ స్మ త తు ల

అతుల శౌర్యుఁడనిల తనయుఁ డమిత వాహినీ పదా
హతి ధరిత్రి దరర నిట్లు లరిగి పూర్వ దిఙ్మహీ
పతుల చేత రత్నరజిత భస్మ తతుల‌ఁ గొనియె భూ
మితయుకుండు వేఱు వేఱ నూరు కోట్ల సంఖ్యలన్
(సభా—1—245)

ఇది భీముని పూర్వదిగ్విజయ యాత్రా ఘట్టమునందలి వృత్తము. ఈ ఉత్సాహవృత్తములోని మూడవ పాదమున 'భస్మతతులఁ గొనియె' అని 1959 సం. ముద్రిత ప్రతులలో మన్నది. 1927 సం. ముద్రిత ప్రతులలో 'భర్మతతుల గొనియె' అని యున్నది. 'భర్మ' అనునదియే సాధు పాఠము. కంపోజిటరుయొక్క పొరపాటువలన 'భర్మము' 'భస్మ'మై పోయినది. ఇట్టి తప్పులను సమర్థించువారును లేకపోలేదు. ఒక పౌరాణిక పండితుడు 'భస్మ' మనునదియే సరియైన పాఠమని వాదించుటకు పూనుకొనినాడు. 'భస్మ' అనగా భూతి (భూతి ర్భసిత భస్మనీ—ఇత్య మరః) యుట. భూతి యనగా నైశ్వర్యమట. (విభూతి ర్భూతి రైశ్వర్యం—ఇత్యమరః). ఐశ్వర్యమనగా సంపద యుట. భీముఁడు రాజుల నోడించి సంపదలు పడసెను కావున 'భస్మతతుల గొనియె' అని యున్నను ఫరవాలేదట. ఏమి పాండిత్య ప్రకర్ష! ఎంతటి ప్రతిభావ్యుత్పత్తులు!! నేనిదివఱకు భారత మునుగులించి విన్న దంతయును ఒక ఎత్తు. ఈ వ్యాఖ్యానమొక్కటియును ఒక ఎత్తు.

## 8. భూరిబలునిపుత్త్రు

"జలజనాభునగతు జంభకుం డనువాని
భూరిబలునిపుత్త్రుఁ బోరిలోన
వాడిచి వానిచేత నుత్తమ గజహయ
రత్నతతులుగొని పరాక్రమమున
(సభా—1—247)

పై యాటవెలది రెండవ పాదమునందున్న 'భూరి' బలునిపుత్త్రుఁ అనుదానికి బదులుగా 'భూరిబలునుమిత్రు' 'భూరిబలసమేతు' అని రెండు పాఠాంతరము లీయబడి యున్నవి. ఈ రెండును సరియైనవికావు. సంస్కృత భారతమున

తత శ్చర్మణ్వతీ కూలే
జంభక స్యాత్మజం నృపం
దదర్శ వాసుదేవేన
శేషితం పూర్వవైరిణా' (సభా—31—7)

అని యున్నది. జంభకుడనువాని కుమారుని సహదేవుడు ఓడించెను. కనుక 'భూరిబలునిపుత్త్రు' అనునదియే సరియగు పాఠము.

## 9. మెలఁతగా దీనియందు నిర్మించెనొక్కొ

అఖిల లావణ్య పుంజంబు నబ్జభవుఁడు
మెలతగా దీనియందు నిర్మించె నొక్కొ
కాని నాడిట్టికాంతి యే కాంతలందు
నేంలేదని సామర్ష హృదయులైరి.
(సభా—2—160)

ఇది ద్రౌపది సౌందర్యమున కచ్చెరువంది, ధృతరాష్ట్రుని కొడుంద్రు ఈర్ష్యాసమేతులైన సందర్భములోనిది. ఇచ్చట రెండవపాదమున 'మెలతగా దీనియందు' అనుటకు బదులుగా, 'మెలతగా ధాత్రి దీని' అను పాఠాంతరము కన్పించుచున్నది. "లావణ్య సముదాయమునంతనూ, మెలతగాజేసి అబ్జభవుడు దీనిని నిర్మించె నొక్కొ?" అని తెల్పుట కవి యుద్దేశ్యమై యుండును. అంతేకాని, లావణ్య సముదాయము దీని యందు నిర్మించె నొక్కొ? అని చెప్పుటలో యుక్తిగాని, అలంకార రమణీయతగాని గోచరించవు. కావున మెలతగా ధాత్రి దీని నిర్మించెనొక్కొ' అను పాఠాంతరమే కవి ప్రయుక్తమైన అసలు పాఠమై యుండును.

## 10. న లే శు

"భామ విదర్భకేగి తన బంధు జనంబులవద్ద నుండియుం
గోమలి దేహసౌఖ్యములకున్ వెలియై మలినార్ద్ర వస్త్రముల్
భూమి రజంబు నంగమున బొల్పగుచుండగనుండె జీవిత
స్వామి నిషేశు జూచు దివసంబుల గోరుచు సువ్రతంబుతోన్
(అర—2—153)

దమయంతి బాహుని పురమునుండి విదర్భకు (పుట్టినింటికి) చేరినది. బంధువులవద్దనుండియు, శరీర సౌఖ్యములపేక్షింపక, మలిన వస్త్రముమ ధరించి, జీవితస్వామియైన నలచక్రవర్తి రాకను కోరుచున్నది. ఈ పద్యమున నాల్గవ పాదమ్మునందలి 'నిషేశు' అనుదానికి 'నలేశు' అను పాఠాంతర మీయబడినది. ఈ రెండింటిలో నేది సాధుతర పాఠమో నిర్ణయించవలసియున్నది. మూలమునందు ఈ పద్యార్థమును సూచించు శ్లోకము లేవియునులేవు. కనుక సందర్భశుద్ధినిబట్టి సరియైన పాఠమును నిర్ణయించవలసియున్నది. 'జీవితస్వామియైన నిషేశుడు' అని యున్నచో పునరుక్తి దోషము కలుగుచున్నదని నా యభిప్రాయము. కనుక 'జీవితస్వామి నలేశు' (=జీవితస్వామియైన నలరాజు) అనునదియే అసలు పాఠమని గ్రహింపనగును.

## 11. నల్లనై తోతెంచు నల్లగృహము

నీలజీమూతంబు లీల నాక్షేపించి
నల్లనై తోతెంచు నల్లగృహము
గల హిడింబుండను బలితంపు
రక్కసు చెలియలు... (ఆది—6—214)

పై సీస పద్యములోని 'అల్లగృహము' అనుదానికి బదులుగా 'అట్టి తనువు' అను పాఠాంతరమును శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు సూచించినారు. (చూడు. భారతి ఆగస్టు 1961). దానిపై 'అల్లగృహము' అను పాఠమే సరియైనదని నేను నిర్ణయించినాను. (చూడు భారతి. అక్టోబరు 1961). ఆ సందర్భమున అఖండయతిని గురించిన ప్రస్తావము వచ్చినది. దానిలో భారతమునం దీయబడిన అఖండయతులను కొన్నింటిని నేను చూపించినాను. శ్రీ శాస్త్రిగారు నా నిర్ణయించిన పాఠమును విశాల హృదయముతో నంగీకరించిరి కాని, అఖండ యతిని గురించి మరికొంత చర్చించిరి. (చూడు భారతి. 1962 జనవరి). నా వ్యాసమునందు కొన్ని దోషము లున్నవనుకొని వారిట్లు వ్రాసినారు.

1. నేను అఖండయతికి ఉదాహరణములుగా నిచ్చిన ఏడు ప్రయోగములును అప్పకవీయములో ఉదాహృతములై యున్నవేయనియు, వాటినే నేను మరల ఎత్తిచూపితిని కాని అవి నేను స్వయముగా భారతమును పరిశీలించి తీసి చూపించినవి కావనియు, శ్రీ శాస్త్రిగారు అనుమానించినారు. అప్పకవీయము నా దగ్గర లేనేలేదు. గతించిన యిరువది సంవత్సరములలో నేను ఆ గ్రంథమును జూచియుండలేదు. నేను ప్రస్తుతము నివసించుచున్న కుగ్రామమునకు పదునైదు మైళ్ల వ్యాసార్థములోగల ప్రదేశములయం దెచ్చటనూ ఆ గ్రంథము లభించుటలేదు. ఇటీవల నేను వావిళ్లవారివద్దనుండియు, వేంకట్రామాఅండుకో వారివద్దనుండియు తెప్పించిన క్యాటలాగులు, అప్పకవీయము అచ్చులో నున్నదని ఘోషించుచున్నవి. నేను చూపించిన ఉదాహరణములు ఆ గ్రంథమునుండియే నేను గ్రహించియుండినచో, ఆ విషయమును తప్పక నా వ్యాసములో మనవి చేసియే యుండెడివాడను.

2. "ఉరక, ఎఱిగి, తఱి—అను పదములలో ఉ, ఎ, త అను వర్ణములను అఖండయతులుగా సూచించుటను బట్టియును, వారికి (అనగా నాకు) అఖండయతి తత్త్వము అపరిచితమని నాకు (అనగా శ్రీ పిచ్చయ్యశాస్త్రి గారికి) తోచినది." అన్నారు శ్రీ శాస్త్రిగారు. అఖండయతి తత్త్వము నాకు సుపరిచితము. అఖండయతి యనగానేమియో తెలియకుండగనే నే నీ రంగస్థలమున ప్రవేశించుటలేదని శ్రీ శాస్త్రిగారికి నా మనవి. నా వ్యాసములోని ఉరక, ఎఱిగి, తఱి, అను పదములలో ఉ, ఎ, త అను వర్ణముల క్రింద గీటులు నేను గీచుటలేదు. అవి కంపోజిటరు చేసిన పొరపాటులు. వలసినచో శ్రీ శాస్త్రిగారు, నేను చెప్పిన వ్యాసముయొక్క వ్రాతప్రతిని తెప్పించి పరిశీలించి సత్యాసత్యములను తెలుసుకొనవచ్చును.

3. "కొని నాగపురమున కొనరంగ జని రమ్య' అను సీస పద్యపాదార్థమును అఖండయతికి ఉదాహరణగా శ్రీ శాస్త్రిగారు చూపినారు. ఈ సీసములోని తక్కిన పాదములలోని యతి నియమము ఎట్లున్నను, ఈ పాదార్థమునందు ప్రాసయతి కన్పట్టుచున్నది. కావున దీనిని అఖండయతిప్రతిపక్షులు అంగీకరించకపోవుటకు అవకాశము గలదని శ్రీ శాస్త్రిగారు గ్రహింతురు గాక.

4. "దా, నము లొనరింతు రని వాపు నా దురితములన్ ఇది అఖండయతికి ఉదాహరణముగా జూపి శ్రీ శాస్త్రిగారు వాపున్+అదురితములన్ అని సంధిని విడదీసినారు. పై విధముగా సంధిని విడదీయుట పొరపాటని సవినయముగా మనవి చేయుచున్నాను. ఎందుచేతనవగా, ఈ పద్యమున శుకుడు వ్యాసుని సందేహపూర్వకముగా ప్రశ్నించినాడు. అని వాపునా?+దురితములన్, అట్టి దానములు పాపములను పోగొట్టునా? అని శుకుని సందేహము. ఈ సంగతి, ఈ పద్యమునకు వెనువెంటనేఉన్న సీస పద్యమును సూచినచో తెలియగలదు.

సీ. అనుటయు నందియు మదియేల కపిలఁ బా
జించిన ప్రీతి నిచ్చినను జెడని
యఘములు గల్గనే........ (అను—3—101)

అని వ్యాసమహర్షి శుకునికి సందేహనివృత్తి చేసినాడు. కనుక వాపున్+అదురితములన్ అని విడదీయుట పొసగదు. వాపునా?+దురితములన్ అని గ్రహింపవలెనని శ్రీ శాస్త్రిగారికి మనవి చేయుచున్నాను. శ్రీ శాస్త్రిగారు తమ పొరపాటును దిద్దుకొందురని నమ్ముచున్నాను. ఏది యేమైననూ, నేను చూపించిన ప్రయోగాలన్నియును నేను స్వయముగా పరిశీలించి చూపినవి కావని శ్రీ శాస్త్రిగారు నా పై నొక అభాండమును వైచినారు కావున వారి సంతృప్తికొరకై మరికొన్ని అఖండయతి ప్రయోగములను భారతమునుండి చూపించి యీ వ్యాసము ముగింతును.

1. శ్రీ యువఁగౌరి నాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి
(విరా 1—1)

1. ........నీకు జ
న్నై నలి వాక్కులందు మది నిల్పగ
(ఆది—8—179)

3. దీని నెట్లులు గ్రమ్మరింతు మదీయ భాషితమెన్నడు
న్నైని మోఘముగాదు దిగ్ధరణీ రవీంద్రులెఱుంగగాన్
(ఆది—7—142)

సాహితీ సేవనే లక్ష్యముగా నుంచుకొని, ఆంధ్ర మహాభారతములో కొన్ని పాఠాంతరములయొక్క సాధుత్వాసాధుత్వ నిర్ణయమును చేసి, భారతీ పాఠకుల ముందుంచినాను. పండితులెల్లరూ ఇందలి గుణదోషములను విచారించి నాకు తెలియజేయగలరని ఆశించుచున్నాను. స్వస్త్యస్తు.

# గాలిగోపురం

శ్రీ అంగర సూర్యారావు

(గత సంచిక తరువాయి)

## రెండవ అంకం :

(స్థలం—లచ్చన్న యింటివెనుకభాగం. సమయం: రాత్రి 8 గంటలు)

కుడివైపు యింటి ప్రహారీగోడ కనిపిస్తూవుంది. ముందు పూల మొక్కలు, వెనకవైపు దట్టమైన లతలు వున్నాయి. మధ్య ఒక రాతితిన్నె వుంది. కుడివైపు పెరటి ద్వారం వుంది. ఎడమవైపు లచ్చన్నగారి యింట్లోకి ఒక దారి—పూలమొక్కల వెనకనుంచి మరొకదారి కనిపిస్తూ వుంటాయి. రాక పోకలన్నీ ఎడమవైపుమంచే జరుగుతూ వుంటాయి. పూల మొక్కలకు పైని నీలాకాశం కనిపిస్తోంది. గౌరి యింటిలోంచి వస్తుంది. రాతిబండమీద కూర్చుంటుంది—ఎడమవైపునుంచి కొండయ్య ప్రవేశిస్తాడు.

కొండయ్య:—(వస్తూనే) అవతల కొంపలు మునిగిపోతుంటే నువ్విక్కడే స్థిమితంగా కూర్చున్నావా?

గౌరి:—(ఆత్రుతతో లేచి) ఏం? ఏమయ్యింది?

కొండ:—యేమయ్యిందని మెల్లిగా అడుగుతున్నావా? యిక్కడ నేనుండగా పరాయి పెళ్లికొడుకుని తీసుకొచ్చి యింట్లో కూర్చోబెడతాడా మీ నాన్న?

గౌరి:—(తేలిగ్గా) ఓ! అంతేనా! (తిరిగి కూర్చుంటుంది)

కొండ:—ఆ కొత్త పెళ్ళికొడుకుని చూశావా? గుర్రపుజాలు లాగ జాతూ వాడూను.

గౌరి:—నేను చూడలేదు.

కొండ:—అరె! నువ్వు చూళ్లేదూ?—అదిగో! ఆ మామిడి చెట్టుకింద కొండముచ్చులా గెంతుతున్నాడు. యిలాగ రా చూపిస్తాను.

గౌరి:—నేను చూణ్ను.

కొండ:—పోనీలే! చూడకపోతే యింకా మంచిది. నువ్వు మీ నాన్నతో కచ్చితంగా చెప్పెయ్యాలి.

గౌరి:—ఏమిటది?

కొండ:—యీ పెళ్ళి నీకు యిష్టంలేదని చెప్పెయ్, చాలు!

గౌరి:—నేను చెప్పను.

కొండ:—(ఆశ్చర్యంతో) యేమిటేమిటి? నువ్వు కూడా ఆ సంబంధంమీద మోజుపడుతున్నావా? నీకు ఆ పెళ్ళికొడుకు నచ్చాడా? సర్కస్ కంపెనీలో మొగ్గలేసేవాడిలాగ వేష వాడూను.

గౌరి:—నువ్వు నోటికివచ్చినట్టు మాట్లాడకు. నాకు పెళ్ళి యిష్టంలేదు.

కొండ:—(సంతోషంతో) అద్గదీ! నువ్వామాటమీద నిలబడు. మీ బాబు నీ కీ పెళ్ళి ఎలాగచేస్తాడో నే న్చూస్తాను— మామ ఆడించిన ఆటల్లా నేను ఆడాను. అడ్డమైన గాడిద కొడుకునీ, బుర్రబద్దలు కొట్టాను. ఎందు కోసం? మీ బాబుకోసమేనా? దాని బాకీలన్నీ చావతన్ని వసూలు చేశాను—యింత సాయంచేస్తే నన్ను కుక్కలా తీసి పారేస్తాడా? మీ అమ్మే బతికుంటే యిలా జరగ నిచ్చేదా?

గౌరి:—(చిరాగ్గా) అబ్బబ్బా! యిక్కడ కాస్సేపు హాయిగా కూర్చుందామని నే నొస్తే—దెయ్యంలా వచ్చి పట్టుకున్నావేమిటి?

కొండ:—ను వ్వేమన్నా నాకేం పట్టింపులేదు. యీ దెబ్బతో యిది అటో యిటో తేలిపోవాలి. మీ నాన్నకి అసలే మొండి పట్టుదల. యీ పెళ్ళి బలవంతంగా చేసేస్తాడు. నీ కా పెళ్ళికొడుకంటే యిష్టంలేదు కదా?

గౌరి:—నన్ను విసిగించకు. నాకు యిష్టంలేని మాట నిజం. అయినా నేనేం చెయ్యగల్ను. ఎలా జరిగేది అలా జరుగుతుంది.

కొండ:—అబ్బెబ్బే! నువ్వలాగంటే యేం లాభంలేదు—చిన్న ఉపాయం చెప్తాను. విను.

గౌరి:—ఏమిటది?

కొండ:—నువ్వు 'ఊం' అను! చాలు! నిన్ను నిమషంలో అంచెల మీద ముందు యిల్లు దాటించి—తరవాత వూరు దాటించేస్తాను. ఊం. లే!

గౌరి:—(కోపంతోలేచి) నోర్మూయ్! ముందు పో యిక్కణ్నుంచి! యేం? యింకా చూస్తావేం? పోతావా? మా నాన్నను పిలవనా?

(ఎడమచివర రత్తయ్య కనిపిస్తాడు.)

కొండ:—(ఆత్రుతతో) వద్దొద్దు. నేను వెళ్ళిపోతాన్లే. ఒక్క మాటకి జవాబు చెప్పు. నన్ను పెళ్ళి చేసుకోవడం నీకు యిష్టంలేదా?

గౌరి:—నిన్నా? నిన్ను పెళ్ళిచేసుకునేకంటే కొండమీది కోతిని పెళ్ళిచేసుకోవడం నయం! (కోపంతో బిర బిరా—రత్తయ్యను తప్పుకొని వెళ్ళిపోతుంది—రత్తయ్య బిగ్గరగా నవ్వుతూ ఆకస్మికంగా ముందుకు వస్తాడు.)

రత్తయ్య:—(నవ్వుతూనే) బలే! బలే! బలే మాట! 'కొండయ్యని పెళ్ళి చేసుకునేకంటే కొండమీద కోతిని పెళ్ళిచేసుకుంటే నయం! బలే! అచ్చర లచ్చలు!

కొండ:—(అమాంతంగా రత్తయ్య వీపుమీద ఒకటి చరచి) నోర్మూయ్. (జేబులోంచి డబ్బులు తీసి) యీ మాట యెవరితోనూ చెప్పకు. (అర్ధరూపాయ యిచ్చి) యేమైనా కొనుక్కో! (ఎడమవైపు నడుస్తాడు.)

రత్త:—(వీపు తడుముకుంటూ, సంతోషంతో) బలే! అచ్చర లచ్చలు రాకపోయినా అర్థ రూపాయి డబ్బులు కిట్టేయి.

కొండ:—(వెనక్కి వచ్చి) నువ్వు యెందు కొచ్చావ్‌రా యిక్కడికి?

రత్త:—ఆ చామకందరంబాబు లేడూ! పట్నం నుంచొచ్చేడూ....

కొండ:—నువ్వు పెళ్ళికొడుకుకోసం వచ్చావా? లేకపోతే పెళ్ళికొడుకు యెనకాల మరొక డొచ్చేడు—చేట పెయ్యలా ముఖం వాడూనూ........

రత్త:—అద్గదీ! చామకందరంబాబంటే అతనే!

కొండ:—యేడిశావు కానీ! నువ్వు తక్షణం యిక్కడినుంచి పైకి పో. నేను తిరిగొచ్చేసరికి నువ్విక్కడున్నావో—నీ వీపుచర్మం వొలిచేస్తాను.

(కొండయ్య చరచరా ఎడమవైపు నిష్క్రమిస్తాడు—పూల మొక్కల వెనకనుంచి ముందు రఘుపతి—అతని వెనక పాటపాడుతూ శ్యామసుందరం ప్రవేశిస్తారు)

శ్యామసుందరం:— నిలూ నిలూ! నిలువు బండి
నిలవర బండోడా!
నిలూ నిలూ! నిలవుబండి!
ఆ వూరి కుర్రోడు
ఈవూరు వచ్చాడు
అద్దాల మేడచూసి
అర్దికున్నాడో
నిలూ నిలూ! నిలువు బండి.

రత్తయ్య:—(ముందుకు వచ్చి) అదీ కూడా ఒక పాటేనేంటి? దాని తాతలాంటి పాట పాడతాను.
బాడవలో పడ్డాదీ
బార కొమ్ములగేది
యీ గేది నా కొద్దూ
యిది యెంతో మొద్దో!
దిగూ! దిగూ! దిగురాబా!
ఎహె హే, (నవ్వుతూ) యిప్పుడేమంటావ్?

శ్యామ:—అయితే పందెం కలుపు. మన యిద్దరిలో ఎవరు బాగా పాడతారో పందెం.

రత్త:—(ఉత్సాహంతో) ఓ! అవల్‌రైట్! పందెం!

శ్యామ:—ఒరేయ్! రఘూ! యీ పాటల పోటీకి నువ్వు జడ్జీగా వుండరా!

రత్త:—అయితే వుండు. నా తరుపుని పుల్లయ్యగాణ్ణి జడిజీగా తెచ్చుకుంటాను. (ఎడమవైపు వెళ్ళబోతాడు)

శ్యామ:—(రత్తయ్యని ఆపుచేసి) ఆగవోయ్! ఆగు! యిద్దరికీ ఒక్కడే జడ్జి వుండాలి.

రత్త:—అయితే నేను తయార్! ముందు నీ పాట వదులు!

శ్యామ:—ముందు నువ్వే పాడు.

రత్త:—ముందు నువ్వే పాడాలి.

శ్యామ:—ఉహూ! ముందు నువ్వే!

రత్త:—అయితే ఒక పని చేద్దాం. (జేబులోంచి అర్ధరూపాయ తీసి) యిది పైకి ఎగరేస్తాను. బొమ్మయితే నువ్వు. బొరుసయితే నేను!

శ్యామ:—బొమ్మనాకొద్దు. బొరుసేకావాలి.

రత్త:—అయితే కాసుకో!

రఘుపతి:—(చిరాకుతో యిద్దరి మధ్యకూవచ్చి) ఒరేయ్! శ్యాం! రామాయణంలో పిడకల వేటలా మధ్యని యిదేమిటిరా? మనం యిక్కడికి యెందుకు వచ్చాం? నువ్వు చేస్తున్న పనేమిటి?

శ్యామ:—మనం వచ్చిన పని అయిపోయిందిగా! కాస్త యీ పల్లెటూరి సొగసు చూడనియ్!

రఘు:—ఎక్కడయ్యింది? ముఖ్యమైన పని కాస్త అలాగే వుండిపోయింది.

శ్యామ:—యిప్పుడేం చెయ్యాలి?

రఘు:—పెళ్ళికూతురికి మన సంబంధం యిష్టమా? కాదా?—అన్న విషయం తేల్చుకోవాలి.

శ్యామ:—తండ్రి ఎలాగూ యిష్టపడ్డాడు. కూతురు కూడా చచ్చినట్టు యిష్టపడుతుంది.

రఘు:—ఆపిల్ల ఉద్దేశం తెలుసుకోకుండా యీ పెళ్ళికి నేను ఎంతమాత్రం ఒప్పుకోను.

శ్యామ:—మంచి చిక్కు తెచ్చిపెట్టేవే?

రఘు:—ఉపాయం ఆలోచించు.

శ్యామ:—(ఆలోచిస్తూ రత్తయ్యకేసి తిరిగి) నీ పేరేమిటోయ్?

రత్త:—(నవ్వుతూ) ఎహెహె! నాపేరే తెల్దా మీకు?— యే దూళ్ళుకాసే కుర్రోణ్ణడిగినా సెనాలమీద సెప్పేస్తాడు. రత్తయ్యంటే వూరు మొత్తంమీద పేరు!!

శ్యామ:—అంత పేరు నీ కెలాగ వచ్చింది?

రఘు:—(కలగచేసుకుంటూ—చిరాకుతో) ఎలా వస్తే మన కెందుకు? ముందు మనపనేదో చూడరా బాబూ!

శ్యామ:—మనం ఒక మనిషికి ఒక పని అప్పగించబోయేముందు అతని శక్తి సామర్థ్యాలు తెలుసుకోవాలంటావా? అక్కర్లేదా?

రఘు:—(నిస్పృహతో) అయితే నీకు తోచినట్టే తగులడు.

రత్త:—నాకు పేరెలాగ వచ్చిందో తెలిసిందా?—బిరిగీసి—బిరినిండా గోళీకాయలు పెట్టి— పది బారలదూరం నుంచి బచ్చా పెట్టకుండా కొట్టేస్తాను—సరి బేసి వుందా? సరిబేసి! నేను సరి అంటే సరే! బేసి అంటే బేసే! యెదటి మనిషి గోళీకాయలన్నీ మన జేబులోకి రావలసిందే! ఎహె హే! (సగర్వంగా నవ్వుతాడు.)

శ్యామ:—బలే! బలే!—యింకేం వచ్చును?

రత్త:—బొంగరాల ఆటుందా? బొంగరాలాట!—బొంగరానికి జాలీను సుట్టేసి యేసి కొట్టేనంటే—యెదటి మనిషి బొంగరానికి పెచ్చులకి పెచ్చులు లేచిపోయా యనుకో!

శ్యామ:—అచ్ఛా! అచ్చా!

రత్త:—చెడుగుడుందా? చెడుగుడు! 'బల్......చెడుగుడు....'అని కూత మొదలెట్టి బరిదాటేనంటే—ఒక్కొక్కళ్ణీ—యీపు సాపుసేసే నన్నుమాటే! దున్నపోతుల్లాంటి మనుషులు పదిమంది మీదపడి నొక్కేసినా, గుక్క తిప్పకుండా ఒకటే కూత— బరి అందుకోవాలి. నేను కూత మావాలి!

శ్యామ:—బలే మోతగా వుందే నీ యువ్వారం?

రఘు:—(కోపంతో) నువ్వు యిక్కడ కులాసాగా కబుర్లు చెపుతూ కూర్చో. నేను పోయి నిద్రపోతాను.

శ్యామ:—(ఆపుచేసి) ఆగు! ఆగు! ఈ వ్యవహారం తేల్చనీయ్. పెళ్ళికూతురు అభిప్రాయం తెలుసుకోవాలని కాదూ నువ్వంటున్నావ్?

రఘు:—(అసహనంతో బిగ్గరగా) అదే యిప్పుడు తేల్చుకోవాలి.

శ్యామ:—ఆమెకు యీ పెళ్ళి యిష్టమా? కాదా?—అని.

రఘు:—అంతే! అంతే!

శ్యామ:—దీనికి ఇంత ఆలోచించడం యెందుకు? ఒక పని చేస్తే సరిపోతుందిగా!

రఘు:—ఏమిటది?

శ్యామ:—లచ్చన్నగారినే పిలిచి, 'మీ అమ్మాయికి యిష్టమా? కాదా?' అని నిలదీసి అడిగితే?

రఘు:—అబద్ధం చెబితే నువ్వేం చేస్తావ్?

శ్యామ:—అవును. చిక్కే! (ఆలోచించి) సరయిన ఆలోచన తోచకుండా వుంది—మన పురాణాలలోను, ఇతిహాసాల లోను యిలాంటి యిబ్బంది ఎక్కడైనా వచ్చిందా? వస్తే వాళ్ళేం చేశారు?—అని ఆలోచిస్తే ఒక ఉపాయం దొరుకుతోంది—వెనక నలమహారాజు యేంచేశాడు? తను ప్రేమించిన దమయంతి దగ్గరకి రాజహంసను రాయబారానికి పంపాడు. మనం కూడా అదే పని చెయ్యాలి.

రఘు:—మనకి రాజహంస యెక్కడేడ్చిందోయ్?

శ్యామ:—రాజహంస లేకపోయినా రత్తయ్య వున్నాడుగా యిక్కడ! (రత్తయ్యకేసి తిరిగి) ఏమోయ్ రత్తయ్యా! నువ్వు మాకో సహాయంచెయ్యాలి.

రత్త:—ఓ! సెణాలమీద సేసేస్తాను. సెప్పండి.

శ్యామ:—నువ్వు లచ్చన్నగారి అమ్మాయి దగ్గరికి రాయబారానికి వెళ్ళాలి.

రత్త:—అంటే?

శ్యామ:—అంటే—మావాడి గుణ గణాలన్నీ ఆవిడ దగ్గర వర్ణించాలి.

రత్త:—మీ రన్న మాటల్లో ఒక ముక్క కూడా నాకు తెలలేదు.

శ్యామ:—నీకు తెలిసేభాషలో చెబుతాను. విను. నువ్వు పెళ్ళి కూతురు దగ్గరికి వెళ్ళాలి.

రత్త:—యెళ్ళి?

శ్యామ:—'నీకు పెళ్ళికొడుకు అంటే యిష్టమేనా?' అని అడిగాలి.

రత్త:—పాత పెళ్ళికొడుకా? కొత్త పెళ్ళికొడుకా?—అదేదో యివరంగా సెప్పండి.

రఘు:—పాతపెళ్ళికొడు కెవరోయ్?

రత్త:—యింకెవరు? కొండయ్యే!

శ్యామ:—అతనిజోలి మనకెందుకు? మన వ్యవహారం చూడు.

రత్త:—'కొత్త పెళ్ళికొడుకంటే నీ కిష్టమేనా?' అని నిల దీసి అడిగేస్తాను.

శ్యామ:—(భుజం తట్టి) అద్గదీ! హుషారుగా వెళ్ళిరా!

రత్త:—(చురుగ్గా ముందుకు నడిచి—భయంతో అమాంతంగా వెనక్కి వచ్చి) అళ్ళు నన్ను పట్టుకుని తన్నితే?

శ్యామ:—నిన్ను తన్నితే మమ్మల్ని తన్నినట్టే లెక్క! రాయబారి జోలికి ఎవరూ వెళ్ళకూడదనేది అంతర్జాతీయ సంప్రదాయం! అంచేత నీకేం భయంలేదు. వెళ్ళిరా!

రత్త:—యేమండోయ్ అబ్బాయిగారు! మీ మాట నమ్మేసి యెళతన్నాను. మరే మౌతాదో.

(రత్తయ్య ఎడమవైపు వెళ్ళిపోతాడు.)

శ్యామ:—(ముందుకు నడుస్తూ) మన రాయబారి తిరిగి వచ్చే వరకూ మనం యీ ఉద్యానవనంలో......

రఘు:—(మధ్యలో అందుకొని) కూర్చుందాం. యింకేం చేస్తాం? (రాతితిన్నెమీద కూర్చుంటాడు.)

శ్యామ:—నువ్వు కూర్చో! నేను కాస్త వన విహారం చేసి వస్తాను.

రఘు:—రత్తయ్య ఏం వార్త తెస్తాడో! అతను వచ్చేవరకూ యేమైనాసరే నే నిక్కడినుంచి కదల్ను!

లచ్చన్న:—(నేపథ్యంలో బిగ్గరగా) ఎందుకు రాడో నే న్చూస్తాను! యీడ్చుకురండి......

(రఘుపతి, శ్యాం భయంతో ఎడమవైపు చూస్తూ వుంటారు. ఎడమవైపునుంచి ముందు లచ్చన్న, పద్యాల పుస్తకం పట్టుకొని బసవయ్యా, అతని వెనక కర్రపట్టుకొని పుల్లయ్యా, మారుతి కనిపిస్తారు. అతనిని ఎవరూ గమనించరు—నెమ్మదిగా గోడదిగి మొక్కల వెనక్కి వెళ్ళి దాక్కుంటాడు.)

లచ్చన్న:—(తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ) యింట్లోంచి యివతలికి రావడం లేదట! (పుల్లయ్యకేసి తిరిగి తీవ్ర స్వరంతో) ఎందుకు వూరుకున్నావురా నువ్వు?

పుల్ల:—అయ్యయ్యే! వూరుకోలేదండి. వాలుగు లాగించేశాను. అంతలో యీదిలో వోళ్ళంతా.....

లచ్చ:—(కోపంతో అందుకొని) అడ్డం పడ్డారా నీకు?

పుల్ల:—అవునండి.

లచ్చ:—వాళ్ళెవళ్ళో నీకు గుర్తుందా? (ముందుకుచూసి, రఘుపతిని, శ్యామసుందరాన్ని సమీపిస్తూ) మీరు యిక్కడ వున్నారా? మీకోసం యెదురు చూస్తున్నాను. మీరు ఉదయం బండికేనా వెళ్ళడం?

రఘు:—(శ్యామసుందరంతో) ఏరా శ్యాం! తెల్లవారుఝాము బండికే కదూ?

శ్యామ:—అంతే! అంతే!

లచ్చ:—తెల్లవారుఝామున పుల్లయ్య సవారీబండి కట్టుకు వస్తాడు. దానిమీద మీరు స్టేషనుకు వెళ్ళొచ్చు. మీరు లోపలికివెళ్ళి భోజనం చెయ్యండి.

రఘు:—ఒక అయిదు నిముషాలు యిక్కడ కూర్చుని......

లచ్చ:—అలాక్కాదు. మొహమాటం పడుతున్నారా!—పోనీ నాతోనే రండి. (రఘుపతిని చెయ్యి పట్టుకొని ఎడమవైపు తీసుకు వెళతాడు. వెనక పుల్లయ్యా, బసవయ్య నిష్క్రమిస్తారు. శ్యామసుందరం వాళ్ళతో కలిసి వెళ్ళి నట్టు వెళ్ళి తిరిగి వెనక్కి వస్తాడు.)

రత్తయ్య:—(నేపధ్యంలో) కొట్టకు! కొట్టకు! నేను కాదు. (చెట్ల వెనకనుంచి ప్రవేశించి శ్యామసుందరంతో) బలే మణిసివయ్యా నువ్వు! మీరూ మీరూ బాగున్నారు. మద్దిని కొండయ్యగాడితో తన్నులు నేనే తిన్నాను.

శ్యామ:—ఏమయ్యింది?

రత్త:—నేను యిలాగ యెళ్ళానో లేదో కొండయ్యగాడు యేట కుక్కలాగ వచ్చి మీదపడిపోయేడు.

శ్యామ:—అప్పుడు నువ్వేం చేశావ్?

రత్త:—నేను పొట్లగిత్తలాగ మీదపడి కుమ్మేద్దునుగానీ......

శ్యామ:—జడిసిపోయి వెనక్కొచ్చేశావు. అంతేకాదూ! కూర్చో! యిప్పుడే వస్తాను.

(శ్యామసుందరం ఎడమవైపు వెళ్ళిపోతాడు)

రత్త:—(అతను వెళుతున్న వైపుచూస్తూ) జడిసిపోతానా? పైసాలేదు కనక కొంచెం యెనకాడతన్నాను. నా జేబులోనే పైసా వుంటేనా? బస్తీమీద సవాల్! కొండయ్యని తుక్కు తుక్కు సేసేస్తాను. (చేతికర్ర మెడ మీద పెట్టుకొని— వెనక్కి నడుస్తూ) హె...హె....హె నా సంగతి తెలకండావుంది.

(పొదలలోంచి మారుతి మెల్లగా యివతల కొస్తాడు. రత్తయ్య మెడమీదవున్న కర్ర పట్టుకొని అమాంతంగా వెనక్కి లాగుతాడు.)

రత్త:—(భయంతో) బాబోయ్ (వెనక్కి పడిపోబోతాడు.)

మారుతి:—(అతని నోరు నొక్కి—నెమ్మదిగా) అరవకు—నేనే!

రత్త:—(వెనక్కి తిరిగి—సంతోషంతో) హెూరి! నువ్వా!

మారు:—ఉష్! మెల్లిగా మాట్లాడు.

రత్త:—నువ్వుంటే నాకింకేం బయ్యంరా! కొండయ్యగాణ్ణి పాతేస్తాను.

మారు:—లచ్చన్న ఎక్కడున్నాడు?

రత్త:—లోన కూచున్నాడు.

మారు:—వాడి వెనక మనుషు లున్నారా?

రత్త:—ఓ! జమాజెట్టీల్లాంటోళ్ళు పదిమందున్నారు!

మారు:—(ఆలోచిస్తూ) సరే! చూద్దాం! పగ తీర్చుకోడానికి అన్నీ మార్గాలే! (చుట్టూ చూస్తూ) యీచోటు చాలా అనుకూలంగా వుంది. యీ అందమైన వెన్నెల—చల్లని పిల్లగాలులు—నా మనసు హాయిగా తేలిపోతోంది. కొత్త ఆలోచనలు వస్తున్నాయి.

రత్త:—యీ రాత్రి నీ యిష్టం! నువ్వేంసేసినా నీకు అడ్డుండదు.

మారు:—ఏమిటి సంగతి?

రత్త:—యియ్యేళ వూళ్ళో మనుషులుండరు.

మారు:—ఎందుకని?

రత్త:—ఈరాత్రి పోటీమీద తోలుబొమ్మలాట కడతన్నారు. అందరూ అక్కడికే పోతన్నారు. నేనూ యెళతన్నాను. నువ్వు కూడా వస్తే......

మారు: ఓహెూ! అదా సంగతి! మంచిది. చూద్దాం. (ఎడమవైపు చూస్తూ) చూడూ! అటువైపేదో చప్పుడు వినిపిస్తోంది.

రత్త:—మనం యిద్దరం యిక్కడ లచ్చన్నకి కనపడ్డామో! మన పని......

(మారుతి రత్తయ్యనోరు నొక్కి మొక్కల వెనక్కి తీసుకుపోతాడు. గౌరి ప్రవేశిస్తుంది. మారుతి ఒక పువ్వు కోసి, వెనకనుంచి ఆమె మీదికి విసురుతాడు.)

గౌరి:—(క్రిందపడిన పువ్వుతీసి—వెనక్కి తిరిగి) ఎవరది?

కొండయ్య:—(అకస్మికంగా ఎడమవైపు కనిపించి) గౌరీ!

గౌరి:—(అటు తిరిగి—కోపంతో) యీ పువ్వు నువ్వేనా విసిరావు?

కొండ:—అబ్బే! నేను కాదు.

గౌరి:—నువ్వు కాకపోతే ఎవరున్నా రిక్కడ? యిక అలాంటి వెకిలివేషాలెప్పుడూ వెయ్యకు.

కొండ:—నేను విసరలేదుకాని—ఒకవేళ విసిరితే తప్పేమిటి?

గౌరి:—తప్పేమిటో చెప్పమంటావా? అయితే మా నాన్నని పిలుస్తానుండు.

కొండ:—ముందు మనిద్దరం తగువు తేల్చుకుందాం. తేలక పోయినప్పుడు మీనాన్న దగ్గరి కెళదాం. యేమంటావ్?

గౌరి:—నిన్ను నోరుమూసుకొని లోపలకు వెళ్ళమంటాను.

కొండ:—(సమీపిస్తూ) ఏం? నేను నీ కిక్కడ యేమైనా అడ్డొచ్చానా? లేకపోతే నీ కిక్కడేదైనా చిన్నపని వుందా?

గౌరి:—(కోపంతో) మర్యాదగా మాట్లాడు.

కొండ:—(హేళనగా) ఓస్! నీ మర్యాదలూ నీ యవ్వారాలూ నాకు తెలియవనుకుంటున్నావా? నువ్వు యెవళ్ళ కళ్ళు మూసినా ముయ్యగలవు కానీ—యీ కొండయ్యకళ్ళు మాత్రం ముయ్యలేవు.

గౌరి:—అసలు నీకు కళ్ళుంటేకదూ ముయ్యడానికి?

కొండ:—నాకు కళ్ళున్నాయో లేవో యిప్పుడే రుజూ చేస్తానుండు. నువ్వు రోజూ దేవుడి గుడిమీద వంకపెట్టి—యెక్కడికి వెడుతున్నావో! నువ్వు యెవడంటే పడి చస్తున్నావో! యెవడితో వయ్యారంగా మాట్లాడుతున్నావో....

గౌరి:—(మధ్యలో అందుకొని) నువ్వు ఎవరితో తన్నులు తింటున్నావో

కొండ:—(కోపంతో) నేనా తన్నులు తినడం? ఒక్కొక్కణ్ణి గుండె లీ పేస్తాను. నా సంగతి నీకు తెలకుండావుంది. కొండయ్యంటే బరిమీద పాం!

గౌరి:—నీ ప్రతాపం యిక్కడెందుకు? వూళ్లోకి వెళ్ళి యెవరి మీదైనా చూపించు. వెళ్ళు.

కొండ:—అసలు యిందులో యేదో కిటుకున్నట్లే నాకు అనుమానంగావుంది. లేకపోతే చీటికీ మాటికీ నన్నిక్కణ్ణుంచి వెళ్ళిపొమ్మని యెందుకంటావ్?—కొంపతీసి ఆ మారుతి గాణ్ణే యిక్కడికి రమ్మన్నావేమిటి?

గౌరి:—(కోపంతో) రమ్మంటే రమ్మంటాను. అది నా యిష్టం! మధ్యని నువ్వెవరవ్!

కొండ:—(హేళనగా) అబ్బో! అందాకా వచ్చింది! యిదిగో గౌరీ! నీకు ముందే చెబుతున్నాను. విను. ఆ మారుతి కనక లోపలికి వచ్చాడో చచ్చాడనుకో!

గౌరి:—అతనంటే నీ కెందుకంత కోపం? అతను రానే రాడు. వచ్చినా ఎవ్వరూ యేం చెయ్యలేరు.

కొండ:—తొందరపడకు! అలాగే చూడు! ఒక్కమాట చెబ్తాను. విను. ఆ మారుతిని మర్చిపో! వాడు యిక మామూలు మనిషి అవ్వడు. యివేళ కాకపోతే రేపైనా వాణ్ణి జనం అంతా పట్టుకొని వెర్రి కుక్కని కొట్టినట్టు కొట్టి చంపేస్తారు. ఆడికి బలవంతం చావు తప్పదు.

గౌరి:—(కోపంతో) నోర్ముయ్!

కొండ:—అబ్బో! చాలా కోపం వచ్చిందే!—రానియ్, నీ కెంత కోపంవస్తే నాకేం?— నీ మనసు మార్చుకో! వాణ్ణి మర్చిపో! పట్నం వెళ్ళికొడుకంటే నీ కిష్టంలేదని నీ ముఖమే చెబ్తోంది. వాళ్ళిద్దర్నీ తీసి పారేస్తే యిక మిగిల్నోణ్ణి నేను!

గౌరి:—(కోపంతో) నువ్వొక్కడవే మిగిలి యిక్కడే పాతుకు పోయివుండు.

(గౌరి కోపంతో చరచరా ఎడమవైపు చెట్ల వెనక నుంచి వెళ్ళిపోతుంది.)

కొండ:—గౌరీ! గౌరీ! నామాట విను! లేదా మీనాన్నతో అంతా చెప్పేస్తాను.

(ఆమె వెనక కొండయ్య నిష్క్రమిస్తాడు. మారుతి, రత్తయ్య మొక్కల వెనకనుంచి నెమ్మదిగా వస్తారు.)

రత్త:—(కొండయ్య పోయిన వైపు చూస్తూ) ఆ కొండయ్య గాణ్ణి నోరు నొక్కెయ్. నేను మోసుకుపోతాను.

మారుతి:—వాడెందుకు మనకి? (ఎడమవైపు చూపిస్తూ) అడుగో! వస్తున్నాడు చూడు! వాడూ మనకి కావలసిన వాడు.

రత్త:—(భయంతో) బాబోయ్! అచ్చన్న!—ఒరేయి బాబూ! అడి జోరి కెళ్ళకురా! మనల్ని నంపేస్తాడు.

మారు:—(నిర్లక్ష్యంగా) వాడా? మనల్నా?—(నెమ్మదిగా) నువ్వు నోరెత్తకుండా అలాగే చూస్తూ వుండు. కదలకు. మెదలకు. చప్పుడు కానివ్వకు.

(మారుతి, రత్తయ్య తిరిగి మొక్కల వెనక్కివెళ్ళి మాయమౌతారు–ఎడమవైపునుంచి ముందు అచ్చన్న, అతని వెనక ఎకౌంట్ పుస్తకం పట్టుకొని బసవయ్య, కర్ర చేతో పట్టుకొని పుల్లయ్య ప్రవేశిస్తారు.)

బసవయ్య:—(పుస్తకం చదువుతూ) వెంకట్రత్నం —పాతిక రూపాయలు, సుబ్బయ్య—యాభైఅయిదు రూపాయలు, సోములు—డబ్బై యెనిమిది రూపాయలు, రంగయ్య—నూటయాభై రూపాయలు.....

అచ్చన్న:—రంగయ్య పుచ్చుకున్న డబ్బంతా అలాగేవుందా?

బస:—పైస కూడా జమకట్టలేదు.

అచ్చ:—యేరా పుల్లయ్యా! రంగయ్యగాడి బాకీ యెందుకు వది లేశావ్?

పుల్ల:—అడికోసం నెలరోజుల్నుంచి కాళ్ళు అరిగి పోయేలాగ తిరుగుతున్నానండి. దొరకడంలేదు.

అచ్చ:—యేమైపోయాడు?

పుల్ల:—పరారీ అయిపోయేడంటున్నారండి అందరూను!

అచ్చ:—యేమిటీ? మన దగ్గర అప్పు పుచ్చుకుని వూరు వదిలి పెట్టి పారిపోతాడా? ఎంత ధైర్యం.

బస:—వాడి బతుక్కి ధైర్యం ఒకటా? పిరికివాడు కనకే పారి పోయేడు.

లచ్చు:—వూరినిండా అప్పులు చెయ్యడం. వూరు వదిలిపెట్టి పారిపోవడం—ఒక్కొక్కణ్ణీ పట్టుకొని చెట్టుకు విరిచి కట్టి తన్నాలి.

(నువ్వు ముందు అంటే 'నువ్వు ముందు!' అని సైగ చేసుకుంటూ ఎడమవైపునుంచి రఘుపతి, శ్యామసుందరం వస్తారు.)

లచ్చు:—(వాళ్ళిద్దర్నీ చూసి) యేమిటబ్బాయ్! మొహమాటం పడకండి. మీకు యిక్కడ అన్ని మర్యాదలూ సరిగా జరుగుతున్నాయా? మీకు యిక్కడ సౌకర్యంగా వుందా? యేమైనా లోటువుంటే సంశయించకుండా చెప్పండి.

రఘు:—అబ్బెబ్బే! లోటేమీ లేదండి.

శ్యామ:—మీతో కొంచెం రహస్యంగా మాట్లాడాలండి.

లచ్చు:—బసవయ్యగారూ! మీరు ఒకసారి లోపలికి వెళ్ళండి.

(బసవయ్య, పుల్లయ్య ఎడమవైపు వెళ్ళిపోతారు)

ఈసారి చెప్పండి. యేమిటి మీ సంశయం.

(రఘుపతి దూరంగా నిలబడుతాడు.)

శ్యామ:—(లచ్చన్నను సమీపించి) మేం రేప్రొద్దున్నే వెళ్ళి పోతున్నామండి.

లచ్చు:—అవును!

శ్యామ:—మా వాడు పెళ్ళికూతురి అభిప్రాయం కూడా తెలుసు కోవాలంటున్నాడండి.

లచ్చు:—అవసరంలేదు. మీరలాంటి సంశయం యేమీ పెట్టు కోకండి. యీ పెళ్ళి నాకు పూర్తిగా యిష్టం! యీ సంబంధం ఖాయంచేసేశాను. నేను ఒప్పుకుంటే మా అమ్మాయి ఒప్పుకున్నట్టే లెక్క!

శ్యామ:—అమ్మాయి ఉద్దేశం తెలుసుకోకపోతే......

లచ్చు:—అలాంటి పాడు పద్ధతులకి మేం ఒప్పుకోం. అమ్మా యిలూ అబ్బాయిలూ షికార్లు చెయ్యడం—ఆపైని పుకార్లు పుట్టడం—ఆ తరవాత యిక గత్యంతరం లేక పెళ్ళిళ్ళు చేసుకొనడం—అవన్నీ మీ పట్నాల్లో!యిక్కడ అలాంటివేం జరగడానికి వీల్లేదు—పెద్దవాళ్ళు నిశ్చయించిన సంబంధం —మాట్లాడకుండా ఒప్పుకోవలసిందే. యీ పెళ్ళికి యే విధమైన ఆటంకం లేదు. యిక యేమీ ఆలోచించకుండా కాస్సేపు వూళ్ళో తిరిగి రండి.

(రఘుపతి, శ్యామసుందరం ముఖాలు వేల వేసుకుని నిరుత్సాహంతో ఎడమవైపు వెళ్ళిపోతారు.)

లచ్చు:—(అటు తిరిగి) బసవయ్యా!

బస:—అయ్యా! (పుస్తకం చేత్తో పట్టుకొని ప్రవేశిస్తాడు).

లచ్చు:—యీ రాత్రి తోలుబొమ్మలాట దగ్గర మన మను షుల్ని కాపలాపెట్టు.

బస:—చిత్తం.

లచ్చు:—మన బాకీలు ఎగవేసి—తప్పించుకు తిరుగుతున్నవాళ్ళు చాలామంది వున్నారు.

బస:—అవునండి.

లచ్చు:—వాళ్ళలో కొంతమంది యివాళ బయటకు వస్తారు.

బస:—వస్తే మనవాళ్ళు వదిలెయ్యరులెండి. నిముషాలమీద యీడ్చు కొచ్చేస్తారు—అందులోనూ మన కొండయ్య, పుల్లయ్య నిజంగా యమదూతలే యమదూతలు!

(కొండయ్య ఎడమవైపు చెట్ల వెనకనుంచి కోపంతో ప్రవేశిస్తాడు.)

కొండ:—(వస్తూనే) మావయ్యా!

లచ్చు:—ఏమిటోయ్ ఒగుర్చుకుంటూ వస్తున్నావ్?

కొండ:—నీతో చాలాకాలంనుంచి చెప్పాలనుకుంటున్నాను. చెప్పడంలేదు.

లచ్చు:—ఏమిటది?

కొండ:—గౌరి రోజూ యెక్కడి కెళుతుందో తెలుసునా?

లచ్చు:—ఎక్కడికీ వెళ్ళడంలేదు. నేను ఎప్పుడు చూసినా యింట్లోనే కనిపిస్తోంది.

కొండ:—ప్రొద్దున్న పూట?

లచ్చు:—దేవుడిగుడికి వెళుతోంది. అంతేనా?

కొండ:—కాదు. మిమ్మల్నందర్నీ అక్కడే బోల్తా కొట్టిం చేసింది. గుడిమీద వంకపెట్టి గాలిగోపురం యెక్కే స్తోంది.

బస:—గాలి గోపురం యెక్కితే తప్పేముందయ్యా కొండయ్యా! గుడికి వెళ్ళిన పిల్లలంతా ఒకసారి గోపురం యెక్కి దిగుతుంటారు. వాళ్ళకి అదొక సరదా!

కొండ:—(హేళనగా) ఈ సరదాలనుగురించి నీకు తెలదయ్యా బసవయ్యా! నువ్వూరుకో! ఈ సరదావుందే! దీని రకమే వేరు. గాలిగోపురంలో యెవడుంటాడో మరిచిపోయావా బసవయ్యా!

లచ్చు:—నువ్వు చెప్పదలుచుకున్నదేమిటోయ్?

కొండ:—ఆ మారుతిలేడూ వాళ్ళకీ మనకీ అసలే చుక్కెదురు! గాలిగోపురంలోకి వెళ్ళి రోజూ వాడితో మాట్లాడు తోంది. వాడు గోపురంలో లేకపోతే ఎక్కడుంటే అక్కడికే వెళుతోంది. వాణ్ణి చూడకుండా ఒక్క క్షణమయినా.....

లచ్చు:—(కోపంతో) నోర్మూయ్ (కొట్టబోతాడు)

కొండ:—(తప్పించుకొని) నిజమే మావా! నే రుజూచేస్తాను.

లచ్చు:—(కోపంతో బిగ్గరగా) గౌరీ!

గౌరి:—(ప్రవేశించి) ఏం నాన్నా?

లచ్చు:—నువ్వు రోజూ ఉదయంవేళ యెక్కడికి వెళుతున్నావు?

గౌరి:—గుడికి.

లచ్చు:—అంతేనా? (గద్దిస్తూ) నువ్వు గాలిగోపురంలోకి వెళ్ళడం లేదూ?

గౌరి:—అప్పుడప్పుడు వెళుతున్నాను.

లచ్చు:—నువ్వు అక్కడ మారుతిని కలుసుకుంటున్నావా?

గౌరి:—ఎప్పుడైనా కనిపిస్తాడు.

లచ్చు:—వాడు కనిపించినప్పుడు నువ్వు మాట్లాడుతున్నావా?

గౌరి:—(మౌనంగా తలవంచుకుని నిలబడుతుంది)

లచ్చు:—(కోపంతో) యేం? మాట్లాడవేం?—యిదా నువ్వు వేస్తున్న వేషం?—యీరోజు మొదలు నువ్వు యిల్లు విడిచిపెట్టి—బయట అడుగుపెట్టడానికి—వీల్లేదు. ఊం! ఫో! లోపలికి!

(గౌరి తిరిగి వెళ్ళిపోతుంది)

బస:—పాపం! చిన్న పిల్లలు! వాళ్ళకేం తెలుసు!

కొండ:—(హేళనగా) చిన్నపిల్లలు! యింకా పాలుతాగుతున్నారు !!

లచ్చు:—(కోపంతో) మీరంతా చేతగానివాళ్ళు! ఆ మారుతి మనకి ప్రతిపనికి అటంకమే! వాణ్ణి మీరేం చెయ్యలేక పోతున్నారు. (పుల్లయ్య ప్రవేశిస్తాడు). దున్నపోతుల్లా వున్నారు. మీరేం మనుష్యులో నాకు తెలియకుండా వుంది. మీకు కొంచెం పౌరుషంలేదు. ఆ వెధవతో ప్రతివాడూ తన్నులు తిన్నవాడే! వాణ్ణి పడగొట్టిన వాడొక్కడులేడు.

కొండ:—వా డసలు కిందుంటే కాదూ కొట్టడానికి? ఎవణ్ణో బుర్ర బద్దలు కొట్టేస్తాడు. గాలిగోపురం యెక్కి కూర్చుంటాడు.

లచ్చు:—అక్కడికి వెళ్ళి వాణ్ణి జుత్తుపట్టుకొని యీడ్చుక రాలేరా మీరు?

పుల్లి:—అమ్మ బాబోయ్! అక్కడి కెళ్ళలేమండి.

లచ్చు:—యేం? యెందుకు వెళ్ళలేరు?

పుల్లి:—పైకెళ్ళికొద్దీ గోపురం సన్నంఅయిపోతాది కాదండీ!

కొండ:—ఎంతమంది బయల్దేరినా చిట్టచివరి అరలోకి ఒక్కడే వెళ్ళాలి.

పుల్లి:—ఆ ఒక్కణ్ణీ ఆడు పైనుంచి ఒక్కతోపేడంటే—యింక ఆకరువే—పెద్దలికి ముంతట్టికెళ్ళవలసిందే!

బస:—దీనికో చిన్న ఉపాయం వుందండి.

పుల్లి:—అణ్ణి మాయతోనే లొంగదియ్యాలండి.

లచ్చు:—ఏమిటి మీ ఉపాయం?

బస:—ఆ మారుతిని వూరినుంచి గెంటేస్తే చాలు మనకి!

లచ్చు:—అదైనా మంచిదే! కాని వాడు సవ్యంగా పోతాడా అని?

బస:—మనకి చంద్రయ్య ఐదువంద లివ్వాలి. మనం చంద్రయ్యని పిలిపించి—'నీ బాకీలో సగం రద్దు చేస్తాం. నువ్వు మీ మేనల్లుణ్ణి యింట్లోంచి గెంటేయ్'—అని చెబుదాం.

లచ్చు:—గెంటేస్తే!

బస:—వాడికింక యీ వూళ్లో తిండిపెట్టే వాడెవడూ వుండడు. చచ్చినట్టు వూరు వదిలి పెట్టిపోతాడు.

పుల్లి:—(సంతోషంతో) బలే! బాగుందండి.

కొండ:—అంతే! అలాగ చేస్తే చాలు.

బస:—పామ్మనకుండా పొగపెట్టినట్టే వుంటాది.

లచ్చు:—కానీ, చంద్రయ్య వాణ్ణి యింట్లోంచి తరిమేస్తాడా అని?

బస:—బాకీలో సగం వదులుకుంటుంటే యెందుకు తరిమెయ్యడు? మహారాజులాగ గెంటేస్తాడు. యిప్పటికే వాడంటే విసుగెత్తి వున్నాడు.

లచ్చు:—పుల్లయ్యా! మన పాలేరునిపంపి చంద్రయ్యని వున్నవాణ్ణి వున్నట్టు తీసుకురమ్మని చెప్పు. నువ్వు ఆ వీరయ్యగాణ్ణి గదిలోంచి యీడ్చుకురా.

(పుల్లయ్య వెళ్ళిపోతాడు.)

కొండ:—అడ్డమైన గాడిద కొడుకూ మనకి డబ్బు యెగెయ్యడం— ఆ మారుతిగాడి యింట్లో దూరిపోడమూను!

బస:—అతగాడంటే వాళ్ళంతా పెద్ద వస్తాదు అనుకుంటున్నారు.

కొండ:—వా డసలు నేలమీద దొరకడంలేదు. లేకపోతేనా?

పుల్లయ్య:—(నేపథ్యంలో) యేవండోయ్! యీరయ్యగాడు యెనక్కి లాగుతున్నాడు.

కొండ:—వస్తున్నాను.

(ఒక్క దూకు దూకి......ఎడమవైపు వెడతాడు. కొండయ్య, పుల్లయ్య—వీరయ్యని చెరొక రెక్క పట్టుకొని యీడ్చుకు వస్తారు.)

వీరయ్య:—(దిగ్గరగా) ఒరేయ్, బాబ్బాబు! పుల్లయ్యా! చెయ్యి విరిగిపోతాదిరా—అబ్బబ్బా, వదలవయ్యా కొండయ్య బాబూ!

లచ్చు:—(తీవ్రంగా) యేరా వీరయ్యా!

వీర:—బాబూ!

లచ్చు:—డబ్బు పట్టుకొని పారిపోదామనుకున్నావా?

వీర:—నా కాడ డబ్బుంటేకదా బాబయ్యా! అదంతా అప్పుడే అయిపోయింది.

లచ్చు:—అప్పు తీర్చాలన్న జ్ఞాపకం లేదా నీకు?

వీర:—గేపం వుందికాని బాబయ్యా! డబ్బేలేదు. పర్వబాటు కాగానే తమరికి పువ్వుల్లో పెట్టినట్టు తెచ్చి యిచ్చేస్తాను.

లచ్చు:—యిప్పటికి ఎన్ని వాయిదా లయ్యాయి?

వీర:—యింకొక్క వాయిదా యిప్పించండి బాబయ్యా

కొండ:—(లచ్చన్నతో) ఒప్పుకోవద్దు. యింకా వంద వాయిదాలిచ్చినా వీడు అప్పు తీర్చలేడు.

లచ్చ:—అప్పు తీర్చలేకపోయావు. బాగుంది—కానీ కనిపించకుండా పారిపోవడంలో నీ ఉద్దేశం యేమిటి?

పుల్ల:—యీడు మాకు కనపడే పారిపోయేడండి.

కొండ:—(కోపంతో) నువ్వు ఆ మారుతి యింట్లోనా దాక్కుంటావ్! (కర్రతో వీరయ్యను ఒక్కపోటు పొడుస్తాడు.)

వీర:—బాబోయ్! కొట్టకు!

పుల్ల:—ఆ యింట్లో దూరితే మేం రాలేం అనుకున్నావా? (కర్ర పైకెత్తుతాడు.)

కొండ:—చేతగానివాళ్ళం అనుకున్నావా? (కర్ర ఎత్తుతాడు.)

లచ్చ:—ఆగండి. (యిద్దరూ ఆగుతారు.) వీరయ్యా! నువ్వు యిక్కడినుంచి మర్యాదగా వెళ్ళ దలచుకుంటే ఒకపని చెయ్యాలి.

వీర:—(ఆశతో) యేంటి బాబయ్యా అది?

లచ్చ:—నీ కొంప మాకు తణఖా రాయి. విన్నొదిలేస్తాం.

వీర:—నాకు మిగిలింది కొంప ఒకిటే! అది కూడా పోగొట్టుకుంటే యే సెట్టుకిందో సేరాలి బాబయ్యా!

లచ్చ:—మరేం భయంలేదు. అప్పు తీర్చగానే నీ యిల్లు నీకు దక్కుతుంది.

వీర:—నా పేణం పోయినాసరే కొంప తాకట్టు పెట్టను బాబయ్యా

బస:—నా మాటవిని రాసెయ్! నీకేం భయంలేదు. నేనున్నాగా

వీర:— (హేళనగా) యెందుకు లేవూ? నువ్వున్నావు. వూరోళ్ళ కొంపలిత్తయ్యడానికి—దూడూ బసవన్నా అంటే తలూపడానికి—నువ్వున్నావయ్యా! వున్నావు!

బస:—(కోపంతో) అరెరే! మంచికి చెబ్తే నన్నెక్కిరిస్తావ్వంట్రా? (కొండయ్యతో) అయితే తన్నండయ్యా! చిత్తుగా తన్నండి.

లచ్చ:—(వీరయ్యకేసి తీక్షణంగా చూస్తూ) రాయవన్నమాట!

వీర:—నేను రాసివ్వలేను బాబయ్యా!

కొండ:—నువు రాసేదేంట్రా? నిన్ను పుట్టించినోడితో రాయిస్తాం! చూస్తావేరా పుల్లయ్యా!

(పుల్లయ్య కర్రతో ఒక్కటేస్తాడు)

వీర:—బాబోయ్, నాయనోయ్!

కొండ:—నోర్మూయ్‌రా! (ఒక్కటేస్తాడు)

వీర:—సంపెయ్యకండ్రోయ్!

(రత్తయ్య మొక్కల వెనకనుంచి తల యెత్తి—యేడుపు ముఖంతో అరవబోతాడు. మారుతి అతని నోరు నొక్కి కూర్చోబెడతాడు.)

లచ్చ:—ఆగండి! (యిద్దరూ కర్రలు దించేస్తారు). ముందు వీణ్ణి కాళ్ళూ చేతులూ కట్టి పారెయ్యండి.

(పుల్లయ్య ఎడమవైపు వెళ్ళి రెండు తాళ్ళు తీసుకు వస్తాడు. కొండయ్య, పుల్లయ్య కలిసి వీరయ్య కాళ్ళూ, చేతులూ కట్టేస్తూ వుంటారు.)

వీర:—(లచ్చన్నతో) బాబయ్యా! రక్షించండి బాబయ్యా! ఒక్క వాయిదా యిప్పించండి బాబయ్యా! మీ కడుపుని పుడతాను బాబయ్యా!

కొండ:—నోర్మూయ్‌రా! నోర్మూయ్! (ఒక్కటేస్తాడు). ఒరేయ్ పుల్లయ్యా, సాయం పట్టు!

(పుల్లయ్య కొండయ్య కలిసి వీరయ్యను మోసుకువెళ్ళి రాతి అరుగుమీద కుదేస్తారు.)

లచ్చ:—(వీరయ్యతో) నిన్ను యిక దేవుడు కూడా విడిపించలేడు. జాగర్త!—మేం తిరిగి వచ్చేసరికి నువ్వు యేదో ఒకటి ఆలోచించుకో—బసవయ్యా! నువ్వు కాగితం, స్టాంపూ తీసుకురా! (బసవయ్య వెళ్ళిపోతాడు). కొండయ్యా! మన వాళ్ళని యెవర్నయినా యిద్దరు సాక్షుల్ని తీసుకురా! (కొండయ్య వెళ్ళిపోతాడు). ఒరేయ్ పుల్లయ్యా! నువ్వు నాతో రా! (లచ్చన్న ముందుకు నడుస్తాడు.)

పుల్ల:—యీణ్ణొక్కణ్ణే యిక్కడొదిలేద్దామా బాబూ!

లచ్చ:—(నిర్లక్ష్యంగా) వాడు యిక యెక్కడికి పో గండ్రా!

(ముందు లచ్చన్న వెనక పుల్లయ్య ఎడమవైపు వెళ్ళిపోతారు. మొక్కల వెనకనుంచి మారుతి, రత్తయ్య అమాంతంగా ప్రవేశించి వీరయ్యను సమీపిస్తారు.)

రత్తయ్య:—ఓరయ్యా! (బిగ్గరగా యేడుస్తాడు)

మారు:—(రత్తయ్య నోరునొక్కి) ఉష్.! అరవకు! మరేం భయంలేదు. ఊం! విప్పెయ్!

(రత్తయ్య, మారుతి తొందరగా వీరయ్య కట్లు వదలించేస్తారు.)

వీర:—(ఆయాస పడుతూ) బతికించేవ్రా నా తండ్రీ! బతికించేవ్రా నాయనా! యీరాత్రి ఆళ్ళసేతుల్లో సచ్చిపోయేననుకున్నాన్రా!

మారు:—మాట్లాడకు! మీ రిద్దరూ నా తోరండి.

(ముందు మారుతి—వెనక వీరయ్య, రత్తయ్య గోడ వరకూ వెళతారు.)

రత్త:—నేను నీతో వుంటాన్రా!

మారు:—వద్దు! వద్దు! నువ్వు కూడా వెళ్ళిపో! మిగిలిన కథ నేను నడిపిస్తాను—ఊఁ! త్వరగా—మళ్ళీ వాళ్ళు రాగలరు.

(ముందు వీరయ్య తరవాత రత్తయ్య గోడదూకి వెళ్ళిపోతారు—మారుతి ఎడమవైపు ఒకసారి చూసి—తిరిగి మొక్కల వెనక్కి వెళ్ళిపోతాడు—పుల్లయ్య కలం సిరా బుడ్డి పట్టుకొని ప్రవేశిస్తాడు.)

పుల్లయ్య:—(వస్తూనే రాతి అరుగుకేసి చూసి) అరెరే! (బిగ్గరగా) లచ్చన్నబాబుగారూ! కొండయ్యగారూ! బసవయ్యగారూ!

(లచ్చన్న, కొండయ్య, బసవయ్య తొందరగా ఒకరి తరవాత ఒకరు ప్రవేశిస్తారు.)

పుల్లి:—జారిపోయాడండి! యీరయ్యగాడు పారిపోయాడు!

అప్ప, కొండ, బస:— (ఒక్కసారిగా) యెలాగపోతాడు. కాళ్ళూ, చేతులూ విరిచి కట్టేశాం!! యిదేదో మాయలాగేవుంది!!!

అప్ప:—(కోపంతో) మాయాలేదు. మంత్రంలేదు. మన యింట్లో యెవడో దొంగ వున్నాడు.

కొండ:—(ఆశ్చర్యంతో) మన యింట్లోనా? దొంగా?

అప్ప:—అవును! మన మనిషిలాగే నటిస్తూ, మనతో తిరుగుతూ, మనకి వ్యతిరేకంగా పని చేస్తున్నాడు.

బస:— మన వాళ్ళంతా నమ్మకం అయిన వాళ్ళే!

అప్ప:—(కోపంతో) నమ్మకమయిన వాళ్ళు! అయితే వీరయ్య ఎలాగ పారిపోయాడంటావ్? కాళ్ళకీ, చేతులకీ వున్న కట్లు (కిందపడివున్న తాళ్ళు తీసి) యెలా వూడిపోయాయి? ఆ పెరటి తలుపు (కుడి చివరకు వెళ్ళి) వేసినది వేసినట్టే వుంది......

బస:—యిదేదో యింద్రజాలంలాగే వుంది!

అప్ప:—మన కొత్త పాలేరుమీద నాకు అనుమానంగావుంది. ఆ వెధవని యిలా యీడ్చుకురండి. వాడే వీరయ్యని గోడ దూకించేసి వుండాలి. ముందు వాణ్ణి పట్టుకొని గూళ్ళిరగ పొడవండి. (సరిగా ఈ సమయంలో చంద్రయ్య ఎడమ చివర కనిపిస్తాడు)

అప్ప:—(కోపం తగ్గించుకోవడానికి ప్రయత్నిస్తూ) రావయ్యా! చంద్రయ్యా! నీ కోసమే చూస్తున్నాం.

చంద్ర : (ముందుకువస్తూ) యీ రాత్రివేళ నావనియేం వచ్చిందా....అని......

అప్ప : (మధ్యలో అందుకొని) నీతో చిన్న రహస్యం మాట్లాడాలి. అందుకు రాత్రయితేనే అనుకూలంగా వుంటుందని......

బస : (మధ్యలో అందుకొని) పిలిపించారు. అంతే!

చంద్ర : నేను చెప్పవలసిందేదో ఉదయమే చెప్పేశాను. మీరు చెయ్యవలసిందేదో ఉదయమే చేశారు. యింకేం మిగిలింది?

బస : తొందరపడకయ్యా! అప్పన్నగారు చెప్పేదినీకు కలిసొచ్చేదే!

అప్ప : చంద్రయ్యా! నువ్వు మేం చెప్పిన పని ఒకటి చెయ్యాలి. అదిచాలా చిన్నపని. నువ్వు తలుచుకుంటే యిట్టే అయిపోతుంది.

బస : నువ్వు వట్టినే చెయ్యక్కర్లేదు. దానివల్లనీకు లాభం కూడా ఉంది.

అప్ప : నువ్వునాకు ఇవ్వవలసిన బాకీలో సగంవదిలేస్తాను.

కొండ : (క్రమీద చెయ్యాలని ఓరుగాచూస్తూ) లాభసాటి బేరంవదిలెయ్యకు.

చంద్ర : ఎందుకీ ముసుగులో గుద్దులాట? మీరు చెప్పదలచినదేదో కచ్చితంగా చెప్పండి.

అప్ప : మరేమీ లేదు. నీ మేనల్లుడు చేస్తున్న దుండగాలు నీకుతెలుసు.

చంద్ర : అవును.—కానీ నా అప్పుకి వాడిఅల్లరికి సంబంధం యేమిటి?

బస : ఆయన చెబుతున్నది జాగ్రత్తగావినవయ్యా! ఎందుకు గాభరా పడిపోతావ్?

అప్ప : వూళ్ళోవున్న జనాన్ని నానా యిబ్బందులు పెడుతున్నాడు. లోకువ కనిపెట్టి కొడుతున్నాడు. మా మనుషులుచేస్తున్న ప్రతిపనికి అడ్డంవస్తున్నాడు. వయస్సులో వున్న ఆడపిల్లల్ని దారికాచి అల్లరిచేస్తున్నాడు.

చంద్ర : అది నిజంకాదు.

అప్ప : ఏది నిజంకాదు? మేం అబద్ధం చెబుతున్నాం అంటావా?

బస : నిన్ననేకదయ్యా మాఅబ్బాయిచెయ్యి విరగ్గొట్టేశాడు.

పుల్లి : యియ్యేళ పొద్దున్న నన్ను కొట్టటానికి రాలేదూ?

కొండ : మా దగ్గర అప్పుపుచ్చుకున్నవాళ్ళ నందర్నీ మా మీదకి రెచ్చగొట్టటం లేదూ?

అప్ప : కాబట్టి నా మాటవిని వాణ్ణివెంటనే వదిలించుకో!!

చంద్ర : (తీక్షణంగా) అంటే?

బస : మరేం లేదయ్యా! చాలాచిన్నపని! నీ మేనల్లుణ్ణి యింట్లోంచి గెంటెయ్! చాలు!

చంద్ర : (కోపంతో) బసవయ్యా! అలాంటి సలహా యెప్పుడూ చెప్పకు.—నీ కొడుకుని నువ్వు యింట్లోంచి గెంటెయ్యగలవా?

పుల్లి : నిన్ను వుత్తనే గెంటెయ్య మంటాన్నారా? డబ్బునగం వదులు కుంటున్నారా?

చంద్ర : (తీక్షణస్వరంతో) పుల్లయ్యా! నీ లాగే ప్రతిమనిషి డబ్బుకు అమ్ముడుపోతాడని అనుకోకు!

బస : (నచ్చచెబుతూ) ఎందుకయ్యా? వూరికే అలాగ తొందర పడిపోతావు. కాస్త స్థిమితంగా ఆలోచించుకో!—ఆ అప్పుతీర్చాలంటే నీకు—యెంతలేదన్నా—అయిదేళ్ళు పడుతుంది. అందులో సగానికి సగం వదిలేస్తామంటున్నారు. యింకా.................

అప్ప : (మధ్యలో అందుకొని) సగంకాదు. పూర్తిగా ఒదిలేస్తాము.

కొండ : (ఒక్కసారిగా) బాకీఅంతా వుట్టినే వదిలెయ్యడమే!

పుల్లి : (వెంటనే) బలేసామ్యకొట్టేసావయ్యా చెంద్రయ్యా!

బస : (వెంటనే) యీ దెబ్బతో నీ పీడే వదిలిపోయింది.

అప్ప : యిక ఆలోచించకు చంద్రయ్యా! యీ రాత్రే వాడు తిని నీయింట్లోంచి గెంటెయ్! రేపు ఉదయమే వచ్చి నీ నోటు నువ్వు తీసుకుపో!

చంద్ర : (నిర్లక్ష్యంగానవ్వి) నన్ను లంచంతో లొంగదీద్దామనుకుంటున్నారా?

అప్ప : నువ్వు వాణ్ణి యింట్లోనే వుంచడానికి నిశ్చయించావా?

చంద్ర : (దృఢనిశ్చయంతో) అటు పొద్దు యిటు పొడిచినా మా మారుతిని యింటినుంచి వెళ్లగొట్టను!

లచ్చు : (తీవ్రస్వరూపంతో) అయితే నువ్వే వాణ్ణిదువ్వి— మామీదికి కయ్యానికి పంపుతున్నావని మేం అనుకో వచ్చా?

చంద్ర : (కోపంతో) దుర్మార్గులకి దుర్మార్గపు ఆలోచనలే వస్తాయి. నీకుతోచినట్లు నువ్వు అనుకోవచ్చు. (పుల్లయ్య కొండయ్య, బసవయ్య, లచ్చన్న—చంద్రయ్యచుట్టూ సర్దుకుంటారు. లచ్చన్న కోపంతో చూస్తూ వుం టాడు. చంద్రయ్య తన ధోరణిలో) నువ్వు యేమి అనుకున్నా నాకు పోయేదేమీలేదు. నా కంఠంలో ప్రాణం వున్నంతవరకూ నామేనల్లుడు నాతో వుండవలసిందే! వాడిసంగతి నాకుతెలుసు. వాడు మంచివాళ్లకు మంచి వాడు. చెడ్డవాళ్లకు చెడ్డవాడు. దుర్మార్గానికి యెప్పుడూ ప్రతిపక్షం అవసరం. దుర్మార్గులకి పక్కని మొండివాడు ఒకడు వుండి తీరవలసిందే. అది దేవుడి సృష్టిలోనే వుంది. — మీ దౌర్జన్యం కొనసాగు తున్నంతకాలం వాడు మీపక్కనే వుంటాడు: వుండితీరవలసిందే!

కొండ : (పుల్లయ్యకు సైగచేసి — చంద్రయ్యకేసి తిరిగి— కోపంతో) నోర్ముయ్!

(పుల్లయ్య, కొండయ్య కర్రలు ఒకేసారి పైకెత్తు తారు. మారుతి చెట్లవెనుకనుంచి తలయెత్తి చూస్తాడు.)

లచ్చు : (వెంటనే బిగ్గరగా) ఆగండి!

(కొండయ్య పుల్లయ్య కర్రలు దించేస్తారు.)

చంద్ర : (కోపంతో) మీ బెదిరింపులకీ, మీపన్నాగాలకీ లొంగుతాననుకోకండి. బతికిన నాలుగురోజులు మంచిగా మర్యాదగా బతకండి.

(చంద్రయ్య చరచరా ఎడమవైపు వెళ్లిపోతాడు.)

కొండ : (చంద్రయ్య పోతున్నవైపుచూస్తూ) దెబ్బకి చంపే ద్దును, (వెనక్కితిరిగి లచ్చన్నను సమీపిస్తూ) మావా! నువ్వు అనవసరంగా అడ్డొచ్చేవ్.

పుల్ల : (వెంటనే) నేను యెత్తిన కర్ర దించేశాను.

లచ్చు : (కొండయ్యకేసి పుల్లయ్యకేసి చూస్తూ) మీకేమైనా బుద్ధీ జ్ఞానం ఉన్నాయా ?

కొండ : మధ్యని మమ్మల్నా తిట్టడం?

లచ్చు : లేకపోతే వాణ్ణి మనయింట్లోనా కొడతారు? వాడు యిక్కడ ప్రాణంవదిలేస్తే మనకి ప్రమాదంకాదూ?

బస : అబ్బెబ్బే! వూరికే తొందరపడిపోవడమే కాని వీళ్లకి కొంచెమూ ఆలోచనలేదండి!

లచ్చు : (కోపంతో) చంద్రయ్య నాకు యెదురుచెబుతాడా? (పుల్లయ్యతోనూ, కొండయ్యతోనూ) రేపు రాత్రి మీరు యిద్దరూ మనవాళ్లని మరోనలుగుర్ని తీసుకు వెళ్లి దారికాయండి.

పుల్ల : రాత్రుళ్లు పొలంకాపలాకి యెళ్తుంటాడండి.

లచ్చు : దారికాచి చావగొట్టి చెవులు మూసెయ్యండి— రేపు రాత్రే యిది జరగాలి.—యిక తోలు బొమ్మలాట దగ్గరికి పదండి.

(ముందు లచ్చన్న, వెనుక బసవయ్య, కొండయ్య, పుల్లయ్య, ఎడమవైపు వెళ్లిపోతారు.—ఎడమవైపు చెట్ల వెనకనుంచి రఘుపతి, శ్యామసుందరం వస్తారు.)

శ్యామసుందరం : (వస్తూనే) హమ్మయ్య! యిప్పటికి వదిలి పోయారు.

రఘు : త్వరగా ఆలోచించు! యికటైంలేదు. తెల్లవారితే ప్రయాణం!

శ్యామ : నీకు కాబోయే మామగారు ఎక్కడో దేవాంతకుడిలా వున్నాడు.

రఘు : తన అభిప్రాయానికి తిరుగులేదట!

శ్యామ : అది నూటికి నూరుపాళ్లు నిజం! నేనూ ఒప్పు కుంటాను.

రఘు : (అసహనంతో) ఏమైనాసరే పెళ్లికూతురి ఉద్దేశం తెలుసుకు తీరాలి. అనాగరికపు పెళ్లి నాకువద్దు.

శ్యామ : యిప్పటికి రెండు ఉపాయాలు చెడిపోయాయి. (ఆలో చిస్తూ ఎడమవైపు చూస్తాడు.) ఆః దొరికింది.

రఘు : ఏమిటిరా అది?

శ్యామ : తిరుగులేని ఉపాయం! (ఎడమవైపు చూస్తూ) అడుగో! పుల్లయ్య అటుపోతున్నాడు. (బిగ్గరగా) పుల్లయ్యా!

పుల్లయ్య : (నేపథ్యములో) బాబూ! (ప్రవేశించి) యేంకావాలి బాబూ!

శ్యామ : యిలారా! (పుల్లయ్య అతనికి దగ్గరగా వస్తాడు) నువ్వు మా కొక చిన్న సహాయం చెయ్యాలి.

పుల్ల : చెప్పండి.

శ్యామ : అతిరహస్యం! యెవరికీ తెలియకూడదు.

పుల్ల : (భయంతో) అయ్య బాబోయ్! అయితే వద్దండి.

శ్యామ : ఉష్! మాట్లాడకు. అది నీకు చాలా తేలిక! (జేబు లోంచి నోటుతీసి) యీ రెండు రూపాయలు నీదగ్గర ఉంచు. (నోటు యిస్తాడు)

పుల్ల : (సంతోషంతో తీసుకుని మొలలోపెట్టుకుని) చెప్పండి!

శ్యామ : నువ్వు రహస్యంగా లచ్చన్నగారి అమ్మాయి దగ్గరికి వెళ్లి.............(ఆగి చుట్టూ చూస్తాడు.)

పుల్ల : ఊం! యెళ్లి?

శ్యామ : ఇక్కడికి పిలుచుకురావాలి.

పుల్ల : మీరు రమ్మంటున్నారని చెప్పనా?

శ్యామ : మేం రమ్మంటున్నాం అంటే అసలురాదు.

పుల్ల : మరేం చెప్పమంటారు?

శ్యామ : మీనాన్నగారు రమ్మంటున్నారని చెప్పి యిక్కడికి తీసుకురా! అప్పుడు మేం ఆ అమ్మాయిని ఒక్కప్రశ్నవేసి పంపించేస్తాం.

పుల్ల : యిప్పుడే తీసుకొస్తాను. మీరు ఇక్కడే ఉండండి.
(ఎడమవైపు చెట్ల వెనుకనుంచి పుల్లయ్య వెళ్లిపోతాడు)

శ్యామ : (సగర్వంగా) చూశావా? యీ ఉపాయం యెలాఉంది?

రఘు : అద్భుతంగా వుంది.

శ్యామ : యిక దీనికి తిరుగులేదు. నువ్వుమాత్రం సిగ్గుపడకుండా అనుమానించకుండా—ఉచితంగా మాట్లాడు.

రఘు : అబ్బే! నేను మాట్లాడను! నాలంటట నేనే మాట్లాడితే ఎలాగ! నువ్వే నాతరఫున మాట్లాడు.

లచ్చన్న : (నేపథ్యంలో, ఏమేరి? ఎక్కడికి వెళ్లారు?
(యిద్దరూ ఉలికిపడి అటుచూస్తారు.)

శ్యామ : హా! వచ్చాంరా దేముడా! సమయానికి యీాయన దిగుతున్నాడేమిటి?

లచ్చ : (ప్రవేశించి) మీరు యిక్కడా వున్నారు? మీ కోసం అంతా వెతుకుతున్నాం. పదండి.

రఘు : (నిరుత్సాహంతో) ఎక్కడికండి?

లచ్చ : తోలు బొమ్మలాటదగ్గరికి! మీకు పట్నంలో యిటువంటిది చూద్దామన్నా కనిపించదు.

శ్యామ : మీరు కాస్తముందు నడుస్తూ వుండండి. మేం మరో ఐదునిముషాల్లో అన్నీ సర్దుకొనివస్తాం.

రఘు : (వెంటనే అందుకొని) ఒక్క ఐదునిముషాలు చాలండి.

లచ్చ : మీ సామాన్లన్నీ మామనుషులు యిందాకే సర్దేశారు. యింకేముంది సర్దుకోడానికి?

శ్యామ : భోజనం చేశాక కాస్సేపు విశ్రాంతి తీసికొనడం మా వాడికి అలవాటండి!

రఘు : (వెంటనే) అవునండి! అవును!

శ్యామ : మీరుకాస్త నడుస్తూవుండండి. మేం మీ వెనకే వస్తాం.

లచ్చ : మీరు మాతోరాకపోతే యిబ్బంది పడతారు. అంతా అలగాజనం—వచ్చిపడిపోతారు. మీకు ముందుకు రావడానికి దారి వుండదు. అయిదు నిముషాలు ఆలస్యమైనా అంతా కలిసేపోదాం. రండి. లోపలకూర్చుందాం.

శ్యామ : (విస్సృహతో) ఏరా! రఘూ!

రఘు : (చేసేదిలేక) సరే! పదండి!

లచ్చ : (ముందుకు నడుస్తూ) మనం వెళ్లకుండా ఆట్రారంభించరు. స్థిమితంగా వెళ్లొచ్చు.
(ముందు లచ్చన్న వెనుక రఘుపతి, శ్యామసుందరం ఎడమవైపు వెళ్లిపోతారు.)

పుల్లయ్య : (నేపథ్యంలో) అక్కడే కూచున్నారండి!
(ముందుపుల్లయ్య వెనుకగౌరి ఎడమవైపు చెట్లవెనుక వున్న రెండవదారినుంచి ప్రవేశిస్తారు.)

గౌరి : (వస్తూనే) ఏరీ? యిక్కడలేరే!

పుల్లయ్య : నేనొచ్చేసరికి యిక్కడే వున్నారండి.

గౌరి : మానాన్న యివేళ నామీద చాలాకోపంగా వున్నారు. పోనీ వన్నెందుకురమ్మన్నారో నీకుతెలుసా?

పుల్ల : (కంగారుపడుతూ) నాకు తెల్దండి. మీరు యిక్కడే వుండండి. నేవెళ్లి చూసొస్తాను.
(పుల్లయ్య ఎడమవైపు వెళ్లిపోతాడు. గౌరి ఆలోచిస్తూ కుడివివరికి వెళుతుంది. మారుతి చెట్లవెనుకనుంచి ఆమె మీదికి పువ్వువిసురుతాడు.)

గౌరి : (కోపంతో) ఎవరు? (మరోవైపుచూస్తుంది. వెనుకనుంచి మారుతి ఆమెమీదికి చిన్నకొమ్మవిసురుతాడు. గౌరి ఆకస్మికంగా వెనక్కి తిరిగిచూస్తుంది. ఆమెముఖంలోని కోపం మొదట ఆశ్చర్యంగాను, తర్వాత సంతోషంగానూ మారిపోతుంది. నెమ్మదిగా) బావా!

మారుతి : అవును! నేనే! (చెట్లలోంచి యివతలకువస్తాడు.)

గౌరి : (అతనిని సమీపించి) ఎలా వచ్చావ్ యిక్కడికి?

మారు : (గోడవైపు చూపిస్తూ) ఆకాశంలోంచి ఆల్లాదిగివచ్చాను.

గౌరి : (భయంతో) యింతరాత్రివేళ యెందుకువచ్చావ్?

మారు : మీనాన్న వడ్డీవ్యాపారం ఎలానడుస్తున్నదో చూసిపోదామని వచ్చాను.

గౌరి : ఎంతప్రమాదం! నిన్నిప్పుడు వాళ్లు యిక్కడ చూస్తే?

మారు : చూస్తే చూడనియ్! యింకా మంచిదిగా!

గౌరి : నిజంచెప్పుబావా! యీరాత్రివేళ యెందుకు వచ్చావ్?

మారు : నిన్నుచూడ్డంకోసం! (ఆమెకళ్లలోకిచూస్తూ) యీసారి నమ్ముతావా?

గౌరి : ఇది శుద్ధ దొంగమాట.

మారు : నిజం! నా మాట నమ్ము! మొదట ఒక నిశ్చయంతో నేను యీ లోపల అడుగుపెట్టాను. కాని బుద్ధభగవానుడిలాగ ఆ చెట్టుక్రింద నాకు జ్ఞానోదయం అయ్యింది. ఉద్దేశాన్ని వెంటనే మార్చుకున్నాను.

గౌరి : అదేమిటో నేను తెలుసుకోవచ్చా?

మారు : ఓ! నిరభ్యంతరంగా! నువ్వే అన్నమాటేమిటి? ప్రపంచం అంతా తెలుసుకోవచ్చు.—తెల్లవారేసరికి దానంతట అదే వెల్లడవుతుంది.

గౌరి : (ఎడమవైపుచూస్తూ) ఎవరైనావస్తారు. నువ్వుచెప్పేదేదో త్వరగా చెప్పి వెళ్లిపో!

మారు : నేను ఒక్కడినే చేతులు ముడుచుకు వెళ్లిపోతాననుకుంటున్నావా?

గౌరి : (హేళనగా) ఒక్కడివేవెళ్లకపోతే యిక్కడినుంచి ఎవరినైనా ఎత్తుకుపోతావా?

మారు : బాగా కనిపెట్టావ్!సరిగ్గ—నూటికి నూరుపాళ్లు—అదే నా ఉద్దేశం!

గౌరి : ఎవరి నెత్తుకపోతావ్?

మారు : నువ్వు చెప్పుకో చూద్దాం.

గౌరి : కొండయ్యనా?

మారు : కొండయ్యకంటే బండరాయి నయం! రాయి అయితే ఎందుకైనా పనికివస్తుంది.

గౌరి : (భయంతో) ఒకవేళ—మా నాన్నను ఎత్తుకపోయి—యేమైనా చేద్దాం అనుకుంటున్నావా? (వెనక్కిఅడుగు వేస్తుంది.)

మారు : భయపడకు! అదికూడా నా ఉద్దేశంకాదు.

గౌరి : మరి.....యిక ఎవరి నెత్తుకపోతావు?

మారు : (ఒక్కసారిగా) నిన్నే!!

గౌరి : (ఆశ్చర్యంతో) నన్నా? (నవ్వుతూ) వేళాకోళం ఆడుతున్నావా? (ముందుకువస్తుంది.)

మారు : నిజం!—నామాట నమ్ము.

గౌరి : (భయంతో వెనక్కి అడుగువేసి) ఏమిటిబావా? నువ్వంటున్నది?

మారు : గౌరీ! యింతకాలంవరకూ నిన్నునేను అర్థంచేసుకోలేకపోయాను.

గౌరి : (యింకా వెనక్కినడుస్తూ) యిదేనా నీకుకలిగిన జ్ఞానోదయం?

మారు : ఎందుకలా భయపడతావ్, ఆగు!

గౌరి : మా నాన్న వస్తాడు. యిక వెళ్లిపో బావా!

మారు : మీ నాన్న యింతలోరాలేడు.

గౌరి : నీకెలాతెలుసు?

మారు : నాకు అంతాతెలుసు. యీ రోజునుంచీ నీకు యీ యిల్లు బందిఖానా అవ్వడంకూడా నాకుతెలుసు.

గౌరి : నిజమేబావా! యిక నేను నీకుకనిపించను.

మారు : అలాంటి అనుమానం యేమి పెట్టుకోకు. నువ్వు నాకు కనిపించకపోయినా నేను నీకు కనిపిస్తానుగా !

గౌరి : (చురచురాచూస్తూ) రోజా యిలాగే గోడదూకి వద్దామనుకుంటున్నావా?

మారు : నిన్ను ఒకసారి గోడ దాటిస్తే నాకు రోజా యీ శ్రమ తప్పుతుందిగా!

గౌరి : (అనుమానంగాచూస్తూ) ఏమిటిబావా? యివేళ నువ్వు కొత్తగా మాట్లాడుతున్నావు!

మారు : యివేళ నిన్ను కొత్తగా అర్థంచేసుకున్నాను. కొత్తగా మాట్లాడుతున్నాను.

గౌరి : నాకు యిదంతా ఆయోమయంగావుంది.

మారు : నాకు యిదంతా అమోఘంగావుంది. చక్కని అవకాశం. చుట్టూ ఎవరులేరు.—స్వేచ్ఛగా, ఆకాశంలోని పక్షులలా ఎగిరిపోదాంరా! ఆలోచించకు! (కుడివైపు చూపిస్తూ) అదిగో! గాలిగోపురం! గోపురంలో కూర్చుని—బొమ్మరిల్లులా కనిపించే యీ సంకుచిత ప్రపంచాన్ని చూసి నవ్వుదాం.

గౌరి : (ఆశ్చర్యంతో) నన్ను గొంగళి పురుగులా చూసేవాడవు. యివ్వేళ యిలా మాట్లాడుతున్నావేం?

మారు : గొంగళి పురుగువుకావు. యిప్పుడు నువ్వు సీతాకోకచిలుకవు. నీ అందం, నీలోని మంచితనం నాకు యిప్పుడే కనిపించాయి.—ఊం! రావేం?

గౌరి : వద్దుబావా! వెళ్లిపో! నాబుర్ర మొద్దుబారి పోయింది. నాకేమీ తోచడంలేదు. వెలుగేదో, చీకటేదో తెలియకుండావుంది.

మారు : (కోపంతో) అయితే నువ్వు యిక్కడేవుండు. నేను వెళ్లిపోతున్నాను.—నిన్ను మీనాన్నబలిపశువులాగా ముస్తాబుచేసి పెళ్లిచేస్తాడు. నీకు యిష్టంవున్నా లేకపోయినా నిన్నుఈడ్చుకువెళ్లి మరొకడి మెడకి వ్రేళ్లాడకడతాడు. ఆ తర్వాత నువ్వు ఎంత మొత్తుకున్నా ప్రయోజనంవుండదు. (కుడిచివరకు వెళతాడు) యిక నేను వెళుతున్నాను. యిదే నిన్ను ఆఖరుసారి చూడ్డం.

గౌరి : (ఆత్రుతతో) బావా!

మారు : (ఆగి) ఏం?

గౌరి :—(అనుమానంతో) నిజంగా నేనంటే నీకు యిష్టమేనా బావా?

మారు :—అనుమానంగావుందా నీకు?

గౌరి :—నన్ను చూడ్డానికి నువ్వు యిష్టపడేవాడివికాదు. నేనుకనిపిస్తేచాలు—నన్ను అవమానించి—బలవంతంగా పంపేవాడివి.

మారు :—అవును. యీ రోజువరకూ నీ గురించి నేను తీవ్రంగా ఆలోచించలేదు. నా కళ్లకు నిత్యం మీనాన్నమీదవున్న కోపం అడ్డువస్తూవుండేది. నాకు యిక ప్రపంచమేకనిపించేది కాదు.—తీరా నేను కళ్లుతెరచి చూసేసరికి వీ ప్రేమ ఉత్తనటన అని తేలిపోయింది.

గౌరి :—(కోపంతో) మారుతీ!

మారు :—(పరిశీలనగాచూస్తూ) కోపంలో నీ ముఖం చాలా బాగుంది.—యింతకూ నీకు నా మీద అభిమానం వుందంటావా?

గౌరి :—నా మనస్సు యెప్పుడూ ఒక్కలాగేవుంది. నీలాగ నాలో క్షణాని కొక మార్పురాదు.

మారు :—(ఆమెను సమీపిస్తూ) నిజంగా నీకు నా మీద అనురాగం వుంటే—(అమాంతంగా ఆమె చెయ్యిపట్టుకుని) రా నాతో!—యిక వెనకాడకు.

గౌరి :—(విడిపించుకుంటూ) నా మాట వినుబావా!

మారు :—(కుడిచివరకు తీసుకువెళుతూ) ఉష్! మాట్లాడకు. యీ అవకాశం జారవిడుచుకోకు! యీ రోజు దాటిపోతే యికమనకు శాశ్వతమైన వియోగం. యీ జన్మలో నన్నునువ్వూ, నిన్నునేను చూడలేం. యీ మధుర క్షణాలను—యీ చక్కని అవకాశాన్ని విడిచిపెడితే—, యిక జీవితమంతా చీకటి. (ఎడమవైపు చూపిస్తూ)

యిక ఆ బోనులోకి వెళ్లకు. స్వేచ్ఛగా, హాయిగా ప్రపంచంపైకి వెళ్లిపోదాం.

గౌరి :—బావా....(యేదో చెప్పబోతుంది.)

మారు :—అడ్డుచెప్పకు. మాట్లాడకు. రా!— యీ నాలుగు గోడలూ విడిచి అందమైన ఉద్యానవనంలాంటి ఆ ప్రపంచంలోకి వెళ్లిపోదాం. (గౌరిని ఒక చేత్తో పట్టుకొని మరొకచేతితో పెరటితలుపుతెరచి కుడివైపుచూపిస్తూ) అదుగో! బయట ప్రపంచం ఎంత అందంగావుందో! అందమైన నీలాకాశం! దూరాన్ని సముద్రపుహోరు! మనల్ని ఎవరో పిలుస్తున్నట్టువుంది.

(యిద్దరూ పరవశత్వంతో ముందుకు అడుగువేస్తూ వుంటారు. యింతలో ఆకస్మాత్తుగా పుల్లయ్య ఎడమ చివర కనిపిస్తాడు.)

పుల్లయ్య :—(బిగ్గరగా) దొంగ! దొంగ! కొంపమునిగిపోయింది!

(మారుతి కోపంతో గోడమీదినుంచి రాయిఒకటితీసి—పుల్లయ్యకేసి తిరిగి—సూటిగా విసిరికొట్టి—గౌరితో కలిసి పెరటిద్వారంనుంచి పారిపోతాడు.)

పుల్ల :—బాబోయ్! (ఆయాసపడుతూ బిగ్గరగా) యేమండోయ్! అచ్చన్న బాబుగారూ! బసవయ్యగారూ! కొండయ్యగారూ! దొంగ! దొంగ! పారిపోతున్నాడు. రండి! రాండి!

నేపథ్యంలో :—(బిగ్గరగా) హో హో య్!

నేపథ్యంలో :—(ఒక గొంతు) వదిలెయ్యకు! వదిలెయ్యకు!

మరోగొంతు :—(నేపథ్యంలో) వస్తున్నాం! వస్తున్నాం!

(ఎడమవైపునుంచి ముందు అచ్చన్న, కొండయ్య, బసవయ్య—వారివెనుక మరో నలుగురు దృఢకాయులు కర్రలతో ప్రవేశిస్తారు.)

అచ్చన్న :—(వస్తూనే) ఏడిరా? దొంగ యెటుపోయాడు?

పుల్ల :—(భయంతో మాటరాక) ఆః ఆః ఆః అలాగ (కుడివైపు చూపిస్తూ) పోయేడండి.

కొండ :—వాడెవడో గుర్తుపట్టావా?

పుల్ల :—మా....మారుతండి!

అచ్చన్న :—పోరి వెధవ!

అచ్చ :—యేం ఎత్తుకుపోయాడు?

పుల్ల :—(తడబడుతూ) అమ్మాయిగార్నండి! అమ్మాయిగార్నండి

అచ్చ :—(కర్రతో ఒక్కటివేసి) సరిగ్గా చెప్పరా వెధవా! అమ్మాయిగారేమిటి?

పుల్ల :—బాబోయ్! (దెబ్బ తప్పించుకొని) మారుతి మన అమ్మాయిగార్ని ఎత్తుకుపోయేడండి!

అచ్చ :—(విభ్రమ్నుడై) ఏమిటి?

కొండ, బసవన్న :—(ఒక్కసారిగా) గౌరిని ఎత్తుకుపోయాడా? ఆః ఆః ఎంత పొగరు!!

అచ్చ :—(తేరుకొని—కోపావేశంతో) ఊం! లేవండి బయల్దేరండి! పరుగెత్తండి! (అందరూ కర్రలు సవరిస్తారు.) నా పరువు నిలబెట్టండి! వాణ్ణి ప్రాణాలతో వదిలెయ్యకండి. చంపెయ్యండి.

కొండ :—మావాః! నువ్వేం గాభరా పడకు! తెల్లవారేసరికి వాడి ప్రాణాలు తీసేస్తాం.

అందరు :—(ఒక్కసారి) చంపేస్తాం.

(అందరూ కర్రలు పట్టుకొని—ఆవేశంతో—కుడివైపు పరుగెత్తుతారు.— తెర.) (సశేషం)

# తెలుఁగులో బుడతకీచు నుడులు

శ్రీ తూమాటి దోణప్ప

[గత సంచిక తరువాయి]

అరబ్బులు, బుడతకీచులు విచిత్రస్వభావము కల వారు. వీరు అడుగుపెట్టని సీమలు లేవు. కాలూనినచోట కన్పట్టిన క్రొత్త వస్తువులన్నీ సేకరించి తదభావకములగు సీమలకు గొంపోయెడివారు 109. పదునారవు శతాబ్దాంతము వాటికి బ్రెజిలులో బుడతకీచుల అధికారము స్థిరపడినది. ఆఫ్రికా, పనామా, పెరూ, బ్రెజిల్, మలయా, మెక్సికో మొదలగు సీమల నుండి తరుగుల్మలతాదులను పెక్కింటిని బుడతకీచులు మన దేశమునకు కొనితెచ్చిరి. అనాస, గొయ్యా (జామి), గోబి (క్యాబేజి), చిలగడదుంప, జీడిమామిడి, పొగాకు, బంగాళాదుంప (ఉరలగడ్డ), బొప్పాయి (పరంగికాయ), మిరెప', మొక్కజొన్న, రామములగ (టొమాటో, అవగూడుకాయ), రామాఫలము, వంకాయ, వేరుసెనగ, సీతాఫలము మొదలగునవి బుడతకీచులు తెచ్చిన వానిలో కొన్ని. ఇవన్నియు మన సీమలకు క్రొత్తలు. ఇంచుమించు దక్షిణ అమెరికా ఖండమునకు నిసర్గము లయినవి. 1500—1850 మధ్య నివి మన దేశమునకు తేఁబడినవి. వీనిలో కొన్నింటిని బుడతకీచు మాటలతో పెంచితిమి; కొన్నింటికి క్రొత్త పేర్లు పెట్టితిమి. అనాస, గొయ్యా, గోబి, బొప్పాయులు మూర్తితో పాటు తద్బోధక పదమును ఎరవు తెచ్చిన కోవలోనివి. వానివాని స్వరూప స్వభావ సహవాసములను బట్టి మిగిలిన వానికి నామకరణము జరిగినది. ఇవి విదేశీయుల భావనాశక్తికి మచ్చుతునకలు. వీనిలో జీడిమామిడి, పొగాకు, మిరెప, వేరుసెనగ పంటలకు గల ఆర్థిక ప్రాధాన్యమును వేరుగా వివరింప నక్కర లేదు. విదేశీయము లగుట మూలమున కాబోలు వీనిలో చాల పాలు శ్రాద్ధాదికముల నిషిద్ధములు. బంగాళాదుంప ఇప్పుడిప్పుడు గదా అందరకు ఆహారయోగ్యముగా అంగీకార్యమగుట. వచ్చిన క్రొత్తలో నిది మ్లేచ్ఛ సాంగత్యము కలదని యెంతేగి కాబోలు అభోజ్యవస్తువుగా పరిగణితము. బంగాళా రాష్ట్రమున తొలుత దిగుమతి యయి, ఆ సీమలో బాగుగా వేరూని, ఆ పిమ్మటనే ఈ మొక్క తక్కిన రాష్ట్రములకు వ్యాపించినది. ప్రథమ సహవాసమువలన దీనికి 'బంగాళా దుంప' యను పేరు అన్వర్థము. 'ఉరలగడ్డ' యన్నది దీని ఆకారము (గుండ్రదనము) ను బట్టి కన్నడిగలు కల్పించిన పేరు. రాయలసీమలో దీనిని 'ఉరలగడ్డ' యని వాడుట కన్నడ ప్రభావము వలన. తెలంగాణమునను, సాగరాంధ్ర మండలముల కొన్నింటను కల 'ఆలుగడ్డ' యను వ్యవహారము ఉర్దూ ప్రభావద్యోతకము. మామిడిపండ్లు మనకు సొంతములే యయినను, వానికి అంట్లు గట్టుట మొదలగు నూతన దోహద క్రియల మూలముగా వానిలో క్రొత్త దినుసులను సృష్టించినది బుడతకీచులు 110. గోవా మామిడి పండ్లు మిగుల ప్రసిద్ధములు. బుడతకీచు బాసలో ఈ యీ తరుగుల్మలతాదిబోధకములగు పదములు నిసర్గములు కాక పోయినను, ఇతరభాషలతో బుడతకీచునకుఁ గల సంసర్గ సంబంధమువలన నివి బుడతకీచునకు సంక్రమించినవి. బుడతకీచులద్వారమున మనము స్వీకరించితిమి కావున వీనిని సైతము బుడతకీచు నుడులనుట నిర్బాధము. ఇన్ని మార్గముల బుడతకీచు నుడులు తెలుఁగు నుడి కడలిని జేరినవి. ఇట్టి పొడి నుడుల ఉనికి తప్ప, బుడతకీచు సాహిత్య ప్రభావము మనపై పడలేదు.

**బుడతకీచులు కొని తెచ్చిన మొక్కలు, చెట్లు**

తెలుగులోని బుడతకీచు నుడులనుగురించి ఇంతకు మునుపు ప్రస్తావించి అంతో యింతో చెప్పినవారు ఈ వ్యాసకర్త యెఱిఁగినంతవరకు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను (1798—1884) 111, డాక్టర్ సేబస్తియాన్ రోదల్ఫ్ దల్గాదు (1855—1922), గాలెటి (1935) 112, డాక్టర్ చిలుకూరి నారాయణరావు (1937) 113, ఆచార్య గంటి జోగి సోమయాజి (1947), డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు (1960)—ఈ యారుగురు మాత్రమే. వీరి పరిశీలన వివరణము వక్ష్యమాణము. బ్రౌను దొర తన మిశ్ర భాషా నిఘంటువున అమారు, ఏలము (యాలం), చెవి (=తాళము చెవి), మరియాన్ను (అట), మాదా—పదములను బుడతకీచ నిష్పన్నములుగా పేర్కొనినాఁడు. చెవికి రూపాంతరముగా చూపిన 'శావి' ని ఇటాలియను, బుడతకీచు భాషా సంబంధిగా ప్రదర్శించినాఁడు. 1'గమేళా''బాతు'— పదములను బుడతకీచు

---

109. Tavernier, Travels in India, Book II, p. 130.

110. Manucci, op. cit., Vol. III, pp. 180, 181.

111. C. P. Brown, Dictionary of Mixed Telugu, Christian knowledge Society Press, Madras, 1854.

112. Galletti's Telugu-English Dictionary, Oxford University Press, London, 1935.

113. Dr. C. Narayana Rao, History of Telugu Language, 2 Vols., Andhra University publication, 1937.

జన్యములుగా నుదాహరించి, వీని చరిత్ర సందేహాస్పదమని కాంబోలు ప్రశ్నార్థక చిహ్న ముంచినాడు. 'అల్మార' శబ్దము నొద్ద ఫ్రెంచి, స్పానిషు, బుడతకీచు భాషాగతములగు జ్ఞాతి శబ్దముల నిచ్చుటచే దీని మాతృక యిదమిత్థమని నిర్ణయము కాలేదు. మేస్త్రి, మేస్త్రీ పదములకు ఫ్రెంచి, బుడతకీచులు మూలభాషలుగా చూపబడినవి. న్యాయ్యముగా బుడతకీచు జన్యములుగా పేర్కొనదగిన పదము లనేకములు బ్రౌను వివరణమున ఆంగ్ల పరాసు భాషా భవములుగా నిరూపితము లయినవి. కొన్ని ఆరోపముల (entries) యొద్ద ఉర్దూలిపిలో మూల రూపములు కాంబోలు ప్రదర్శితము లయినవి. మఱీ యీ లిపిలోని మాటలు అరబ్బీ, ఉర్దూ, తుర్కీ, పారసి హిందూస్థానీలలో ఏ భాషకు చెందినవో నిర్ణాయకములు కాలేదు. కొన్నిటి అర్థనిర్ణయము అసంపూర్ణము. ఆయా ఆరోపముల క్రింది ఉదాహరణములు చూడనగును. ఈ వ్యాసమున కనుబంధమగు పదపట్టికలో నుట్టంకితములయిన అనేక పదములకు మిశ్ర బ్రౌణ్యమే ముఖ్యమగు ఆకరము. కాని వీని మూలరూపములను బ్రౌను దొర చూపలేదు. బ్రౌను దొర రచించిన ఇంగ్లీషు—తెలుగు నిఘంటువులో 114 ఆరోప పదముల అర్థనిర్ణయసందర్భమున ప్రయోక్తములయిన తెలుగు వాక్యములలో దొరలిన బుడతకీచు మాటలు కొన్ని యీ వ్యాసకర్తచే ప్రత్యభిజ్ఞాతము లయినవి. గోవా, సింహళములలో క్రైస్తవ మతాధిపతి (1884—1906) గను, లిజ్బను విశ్వవిద్యాలయములో సంస్కృతాచార్యుడు (1906—1922) గను ప్రసిద్ధినందిన డాక్టర్ దల్గాదు బుడతకీచు బాసలో రచించిన 'ఆసియా భాషలలోని బుడతకీచు పదముల ప్రభావము' (Influencia do Vocabulario portu_gues em Linguas Asiaticas) అను ఉత్తమ పరిశోధక గ్రంథము పోర్చుగాలులోని కోయింబ్రా విశ్వవిద్యాలయమున ముద్రితమయి లిజ్బను నగరములోని వైజ్ఞానిక పరిషత్తు (Academy of Sciences) పక్షమున 1913 లో ప్రచురితమయినది. Influence of Portuguese Vocables in Asiatic Languages' అను పేర దీని ఆంగ్లానువాదము గైక్వాడు ప్రాచ్యగ్రంథమాలలో 1936 లో వెలువడినది. 115 డాక్టర్ దల్గాదు పూర్వులు కొంకణ దేశీయులయి, దేశాయి కుటుంబమునకు చెందిన బ్రాహ్మణులు; బుడతకీచులు రాకతో క్రైస్తవమును స్వీకరించినవారు. దల్గాదు కొంకణి, మరాఠీ, గ్రీకు, లాటిన్, ఫ్రెంచి, హిబ్రూ, సంస్కృతభాషలలో మహాపండితుడు. బుడతకీచు మూలములుగను తత్ప్రభావితములుగను దల్గాదు గ్రంథమున ఆంధ్రభాషాగతములుగా డెబ్బదియేడు పదము లుదాహృతములయినవి. వీనిలో పదునొకండింటి చరిత్ర వివాదగ్రస్తమని సూచితము. తక్కినవానిలో అస్పత్రి, కవాలి, పోలీసు, రసీదు మొదలగు వానిని ఆంగ్లభవము లనుట యుక్తము. ఆయా (=దాది),

## పూర్వకృషి: విహంగావలోకనము

కాప్పిరి (=కాఫర్), తురంజ (=దూదినిమ్మ), నిమ్మ, పాపాను, పింగాణి మొదలగునవి బుడతకీచు మాటలు కానేకావు. గలన్ (=gold lace), సపాథ్ (=పాదుక)—వీనికి ఆకరములు చిక్కలేదు. తెలుగువాట మాండలికములుగా ఏ ప్రాంతమునందైన వీనికి వ్యవహారము కలదేమో ? 'బాతు' విషయములో శంకకు కొంత తావు కలదు.. ఇయ్యదాముక్తమాల్యదలో ప్రయోక్తము. డా. దల్గాదు పట్టికలలోని అనాస, అమారు, అల్మారు, ఆన, ఇస్త్రి, ఏలము, కలపతి, కాతరుసు, కాతలిక్, కామరా, కుమాందన్, కుంబాద్రి, కుసిని, కోపి, కోమాను, చెవి, జన్నలు, తారము, తువాల, నొవేనా, పయాలు, పరంజా, పాదిరి,, పాపు, పాస్క, పీత (=వాడా), పీపా, పురోయి, పేనా, బంకటి, బత్తెరి, బసి, బాల్చి, బిస్కతు, బురుమా, బొత్తాము, బోదమన్నా, మయోరు, మరియాన్ను (ఆట), మాదిరి (=ఒక దినుసు పేక), మెలాసు, మేజా, మే (జోడు), మైను, సక్రీస్తు నగ్గు, స్పిరితుసాంతు—అను బుడతకీచు నుడులుగా అంగీకరింపనగును. 'బుడతకీచులలో భారతదేశమునకు చిరకాల సంబంధ ముండినను 'కమీజ', 'కుశిని' (—వంటయిల్లు) ఈ రెండే రెండు బుడతకీచుపదములు తెలుగున నిలచిన,వని గాలెటి నిర్ణయము. 116 డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు తమ ఆంధ్రభాషాచరిత్రము మొదటి సంపుటము 618—619 పుటలలో తెనుగులో 34 బుడతకీచు పదము లున్నట్లుగా చూపిరి. ఇందులో కటారి, కాఫీ, చదర, తపేలా, మఱక (=మచ్చ) యీ యైదును బుడతకీచు మాటలు కావు. ఈ పట్టికలో బుడతకీచుపదములుగా పేర్కొనబడిన అనాస, అమారు (త్రాడు), అల్మారా, ఇస్త్రి, కమీజ, కాఫీ, గోదాము, తపేలా, తురుపు, తువాలు, పాదిరి, బిస్కతు, బొత్తాము, బొప్పాయి, నగ్గు—ఈ పదునైదింటికి అదే సంపుటమున వేర్వేరు పుటలలో వేర్వేరు మూలములు ప్రదర్శితము లయినవి. అవి ఇవి.

| | |
|---|---|
| 1. అనాస | బుడతకీచు (పుట. 618) |
| | హిందీ (పుటలు. 592,594), |
| | పారసి (పుట. 592), |
| 2. అమారు (త్రాడు) | బుడత (పు. 618), |
| | హిందీ (పు. 593), |
| 3. అల్మారా | బుడత (పు. 618), |
| | హిందీ (పు. 595), |
| 4. ఇస్త్రి | బుడత (పు. 618), |
| | హిందీ (పు. 595), |

---

114. C. P. Brown, English - Telugu Dictionary, Revised by M. Venkataratnam 1895.

115. Translated into English with notes, additions and comments by Prof. Anthony Xavier Soares.

116. Galletti, op. cit., pp. 55, 79.

5. కమీజా — బుడత (పు. 618),<br>అరబ్బీ (పు. 580),
6. కాఫీ — ఇంగ్లీషు (పు. 605, 617)<br>బుడత (పు. 618),
7. గోదాము — బుడత (పు. 618),<br>ఇంగ్లీషు (పుటలు. 612,616),
8. తపేలా — హిందీ (పు. 595),<br>బుడత (పు. 618),
9. తురుపు — బుడత (పు. 619),<br>ఇంగ్లీషు (పు. 617),
10. తువాలు — బుడత (పు. 618),<br>ఇంగ్లీషు (పు. 616),
11. పాదిరి — బుడత (పు. 618),<br>ఇంగ్లీషు (పు. 617),
12. బిస్కోతు — బుడత (పు. 618, పుట అడుగున నుండి రెండవ పంక్తి),<br>ఇంగ్లీషు (పు. 618, పుట మీది నుండి ఎనిమిదవ పంక్తి),
13. బొత్తాము — బుడత (పు. 618),<br>ఇంగ్లీషు (పు. 616),
14. బొప్పాయి — బుడత (పు. 618),<br>హిందీ (పు. 592, 594).
15. వగ్గు (బియ్యము) బుడత (పు. 618),<br>హిందీ (పు. 581).

'కాఫీ' ని ఆంగ్ల సమముగను 'కటారి', 'తపేలా' లను హిందీ భవములుగను చూపుట యుక్తము. చదర సంస్కృతము నందలి 'చతురశ్ర' శబ్ద సంబంధియేని, 'చత్వర' శబ్ద సంబంధియేని కానగు. మచ్చ మఱకలు శుద్ధ ద్రావిడ పిండములు. మసక, మసి, మాపు, మాయు, మాసిన పదవర్గమునకు మూలమగు ప్రాచీన ద్రావిడ మచ్ ధాతు నిష్పన్నము మచ్చ. మఱచు, మఱపు, మఱుగు, మఱువు—మొదలగు పదముల కోవకు చెందినది మఱక. తక్కినవి బుడతకీచు పదములు. బుడతకీచు బాసలోని గుణింతపు సంప్రదాయములు మనకు క్రొత్త లగుటచే లిప్యంతరీకరణమున శ్రీ నారాయణరావుగారి వ్రాతలలో కొన్ని చోట్ల తబ్బిబ్బు కలిగినది. ఇవి అచ్చు తప్పులో, అసలు తప్పులో చెప్పలేము. కోవె, గ్రాదె, చావె, ప్రాదె, బాల్దె—ఇట్టి ఎదంతోచ్చారణముగాని, కనొ, బిస్కోయ్‌తో ఇట్టి ఒదంతోచ్చారణముగాని బుడతకీచులో లేదు. వీనిని కోవి, గ్రాది, షావి, ప్రాది, బాల్ది, కాను, బిస్కోతు—అని క్రమముగా ఇదుదంతములుగా ఉచ్చరించుట బుడతకీచు భాషా సంప్రదాయము. 'కమీజు'కు 'చమీస' అనియు 'చదర' కు 'చదెయ్‌ర' అనియు మఱక (=మచ్చ)కు 'మార్క' యనియు మూలరూపములు ప్రదర్శితములు. బుడతకీచులో వీనిని (Camisa, cadeira, marca) అని ఇట్లు రోమక లిపిలో వ్రాయుట వాడుక. బుడతకీచులోని ఉచ్చారణ మర్యాదల ప్రకారము 'C' అను లిపిచిహ్నము ఆంగ్లములోవలె 'క,' 'స' అనురెండు ప్రత్యేకవర్ణములకు పరస్పరపరిపూరక (Complementary) సంకేతము. అనగా ఈ రెండు వర్ణములను పరస్పర వ్యావృత్తిగా 'C' అను లిపి చిహ్నముచే ఉచ్చారితములు. తాలవ్యేతరస్వరములు పరముగానున్నచో 'క' వర్ణముగను తాలవ్య స్వరూపములు పరముగానున్నచో 'స'వర్ణముగను ఈ 'C' ఉచ్చరితము. కావున పూర్వోక్తపదములను కమీజా, కదేరా, మర్కా అని ఉచ్చరించుట శాస్త్రపద్ధతి. స్త్రీల పడక ఉడుపు, లోకొంగు, మొలగుడ్డ అను నర్థములుకల షమీజ్ (Chemise) అను ఆంగ్లపదవాసన వలన 'చమీస' యని పొరపడియుందురని యూహించుట నిరవకాశము. Caderia ను 'చదెయ్‌రా'గా చదువుట శబ్దమాత్రసారూప్య భ్రాంతి. తమిళములో కుర్చీ యను నర్థములో కల 'కదిరై' యనుమాట బుడతకీచునుండి వచ్చినది.[117] ఇంగ్లీషు భాషలో ఆచార్యపీఠము అనునర్థము కల 'కెథీడ్ర' శబ్దమునకు మూలమగు గ్రీకు 'కైథీడ్ర', బుడతకీచు Cadeira కును అసలు మూలము. బుడతకీచులోని diccanario (dictionary), direccao (direction) పదములోని 'C' అను లిపిచిహ్నమునకు 'కు' కారోచ్చారణము మాండలిక భేదముల ననుసరించి వికల్పవిధి. తెలుగులోని 'చెవి' (=తాళపుచెవి)కి బుడతకీచులోని (chave) మూలరూపము. దీనిని 'చావె' అని పఠించుటతప్పు; బుడతకీచులోని 'చ' వర్ణమేలేదు. 'షావి' అని పఠించుటఒప్పు. తపేలా, తువాల, వెసల—లకు వరుసగా తాల్హ, తొఅల్హా, వసిల అని బుడతకీచు రూపములు చూపిరి. బుడతకీచులోని 'lh' అను లేఖనచిహ్నము 'l', 'h' అను రెండు లేఖన చిహ్నముల కలయికకు గుఱుతుకాదు. 'l', 'h'లకంటెను, వీని సంయోజనము కంటెను భిన్నమయిన వర్ణమున కిది సంకేతము. ఆంగ్లభాషలోని 'million' పదమునందలి 'lli' భాగపు సదృశోచ్చారణ మిట వివక్షితము. ఒలాందులు (డచ్చివారు) అను పదమునకు బుడతకీచు మూలముగా 'హొల్లెన్డెజ్' ప్రదర్శితము. కాని, బుడతకీచులో 'h' పలుకబడదు. ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజిగారు తమ ఆంధ్రభాషా వికాసము 'తెనుగునందలి పదజాలము' అను నధ్యాయమున 'పాశ్చాత్య భాషాపదములు' అను ఉపశీర్షిక క్రింద 'పోర్చుగీసువారే మొదట భారతదేశమునందలి పడమటి తీరమును గాలూనిన వారయ్యును వారి నాగరికతా ప్రభావము గాని, భాషా విశేషముగాని నిలువలేదు. తెలుగు, అరవము, కన్నడము, అనుమూడు భాషలయందును అల్పసంఖ్యాకములయిన పదము నిలిచినవి' అని ప్రతిపాదించి, అమారు, అలమారు, కక్కుసు, కమీజా, జన్నల్, పాదిరి, బాల్చి, బొత్తాము— ఈ ఎనిమిదింటిని బుడతకీచు మాటలుగా పేర్కొనిరి. వీటిలో, ఒక్క 'కక్కుసు' (=మఱుగు పెరడు, పాయిఖానా) తప్ప తక్కిన వన్నియు బుడతకీచు మాటలు. ఇది 'కఖుస్' అను ఒళందా (డచ్చి) భాషాపద నిష్పన్నము. కక్కుసు (అనంత; చిత్తూరు), కక్కూసు (బళ్ళారి), కక్కొసు

117. Tamil Lexicon, Vol. II. 714.

(గుంటూరు), అనిదీనిమాండలిక రూపములు. 'తెలుఁగునఁగల ఒకేఒక డచ్చి పదమని, ఆంధ్రలోని దక్షిణమండలములో దీనికి విశేష వ్యాప్తిగలదని' గాలెటీ వ్యాఖ్యానము118. తమిళ మలయాళ కన్నడ నిఘంటువులయందును నిది డచ్చి పదముగా ఉట్టంకితము. 119 ఈ మాట దక్షిణ భారతమునకే పరిమితము, ఉత్తరహిందూస్థానభాషలో మృగ్యము. డచ్చిభాషలో కక్ (kak= మలము)+హుయిస్ (huis = ఇల్లు, స్థానము) అను పదములచే నేర్పడిన సమస్తపదమిది. ఇట్లే పక్ (pak=బంగి, మూట) +హుయిస్ = పఖుస్ = పార్సిల్ ఆఫీసు, బఖుస్ (bakhuis= bake house) మొదలగు సమస్త పదములు ఒళందా (డచ్చి) భాషలో ఏర్పడినవి 120. డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావుగారు తమ తెలుగు సాహిత్యము పై ఇంగ్లీషు ప్రభావము అను పరిశోధక వ్యాసమున మిశ్రశౌణ్యము నాధారముగాఁగొని, గమేళా,1 చెవి, బాతు, మరియాన్న (ఆట), మేస్త్రీ పదములను బుడతకీచు మాటలుగా ఉదాహరించి [illegible] అభిప్రాయములను ఆమ్రేడించిరి. బుడతకీచులకును భారతీయులకును గల చారిత్రక సంబంధములను శ్రీ వీరభద్రరావుగారు విస్తరించి వ్రాసిరి. ఇండో— బుడతకీచు భాషను గుఱించి మొదట ప్రస్తావించిన తెనుఁగులలో శ్రీరావుగారే ప్రథములు121. ఇంతే వీరికృషి.

ప్రస్తుతపరిశీలనమునందలి మొత్తము పదములు : 150
వీని రూపాంతరములు : 152.

అనాస, అలమారు, ఇస్త్రీ, ఏలము, కాజా, కుంపిణీ, క్రీస్తు, పరంజా, పాదిరి. పిరంగి, పీపా, పేనా, మే (జోడు), మేస్త్రీ, మోస్తరు, మొదలగునవి సర్వాంధ్ర వ్యవహారములు. అల్పి, కమీజా, కానా, గుదావు, బాల్చీ, బొత్తాయి, సోల్దాదు మొదలగునవి విశాఖ శ్రీకాకుళములకు వ్యావర్తకములు. ఆన, ఒళందా, కమాను, కోస్తా, గమేళా 2, గోదాము, తురుపు, బంకు, బాల్దీ, బొత్తాము, బొప్పాయి, మొదలగునవి సాగరాంధ్రమున ప్రచుర వ్యవహారము కలవి. అనారస, గడంగు, గొయ్యా, చప్పాతి (కల్లి), జొన్నలు, టిన్కుత్తు, సొడిదేవు మొదలగునవి రాయలసీమకు విశిష్టములు.

## పదస్వభావ విభజనము

సైనిక సంబంధములు : అర్మదా, ఓకు, కపితాను, కమాను, కుమందను, పటాలము, బత్తేరి, బారకాసు, బొంబాను, మయూరు(లు), సార్జంటు, సోల్దాదు, మొ.

నావికపదములు : అమారు, అర్యా, (చేయు), కామరా, కుంపాసు, కూర్సు, గమాతు, గమేళా 1, గావాయి, బుడుదు, బొంబా, బోడిద, బోయా, ముద్ర, రంబ్రాలు, మొ.

క్రైస్తవ మతపరములు : అపొస్తలు, ఏనోలు, కాతోలిక్కు, కిరూబు, కుంబాద్రి, కోపా, క్రీస్తు, క్రీస్తువు, నొవేనా, పాదిరి, పాపు, మరియ, మాదా (గుడి), సబ్బాతు, స్పిరితు సాంతు, మొ.

గృహనిర్మాణ సంబంధములు : కానా, గమేళా, 2. చెవి, జన్నలు, పయాలు, పరంజా, బొరిగ, మాదిరి, మేస్త్రి, రీపా (లు), మొ.

ఉడుపులు : ఇస్త్రీ, కబాయి, కమీజా, కాజా, తువ్వాలు, సొప్పలి, బుర్గతకాళి, బొత్తాము, మే (జోడు), మొ.

వర్తకము : ఏలము, కుంపిణీ, కోస్తా, గిడ్డంగి, గోదాము, తారము, బంకు, రతులు, మొ.

ప్రాంతకోతలు : అలవనాలి, అల్పి, కాతరను, పురోయి, పేనా, మొ.

మొక్కలు, చెట్లు : అనాస, గొయ్యా, గోబి, బిబిబి, మెలాము, సాంత్రా (నారింజ), మొ.

గృహోపకరణములు : పీపా, బసి, బాల్దీ, బొంబాయి, మేజా, వెసల, సబ్బు, మొ.

చరిత్రప్రసిద్ధములు : జామొరిన్, జెంతు, పరంగి, పురతకాలు, ఠాంతోము, మొ.

ఆటలు : కుదేలు, జేస్తు, మరియాన్న (ఆట), మొ.

## పద పట్టిక

1. అగతమ్మ : రూ. ఏగాత్త, యాగాత (గాలెటి, 137) చెన్నపట్టణము పరిసరముల క్రిందితెగల కులదైవమగు ఒక గ్రామదేవత; St. Agatha.

2. ఆగస్తు : రోమక పంచాంగములో ఎనిదవు మాసమగు 'ఆగస్టు.—బు. ఆగొస్తు—స్పా. అగోస్తు—ఇం. ఆగస్టు (టన్ను, టాప్, టిన్, టేప్, టోల్, స్టన్, స్టేషన్, స్టోరు, టెంట్, కోట్, రేట్, ఫస్టు (తారీఖు), పోస్టు— ఇట్లు ఇంగ్లీషు పదములను దాదాపు మూర్ధన్య వర్ణ ఘటితములుగా ఉచ్చరింతుము; బుడతకీచులోని 't' వర్ణోచ్చారణము మనదంత్య వర్ణోచ్చారణమునకు దగ్గఱ; అందుకే 'అగస్తు'ను బుడతకీచు సంబంధిగా పేర్కొనుట ఉచితము.

---

118. Galletti, op.cit., pp. 51, 79.

119. తమిళ. కక్కూసు (ఎ); డచ్చి — కఖుస్. (Tamil Lexicon Vol. II, p. 634) మల. డచ్చి. కఖుస్; కన్నడ. కక్కసు; కకోసు; డచ్చి లేక డేనిష్.

120. తెలుగులోని డచ్చి నుడులను గూర్చి మరియొక వ్యాసమున.

121. Dr. K. Veerabhadrarao, Influence of English on Telugu Literature, pp. 5-20.

'పదునెనిమిది వందల తొంబది యెనిమిది క్రీస్తు శకము మాసమగస్త్యదిమూడు తేది............ అను వసురాయల చాటువులోని 'అగస్తు'ను 'అగస్తి'గా చదివి శ్రీ వెంకటరావుగారిద్దానిని అశ్వయుజ మాసమను నర్థములో సంస్కృతపదముగా ప్రదర్శించిరి. (చూ. శ. ర. అను., పు. 2).

3.అంకారించు : క్రి. ఓడచాపయెత్తిపోవు.—బు. అంకోరా; స్పా. అంకోరా; ఫ్రె. ఆంక్రె; డచ్చి. అంకర్ (హిం.శ.ర).

అనవ (సూది) : చూ. అలవనాతి (బ్రౌ. ఇం. తె., 904). గుండుసూది (ఇట—'ల'—'వ' గా మారినది; ఈ రెండు వర్ణములును దంతమూలీయములు; 'వ' స్పర్శానునాసికము, 'ల' పార్శ్వికాంతస్థము).

అనానాసు : చూ. అనాస (మిశ్రబ్రౌ).

అనారస : చూ. అనాస (అనంత). బెంగాలి. అనారసి. వీని. అనాస రూపుగా నుండు; అనరస అనియు కొందఱు.

4.అనాస : రూ. అనానాసు, అనారస, అనాసపనస, అనాస పనాస, అవాసు, (కృ., గుం., గో.) మొగలిపనస; Ananas sativus (Flora of Madras, III, P. 1046). (యయాతి. 1–36; హంస. 4—134)—బు. అననాస్; స్పా. అనవా, అననాస్, ఫ్రె. అననా; డచ్చి. అననస్; పెరూవియన్—ననస్; బ్రెజిలియన్-ననస్; అరబ్బీభాషాముఖమున తెలుఁగున చేరిన బ్రెజిలియన్ పదమని MAMP, Vol. III p. 28;-పారసి(ఆంభాచ.,592);–దే.వి(శ.ర; బ్రౌరి.);-హిం.(బ్రౌ); మెక్సికో, పనామా, బ్రెజిల్ మొదలగు ఉష్ణమండల ప్రాంతములలో ఎక్కువ పంట; అక్బరు కాలమున బుడతకీచులు దీనిని మలక్కా దీవుల నుండితెచ్చి మొదట బంగాళమున ప్రవేశపెట్టిరఁట. (MAMP, Vol.III, p. 28); 1594 లో బుడతకీచులు బంగాళరాష్ట్రమునకుతెచ్చిరని జార్జివాట్ (George Watt, The Economic products of India Vol. I, P. 236); దక్షిణ భారతమునను, బంగాళమునను విరివిగా పైరు చేయుబడుచుండినట్లు వెనిషియనువర్తకుడు నికోలాయ్ మనూచి (1653—1708) వ్రాతలు (Storia Do Mogor, Vol. III- p. 183); అనాస ఆకులనుండి తీసిన తెల్లనినార చేపల వలలకు, గాలము త్రాళ్లకు ఉపయోగించును. నీటిపై తేలును; తడి అంటదు; త్వరగా తెగదు; °పండు (ఆం. వాచ., కాంబెల్., మిశ్రబ్రౌ.)

అనాసపనస : చూ. అనాస (అం. వాచ., గో.) అక్కాపచ్చని చిలుకవచ్చె, కొందామా? తిందామా? అంగట్లో పెట్టుకుని అమ్ముదామా' — అనాసపనసపండు'. గోదావరి మండలములో వాడుకలోఁగల ఈ 'పొడుపు కథ' అర్వాచీనమని స్పష్టము.

అనాసపనాస : చూ. అనాస (కోరాపుట్టి).

అవాసు : చూ. అనాస (మిశ్రబ్రౌ).

5.అపొస్తలు (లు) : రూ. అపోస్తులుఁడు. క్రీస్తుముఖ్య శిష్యుఁడు; దేవదూత.—బు. అపోస్తొలు; స్పా. అపోస్తొలు; అపొస్తలుఁడు అనఁగా పంపఁబడినవాఁడు' (యోహాను, అధ్యా. 13); 'ఆ పన్నెండుమంది అపొస్తలుల పేళ్ళివివనగా..' (మత్తయి, అధ్యా. 10) 'ఏసు క్రీస్తు అపొస్తలుడైన పేతురు...'(పేతురు.అధ్యా. 1) అపొస్తలత్వము' (అపొస్తలుల కార్యములు, అధ్యా. 1)

అపోస్తులుఁడు : చూ. అపొస్తలు (కర్నూ.)..... 'అపోస్తులు లోకమునకు వెలుతురు వలె నున్నారు', 'అపోస్తుల చర్యలు'—అని బైబిలు నెల్లూరిప్రతిలో 'అపోస్తులు' అనుమాట, 'లు' వర్ణాంతమగుటచే అది బహువచన ప్రత్యయముగా భ్రాంతిపడుట జరిగినది.

6.అమారు : ఓడలంగరుమోకు, 'నావలంగరులోనున్నప్పుడు కదలకుండనుంచు పెద్ద బలమైన త్రాడు' (ఆంభాచ 624)- బు. అమర్రా మోకు; స్పా. అమర్రా; దే. వి. (శ. ర., ఆం. వాచ.) — హిం. (ఆంభాచ., 593); తాడు (మిశ్రబ్రౌ); చూ అమారు త్రాడు (ఆంభాచ, 618). చూ. అమారు.

అరమర : చూ. అలమారు (శ్రీకా.).

అరమార : చూ. అలమారు (గుం)—బు. అర్మారి.

అరమాలు : చూ. అలమారు '(దుల్బా' అను ఆరోపముక్రింద మిశ్రబ్రౌ. పు. 54, చూ.).

7.అరుగోలా (లు) : ఇనుపకడియము (లు) నావకు రెండు పక్కలను పైకివచ్చునట్లు అమర్చఁబడినస్థలములు; వీనిలో బెజ్జములు పొడిచి 'నేజా' పటాలుఉంతురు. (ఆంభాచ., 624)—బు. అర్గోలా—పెద్ద ఇనుప కడియము; స్పా. అర్గోలా.

8.అర్యా (చేయు) : క్రి. ఓడతెరచాపలుదించు (ఆంభాచ, 624)—బు. అర్రియార్-తెరచాపలుదించు స్పా. అర్రియార్; (బు. లో—అర్, ఈర్,—ఏర్ లు క్రియాధాతు సూచక ప్రత్యయములు. బు. షూవా—వర్షము, షోవేర్—వర్షించు); చూ. ఇస్త్రి.

9.అలవనాతి : రూ. అనవ (సూది), అల్ఫి. గుండుసూది (బ్రౌ. ఇం. తె. 904)-బు. అల్ఫినేతి—గుండుసూది; స్పా. అల్ఫిలేర్.

అలమర : చూ. అలమారు (గుం.).

అలమార : చూ. అలమారు; °బీరువలు—ఇం. అల్మైరాబీరో—అలమరలుండే బీరువాలు (శ. ర. అను.).

10.అలమారు : రూ. అరమర, అరమార, అరమాలు, అలమర, అలమార, అల్మార, అల్మారా, అల్మారు(అనంత., చెంగల్పట్టు). సామగ్రులుంచుటకై గోడలో ఏర్పరిచిన బీరువా, గోడబీరువ—బు. అల్మారి, అర్మారి; స్పా. అల్మారియో; ఫ్రె. అర్మ్వార్—ఇం. శ.ర.అను.వు, III); భారతీయ భాషలనుండి 1878 లో ఇంగ్లీషునజేరిన పదమని శ్రీజి. వి. సుబ్బారావుగారు (Indian words in English, p. 123).

అల్పీ : చూ. అలపాతి (కోరాపుట్టి, విశా., శ్రీకా.) గుండు సూది; °పిన్ను చూ. అల్పీ. రూపనిర్మాణములో ఈ 'అల్పీ పిన్ను' అనునది అగ్గిపిప్పు, గేటువాకిలి, స్లేట్ పలక మొ. వానితో సదృశము. ?—హిం. ఆల్పిన్,ఆల్పిన్

11.అల్మాని : (మిశ్రశౌ.) ఒకానొక జర్మను దేశీయునిచే పోతపోయ బడినదని ఊహింపబడిన రూపాయి నాణెము, ముసుపటిరూపాయి.—బు. అలేమానా, అలేమాన్—జర్మను దేశీయము; ఇర్మాను (King Duarte's Leal Conselheiro) జర్మనుదేశ సంబంధి; స్పా. అలేమానా—జర్మనుదేశసంబంధి., అలేమానీయా—జర్మనీదేశము; ఫ్రె. అల్మళ్ ; కన్నడ. అలేమాని; ఉర్దూ. అల్మానియు—జర్మనీదేశము; బెంగాలి. ఏలేమాన్.

అల్మార : చూ. అలమారు (మిశ్రశౌ.) ఈడ్పులుగల పెద్ద పెట్టె; °కోనేరు' నాలుగుపక్కల మెట్లుగల దిగుడు బావి, తిరుకొళము.

అల్మారా : చూ. అలమారు (కృ., గో., శ. ర., మిశ్రశౌ., MAMP, III, 20) సొరుగులుగల యెత్తయిన కర్రపెట్టె; హిం. (శ.ర. 'అంభాచ.' దిగవల్లి వేంకట శివరావుగారి వ్యవహారకోశము. పు. 240)

అల్మారు : చూ. అలమారు; హిం. (శ. ర., గాలెటి, దిం. వేం. శివరావుగారి వ్యవహారకోశము).

12.అన : (కృ., గుం., గాలెటి, మిశ్రశౌ.) క్రీస్తుశక సూచమగు పదము.—బు. అను (క్రీస్తు) ప్రభువు స్మృతి సూచకముగు శకపరిగణనము, సంవత్సరము; బుడతకీచుల శకపరిగణనములో ఈమాట విరివిగా వాడుక (చూ. గోవా శాసనములు, History of Goa); ఆశో; ఫ్రె. అనే-ఏండు; లాటిన్ anno కు వికృతియని బ్రౌను (బ్రౌ. రి., 115); అన్యదే. అని (అం. వాచ., 256; శ. ర. అను., 98).

13.అరిమాని : ఉ. అర్మాణి (అనంత). పియ్యానిపెట్టె, హార్మోనియము—బు. ఆర్మోనీ, స్పా. అర్మోనియో, ఫ్రె. అర్మోనీ.

14.అర్మదా : (బ్రౌన్, బ్రిటీషు చరిత్రము, ఆంధ్రానువాదము) యుద్ధనావ.—బు. అర్మాడా; స్పా. అర్మాదా—సేన, నౌకాదళము; అర్మా-ఆయుధము; డచ్చి. అర్మద-నౌకా దళము; బెంగాలి. హోరామద్—బుడతకీచుల దోపిడి పీడ; —బు. అర్మాదా—అరబ్బీ 'అల్—మదీ—యు' అని Hobson-Jobson. p. 15.

15.ఇస్త్రి : రూ. ఇస్త్రీ, ఇస్త్రీ (అనంత., కృ., గుం., గో) బట్టలను నిప్పులపెట్టెతో నునుపుచేయుట.—బు. ఎస్త్రిరార్, క్రి. విస్తరించు, వ్యాపించు; చాచు; స్పా. ఎస్త్రిరార్., స. క్రి. లాగు; విస్తరించు; బట్టలను నునుపుచేయు; ఎస్త్రరోన్, వి. లాగుట; ఫ్రె. ఎతిరే, స. క్రి. లాగు, గుంజు;—హిం. (శ. ర., బ్రౌ. రి., గాలెటి, దిం. వేం. శివరావుగారి వ్యవహారకోశము); మల. ఇస్త్రి—హి°. (గుండర్టు, 115); కన్నడ. ఇస్తరి, ఇస్త్రీ—హిం., మరా. (కిట్టెల్, 202) తమిళ. ఇస్తిరి—ఉర్దూ (TL, 373)? సం. స్తృ ధాతుసంబంధి.

ఇస్త్రీ : చూ. ఇస్త్రి (దేశ్యమని., శ. ర. అను.,).

ఇస్త్రీ : చూ. ఇస్త్రి (అం. వాచ.)

ఎసల : చూ. వేసల (దేశ్యమని కాంబెల్, బ్రౌ., అం. వాచ.)

ఏగాత్తా : చూ. అగతమ్మ. 'చెన్నపట్టణములో ఏగత్తా అనే దేవత......' (బ్రౌ. ఇం. తె., 444).

16.ఏలము : రూ. యాలం, వేలము, వేలాం. అమ్మకాలలో నొక విధము; పేకాటలోని ఒకఆట (Auction bridge) (పలనాడు).—బు. లేయ్‌లాం,—హిం. శ.ర., అం. భాచ; అం. వాచ., సూ. వి., దిం. వేం. శివరావుగారి వ్యవహార కోశము; దేశ్యమని బ్రౌ. రి., 201; తమి°., మల. ఏలం—బు.; కాని, దీనిని బుడతకీచుమాట అనుటకు ఉపపత్తులుచాలవు. తక్కిన రోమాన్సు భాషలలోగాని, బుడతకీచునకు సమీప మాతృకయగు 'లాటిన్' లోగాని, ఈమాటగాని, ఏతత్సంబంధి పదసముదాయముగాని కానరాదు; అరబ్బీ. లీలాం—ఏలము, ఇల్—ఇ—లామ్=ప్రకటన—దీనికి మూలము కానగునని బ్రౌను (మిశ్రశౌ., 101).

17.ఏసోబు : రూ. హిస్సోపు. (బై) యూదీయుల సామలత; —బు. ఇస్సోపి; స్పా. ఈసోపు; 1841లో కలకత్తాలో అచ్చయిన పరిశుద్ధ గ్రంథము—సంస్కృతానువాదమువందును 'ఏసోబు' అనియే కలదు.

18.ఒలందా : రూ. ఒలాందా, ఒళాందా, వలందు (బాజా), వలందేజా, వళంద —డచ్చి (జాతి,—దేశము, —భాష) (రంగనాట్. పీఠిక 58);-బు. ఒలందా, ఒలందేష్; స్పా. ఒలందా; ఫ్రె. హొలందె; °దిబ్బ (గాలెటి 130); °పాలెము మచిలీపట్టణములో రజకులెక్కువగా నివసించుపేట.

ఒలాందా : చూ. ఒలందా (మిశ్ర బ్రౌ);—ఇం. హాలండ్ (శ. ర. అను 112); °కమలము డచ్చి పద్ధతిలో చెక్కబడిన వజ్రము; వజ్రములపనకు 'ఒలందా' దేశము ప్రసిద్ధి; °మల్లె ఒకదినుసుపువ్వు; °వాండ్లు బ. వి. డచ్చివారు (మిశ్ర బ్రౌ.).

ఒళాందా : చూ. ఒలందా.

19. ఓకు: దుర్భిణియద్దము (శ. ర., ఆం. వాచ., మిశ్ర బ్రౌ). —బు. ఓకులుష్-కంటియద్దములజోడు; ఓకు-వివరము; ఫుటాకారమ్ము; స్పా. ఓకూలార్-కంటి యద్దము ఫ్రె. ఆకూలెర్; 'ఓకులు' లోని 'లు'ను బహువచన ప్రత్యయముగా భావించుటచే 'ఓకు' సిద్ధించి యుండనగు. చూ. రతులు.

20. కంత్రాటు : పనిచేయుటకు ఒడంబడిక (అనంత)—బు. కంత్రాతు; స్పా. కంత్రాతా - ఒడంబడిక, ఒప్పందము; ఫ్రె. కాన్త్రా; ఇం. కంట్రాక్ట్—ఇం. వి. (శ. ర. 190).

21. కాతోలికు : పోపు అనుయాయులగు క్రైస్తవులశాఖ (బ్రౌ. ఇం. తె.).—బు. కతోలికు; దల్గాదు (పు. 88) 'కథోలికు' అను తెలుగు నుడిని ఉదాహరించినారు; ఆ పక్షమున నది ఆంగ్లభవము.

22. కందీలు : రూ. కానుదీయులు. దీపము, ప్రమిద (నిజామాబాదు)—బు. కందీల్—దీపము; స్పా. కందేలా; కందీల్—చమురుదీపము; ప్రమిద; ఫ్రె. షాందెల్—పాదిరి గుడి దీపము; డచ్చి. కందెలార్—క్రొవ్వువత్తి.

23. కపాతు : రూ. కబాతు. విత్తులు తీసినకోడె; కచ్చితీసినకోడె (మిశ్ర బ్రౌ.)—బు. కపాదు—కచ్చి (విత్తు) తీయుట: కపార్—కచ్చితీయు; స్పా. కాపాదోర్; కాపాదురా—కచ్చితీయుట (బుడతకీచులోని 'p' ఇంగ్లీషులో కంటె న్యూనస్ఫోటనముకలది).

కపాయి : చూ. కబాయి (మిశ్ర బ్రౌ.)

24. కపితాను : రూ. కప్తాను. సేనాని; అధికారి; వ్యవహర్త (రంగరాట్. పీఠిక. 59: రంగా. 2—75). —బు. కపితాను — దళవాయి, పడవాలు; స్పా. కాపీతాన్-దళవాయి: కాపీతానీయా—దళవాయితనము; ఫ్రె. కపీతన్—ముఖ్యుడు; ఏలిక, యజమాని; డచ్చి. కప్టేన్; మల. కప్పితాన్—బు (గుండర్ట్ 204); పరాసుభాష పదమని కొందఱి తలంపు. పదవాఱవ శతాబ్దము నాటికే తూర్పిండియా దీవులలో ఈ పదమునకు వ్యాప్తియున్నట్లు ఆధారము లున్నవి. పదునేడవ శతకమునగాని పరాసువారు రాలేదు. కావున, నిది పరాసు భాషనుండి వచ్చినదనుటకు బలముచాలదు. చారిత్రకముగను, ధ్వనిపరిణామసూత్రము ప్రకారముగను ఈ పదముబుడతకీచు భాషాజన్యమనుట సయుక్తికము.

కప్పా : చూ. కమీజ (కదిరితాలూకా, అనంత.)

కప్తాను : చూ. కపితాను. ఓడకప్తాను (బ్రౌ. ఇం. తె. 147): (ఆం. భాచ. 618).

25. కప్పు : ఒకదినుసు పాదిరి ఉడుపు (క్రైస్తవజన వ్యవహారము)—బు. కాపా—పాదిరి అంగీ: స్పా. కాపా—దుప్పటి, పచ్చడము.

కబచ : చూ. కమీజు (హోసూరు తాలూకా, సేలము).

కబాతు : చూ. కపాతు (మిశ్ర బ్రౌ) °కోడి—విత్తులుతీసిన కోడి. —హిం. (బ్రౌ. రి., 245).

26. : కబాయి: రూ. కపాయి, కబాయీ, కబ్బా, కబ్బాయి, ఖబ్బాయి-తురకలు తొడిగే ఒకచొక్కా; శృంగారార్థము అన్నిటిపైన వేసికొనుచొక్కా' (మిశ్ర బ్రౌ;) దే. వి. అంగీ (శ. ర., కళా. 5—179; దశా. పీఠిక 42) బు. కబైయు — ప్రాచ్యసీమలలోవాడు నిలువుటంగీ(హిం. బ్రౌ. రి., 245; ఆంభాచ., 592).

కబాయీ : చూ. కబాయి (హంస. 5—360).

కబ్బా : చూ. కబాయి. 'చేతులులేని పొట్టికోటు?'—అరబ్బీ (ఆంభా. చ., 591).

కబ్బాయి : చూ. కబాయి. (ద్వి· పరమ., పు. 482).

27. కమాను : అన్యదే. వి. ప్రయాణము (శ. ర., 211; ఆం. వాచ). °పోవు—ప్రయాణముచేయు (బ్రౌ. రి. 247)-బు.కమిన్యార్—పయనించు; స్పా. కమినో—ప్రయాణము; మార్గము; ఫ్రె. కామా—దండయాత్ర;—ఫ్రె.(మిశ్ర బ్రౌ., బ్రౌ.రి., ఆం. భా.వి.)

28. కమిస్సారి : సైనికోద్యోగి. 'కమ్మిస్సారీ దొరలు' (వెన్నపురీ., పు. 75 'కమిస్సారీజనరలు' (పై.రి. 7)—బు. కమిస్సారి; స్పా. కమీసారీ—పోలీసు అధికారి; న్యాయాధిపతి.

29. కమీజ : రూ. కప్పా, కబచ, కవిసె. లోనధరించుచొక్కా; చొక్కా;(విశా., శ్రీ కా.)—బు. కమీజా (Portu. camisa. బుడతకీచులో అజ్మధ్యము (inter vocalic) గా 's' అనులిపి చిహ్నము 'present' లోని 's' వంటి ఉచ్చారణము కలది); స్పా. కమీసా—చొక్కా; కామీసేరియా—చొక్కాలమ్ము దుకాణము; ఫ్రె. కమీజాల్—రైక; డచ్చి. క్రమీజోల్—స్త్రీల కూర్పాసము;—ఇం. (శ. ర.,—ఆం. వాచ.)—బు. (గారెటి); అరబ్బీ ద్వారమున వచ్చిన బుడతకీచు

పదము (MAMP, Vol. III, p. 121); టర్నర్ నేపాలీ నిఘంటువున 'కమిజ్' శబ్దమునొద్ద ఒడతకీచు మూలముగా ప్రదర్శితము (చూ. పు. 75;) మరా. ఖమిస్—బు

కమేల : చూ. గమేళా (మిశ్ర బ్రౌ.).

30.కర్మాయి : కుంకుమ వర్ణము (మిశ్ర బ్రౌ);—బు. కర్మి; స్పా. కర్మేసీ, కర్మీన్;—రక్తవర్ణము; ఫ్రె. కార్మై ('మై' లోని 'ఐ' మామూలు 'ఐ' కంటే వివృత స్వరము; open or low vowel); డచ్చి. కార్మోజి యన్.

31.కలపతి : లప్పము, 'జనపనారను, పీచును కీలులో తడిపి ఓడసందులలో పొదుగుట';(బ్రౌ. ఇం. తె., 156) —బు. కలాఫాతి; స్పా. కాలాఫాతి; అరబ్బీలోని'కాలాఫత్, ఒడతకీచుద్వారమున భారతీయభాషలలో ప్రవేశించినదని Hobson-Jobson, pp. 148, 149.

కవిసె : చూ. కమీజా (కదిరి తాలూకా, అనంత).

32.కాకాతువ్వా : పసుపుపచ్చని జుత్తుగల పెద్ద తెల్లచిలుక (అంభాచ. 619)—బు. కాకాతూ; స్పా. కాకాతూఆ; ఫ్రె. కకతాఎస్; డచ్చి. కకెతొ; 'కాకాతూవా' యను మలయా భాషాపదము అన్నిటికి అసలు మూలమని వేత్తలమతము.

33.కాజా (లు) : బొత్తాము (గుండీ)లు తగిలించుటకు చొక్కా మొ. వాని ఎదపట్టే మొ. చోట్లనుండు కన్నము (లు)(అన్నిమండలములు)—బు. కాజా; స్పా. కాహో—కన్నము; పెట్టె; మరా. కాజేం—బు. కాజా.

34.కాతరుసు: ముదుకకాగితము(మిశ్ర బ్రౌ.)—బు. కర్తూస్ము-ముదుకకాగితము; కర్తాత్ —అనుమతి పత్రము; కాకితము; స్పా. కర్తూచో; ఫ్రె. కర్తూష్; అరబ్బీ. కిర్తాస్—కాకితము; ఒడంబడిక పత్రము.

కానా : చూ. కాను ('కానా గట్టుమీద.......' 'మూడు స్థలాల్లో' అను శ్రీ రావకొండ విశ్వనాథశాస్త్రి గారి కథ; విశా. లో ప్రమరవ్యవహారము.) వంతెన క్రింద నీరు పోవుట కేర్పడిన గొట్టము లేక తూము; వంతెన.

35.కాను : రూ. కానా. 'ఓడతట్టుమీద చేరిననీరు మరల బయటకుపోవుట కేర్పఱచినదారి' (అంభాచ. 627)—బు. కాను—గొట్టము; తూము; జలదారి; స్పా. కాఞో-పాదుగైన గొట్టము; చిమ్మనగొట్టము;గరాటి.

కానుదీయులు : చూ. కందీలు (అనంత) 'కందీలు', 'దీయులు' (= దీవియలు) అను సమానార్థకశబ్దముల కలయిక వలన 'కానుదీయులు' అను రూపమేర్పడి యుండ నగు.

36.కామరా : రూ. కామిరీ. మాలీము, పరంగులు పరుండు గది; ఇది అమరము (ఓడవెనుక భాగము) దగ్గర నుండును (అంభాచ, 627)-బు. కామరా-గది; అర; స్పా. కామారా-ఓడలోని గది; గది; ఫ్రె. షెంబ్ర్-గది, భాగము; డచ్చి. కమెర్; ఇటా. కామెర; ఇం. ఛేంబర్.

కామిరీ : చూ. కామరా (అంభాచ)

కిరస్తానము : చూ. కిరస్తాను (అనంత). క్రైస్తవ ప్రజా సమూహము; ఇట్లే తురకల సమూహము 'తురకాణ్యము'.

కిరస్తానీ : చూ. కిరస్తాను—ఇం. (అంభాచ., 617)° చదువుల -పాశ్చాత్యవిద్యలు; °పిల్ల—క్రైస్తవబాలిక; °పోకిళ్ళు —సనాతనాచార పరాయణులకు నరిపడని పోకడలు; °వేషాలు— పాశ్చాత్యవేషములు, పాశ్చాత్యరీతులు.

37.కిరస్తాను : రూ. కిరస్తానము, కిరస్తానీ, కిరస్తు. విశే. క్రైస్తవమత సంబంధి; కిరస్తానులు; క్రైస్తవులు. బు. క్రిస్తాను; ఫ్రె. క్రేత్యే; దల్గాదు గ్రంథమున 'క్రిస్తన్ను', 'కిరస్తవను' అనునవి తెలుగు రూపములుగా ఉదాహృతములు (చూ. పు. 128).

కిరస్తు : చూ. కిరస్తాను (మిశ్ర బ్రౌ.)

38.కిరూబు : దేవదూత (బ్రౌ. ఇం. తె. 169).—బు కెరూబిమ్— దేవదూత; స్పా. కెరూబిన్; ఇం. చెరబ్; హీబ్రూ. కెరూబ్; అరబ్బీ. కిరుబ్; పారసీ. కరూబి; క్రైస్తవమునకే పరిమితముగావున అరబ్బీ, పారసీ మాటలను మూలముగా చూపుటపొసగదు.

39.కుదీలు : రూ. కుదేలు. 'కాకితముల ఆట (పేకాట)లో ఆయిదుపట్లుపట్టుతాననిచేసే ప్రతిజ్ఞ'(మిశ్ర బ్రౌ.) —బు. కొదీల్యు, కొదీలి—పేకాటలోని ఒక పరిభాషాపదము; 'ఓంబ్రి' అను ఆటలో ఆటగానికి ప్రతికూలముగా గెలుపు కలుగుట.

కుదేలు : చూ. కుదీలు (బ్రౌ. ఠి. 294) 'ఆదెబ్బతో వాడు కుందేలయ్ పోయాడు'

40.కుమందమన్ : దళవాయి; పైనికోద్యోగి—బు. కొమందంతి; ఫ్రె. కోమాందాం; —ఫ్రె. (మిశ్ర బ్రౌ); కుముందము ఫ్రెంచి పదమని వీరభద్రరావుగారు;

41.కుంపాసు : దిక్సూచి(బ్రౌ.ఇం. తె. 205)-బు. కుంపస్సు; ఇం. కంపాస్.

కుంపిణీ : చూ. కుంపిని—ఇం. (అంభాచ., 615).

42.కుంపిని : రూ. కుంపిణీ, కుంఫిణీ, కుంఫిణీ, కుంభిణీ; పాశ్చాత్య వర్తక సంఘము; ఆంగ్లేయ ప్రభుత్వము వారు; 'పుదుచ్చేరి కుంపిని' (రంగరాట్. పీఠిక 107).—బు. కుంపన్యి; స్పా. కొంపనీయా; ఫ్రె. కోంపేఞీ; మల. కుప్పిణ్ణి, కుంబణ్ణి—ఇం. కంపెనీ (గుండర్టు, పుటలు, 265 ,266).

**కుంఫిణి** : చూ. కుంపిని (మిశ్రశా.)

**కుంఫిణి** : చూ. కుంపిని (Annals of Hande Anantapuram, p. 99.)

**43.కుంబాద్రి** : జ్ఞానపిత; శిశువుపెరిగి పెద్దయయి క్రైస్తవమత ధర్మాను సారముగా ప్రవర్తించుటకు గాను నామకరణ సందర్భమున పూటపడువాడు; 'జ్ఞానతండ్రి' యని కర్నూలు మండలము వాడుక. -బు. కుంపాద్రి; స్పా. ఖుంపాద్రే-జ్ఞానపిత; మిత్రుడు; ఇరుగుపొరుగువాడు.

**కుంభిణి** : చూ. కుంపిని (మిశ్రశా.)

**కుకిని** : చూ. కుసిని (గాలెటి, MAMP, III,, 223) °వాడు-వంటవాడు (మిశ్రశా)

**44.కుసిని** : రూ. కుకిని. వంటయిల్లు; °వాడు. అన్యదే. వి. హీనజాతులకు వంటచేయువాడు (ఆం. వాచ.). —బు. కుజిన్యా; కోజిదు-వండబడిన; స్పా. కోసినా —వంటయిల్లు; కోసీవిల్లా—చిన్నవంటగది; ఫ్రె. క్విజీన్—వంటయిల్లు; క్విజీనే-వంటవాడు; ఇటా. కుసినా - వంటయిల్లు; ఫ్రె. (మిశ్రశా. MAMP, III, 223; ఆం. భా. వి; ఆం. భాచ). అన్యదే. (ఆం. వాచ.); తమిళ. కుసిని—వంటవాడు.—బు.

**45.కూర్వ** : వాడ (ఓడ) కూర్పుకు వేసే వంకర కొయ్య; వంకరకొయ్య (మిశ్రశా.)-బు. కుర్వా-ఓడవంపు కొయ్య; స్పా. కూర్వా-వంకర; వంకరగల; కోర్వ-మోకాలివంపు; వంకరైన; ఓడపక్కల బిగించు వంపుబద్ద; ఫ్రె. కూర్బ్—వంకర; వంకరయిన; ఇం. కర్వ్.

**46.కొన్ఫ్రేలు** : మంత్రాంగసభ; సభాస్థలము; 'జాతికొన్ఫ్రేలు' (రంగరాట్. పీఠిక 58).—బు. కొన్ఫ్రేర్య-మంత్రాంగము; స్పా. కొన్ఫ్రెరియో—పాదిరిగుడికి సంబంధించిన సంఘము; ఫ్రె. కొన్ఫ్రెర్య్; బుడతకీచుల వలన యగు 'లైమర్' దీనిలో 'కొన్ఫ్రేలు' శబ్దము ప్రచురముగా నున్నది. (Port- Voc- p.116),

**కోప** : చూ. కోపి. 'కోప' ఇది ఇంగ్లీషుమాట (బ్రౌ. ఇం. తె. 262).

**47.కోపి** : రూ. కోప. పాదిరిగుడులలో వాడుగిన్నె (మిశ్రశా); —బు. కోపు-పంచపాత్ర, గళాసు; స్పా. కోపా-సారాయపు గిన్నె; ద్రవద్రవ్యమును కొలుచు ఒక పరిమాణము; ఫ్రె. కూప్; మల. కోప్పు;-బు. (గండర్ట్)

**48.కోబి** : రూ. కోసు, గోబి. క్యాబేజి (ఆంభాచ.)—బు. కోవి.

**49.కోమాను** : ఆజ్ఞ, ఉత్తరువు—బు. కోమందు; ఫ్రె. కోమాండ్;

**50.?కోర్జ** : ఇరువది గుడ్డముక్కలు; జవళీ అంగడులలోని పరిభాష (మిశ్రశా.)—బు. కొర్జా-'ఇరువది' యనుటకు వర్తకుల పరిభాష.

**కోసు (గడ్డ)** : చూ. కోబి. (అనంత., చిత్తూ., నెల్లూ.) -ఇం. Cabbage (బ్రౌ.ని.) తమిళ, కన్నడ. కోసు.

**51.కోస్తా** : సముద్రతీరప్రాంతదేశము; 'ప్రఖ్యాతంపు కోస్తాల' (చెన్నపురీ. పు. 25) °జిల్లాలు, °వర్తకము —బు. కొష్తా-సముద్రతీరము; స్పా. కోస్తా—తీరము, ఒడ్డు;—ఇం. (శ. ర., ఆంభాచ.)

**52.క్రిస్మ** : జ్ఞానస్నానము—బాప్తిస్మము—న వాడు పవిత్ర తైలము. 'ఒక తరహా తైలము; దీనిని రోమన్ కతోలికు వాండ్రు అవసానకాలమందు ఆయా అవయవములలో చరుముదురు' (బ్రౌ. ఇం. తె. 173.)—బు. క్రిజ్మా; ఇం. క్రిజ్ మ్; చర్చికి సంబంధించిన పదజాలములో చాలపాలు బుడతకీచు భాష నుండి సంక్రమించినదని సిద్ధాంతీకరించుట కారణముగా దీనిని బు. గా పేర్కొన నయినది. ధ్వని పరిణామసూత్రముల ప్రకారము ఆంగ్ల భవమనియు ననవచ్చు.

**53.క్రీస్తునుడు** : కిరస్తువాడు, క్రీస్తుమతస్థుడు (మిశ్రశా.) చూ. కిరస్తాను.

**54.క్రీస్తు** : కిరస్తానీ మత ప్రవక్త; 'క్రీస్తు శబ్దమునకు అభిషిక్తుడని యర్థము.' 'క్రీస్తు అనబడిన యేసు పుట్టెను' (మత్తయి. అధ్యా. 1); 'మమ్మును రక్షించ్చేకర్త అయిన యేసుక్రీస్తు యొక్క శుభ సమాచారము' (దేవునియొక్క సమస్తమైన వాక్యము, 1812 లో శ్రీరామపురములో క్రైస్తవమత ప్రచారకులు ప్రచురించిన బైబిలు); 'లూకాచేత వ్రాయబడిన యేసుక్రీస్తు శుభసమాచారం' పి. పి. బ్రౌను 1838;...'యీ గ్రంధము... యేసుక్రీస్తుయొక్క మాతవ నిబంధనయైయున్నది మొ.....' (British and Foreign Bible Society/Madras, 1818); ఖ్రీస్తుసంబంధమైన (మిశ్రశా.); °జయంతి — ఏసుక్రీస్తు పుట్టిన పండుగు; °శకము —హూణశకము;—బు. క్రీస్తు; ఫ్రె. క్రీస్త్; ఇం. (ఆంభాచ.);—గ్రీక్ (బ్రౌ. ని. 334).

**క్రీస్తువు** : క్రీస్తుమతానుయాయి; రోమన్ కాతలిక్ శాఖీయులు క్రీస్తువులు, ప్రొటెస్టెంట్ శాఖీయులు క్రైస్తవులు—అను విభాగము వ్యవహారములో కలదు (కర్నూ., నెల్లూ.); 'ఆరంభక్రీస్తువులు' క్రీస్తుమతానుయాయులలో మొదటివారు 'సత్యక్రీస్తువులు' నిజమయిన క్రైస్తవులు.

క్రైస్తవులు : క్రీస్తుమతామయాయులు (నానా. 232) (శ. రి., శ. ర. అను)—ఇం. (ఆంభాచ).

ఖబ్బాయి : చూ. కబాయి 'ఖబ్బాయి దట్టీలు.......'పెమ్మసాని తిమ్మానాయునిపై చాటువు.

గడంగు : చూ. గిడ్డంగి. (అనంత). సరకులు నిలువయుంచెడి పెద్దకొట్టు; సారానిలువయుంచెడి కొట్టు; కన్నడ. గడంగ (గు)—మదిరాగృహము (కిట్టెల్ 519).

గబేలా : చూ. గమేలా (గుం.)

గమాతు : చూ. గామత్తు (మిశ్రశా.).

55.గమేలా 1 : 'ఓడ స్తంభములో మనిషి నిలిచేట్టుగా కట్టియుండే అంతస్తు' (మిశ్రశా)—బు. కమేరా-ఓడగది, అర; స్పా. కామారా.

56.గమేలా 2 : ఉ. గఁవేలా; రూ. గబేలా. బేల్దారి పనివారు వాడు ఇనుపగంప; ఇనుప పళ్ళెరము. (గో., విశా., శ్రీకా.)—బు. గమేలా-కొయ్యతొట్టి, కొయ్యసానిక; స్పా. గామేల—పెద్దగొయ్యగాబు; ఫ్రె. గమెల్—భోజన పాత్రము.

57.గామత్తు : రూ. గమాతు. ఓడు, చిల్లి ఊట (మిశ్రశా.)—బు. గామోతి—చిల్లిపడుట, కాఱుట; స్పా. గోతియో; ఫ్రె. ఫీత్; మల. కమ్మత్—చిల్లి, ఊట—బు. (గుండర్టు 206).

58.గావాయి : ఓడకొనస్తంభము; పైతాంగావాయి—ఏకాండముగా చేయబడిన ఓడస్తంభము (మిశ్రశా.)—బు. గావియా; స్పా. గావీయా; గుజ. హిం. గావీ; అరబ్బీ. గబియ; మల. కప్పప్పాయి;—కప్పల్‌పాయి (గుండర్టు, పు. 204).

59.గిడ్డంగి : రూ. గడంగు, గుదాం, గోదాం, చెఱిసాల. 'గిడ్డంగిన వేయించి' (రంగరాట్. పీఠిక. 58; మిశ్రశా; శ. ర., కాంబెల్) కొట్టు, గది, సరకులుంచి అమ్మెడియిల్లు—బు. గుదామ్—అన్యదే. (శ. ర.); దేశ్యమని కాంబెల్ (చూ. పు. 203); జావానుండి వచ్చి వారిచే కొని తేఁబడిన మలయా భాషాపదమని గాలెట్టి, పు. 130; మల. కిడజ్జా-చెఱిసాల; సరకులు నిలువ యుంచెడి కొట్టు, కొటారు—బు. (గుండర్టు, పు. 247) కన్నడ. గిడంగి, గిడ్డంగడి, గిడ్డంగి.

గుదాం : చూ. గోదాం (శ్రీకా.)

60.గుళాపు (లు) : అలంకారార్థము కట్టు రంగురంగు గాజు గోళీలు(అనంత)-బు. గ్లోబు; స్పా. గ్లోబో; ఇం. గ్లోబ్

గొయ్య (పండు): చూ. గొయ్యా (పండు) (గాలెటి.)

61.గొయ్యా (పండు) : రూ. గొయ్య (పండు), గోవ, గోవా (పండు). (చిత్తూ, చెంగల్పట్టు); జామపండు; గొయ్యాచెట్టు జామ(MAMP III, 333)—బు. గొయాబ; స్పా. గూయాబా (మెక్సికో దేశపుపండు); ఫ్రె. గొయావ్; ఇది అమెరికా ఖండమునకు విసర్గమయిన పండ్లమొక్క; 'గుయావ' అని బ్రజీలు దేశీయులవాడుక. జామ ఫలములు 'హంసవింశతి' నాఁటికేకలవు (హంస 4—134); బుడతకీచులచే ఇండియాకు కొని తేఁబడి విస్తారముగా పెంచుచున్న పండ్లమొక్క (MAMP. III 333); 'మెక్సికో దేశమందలి 'గొయ్యా' పండు స్పెయిన్ద్వారా తెమఁగువఁ జేరినది' (ఆంభాచ. 618) అమ్రాఁతకు శ్రౌనుఆధారము( శ్రా. రి. 388); కన్నడ. కొయ్యా, గోవ —స్పాన్ — మెక్సికన్ (కిట్టెల్,488); మల. కొయ్యా; తమిళ. కొయ్యా ప్పళమ్—జామపండు— బ్రెజిల్(TL, 1155); చిత్తూ. చెంగల్పట్టులలో ఈమాట ఉనికికి హేతువు తమిళభాషా ప్రభావము.

గోదా : చూ. గోదాం. కార్యరంగము; వివాదము; పోట్లాట (కృ. గో.).

62.గోదాం : రూ. గుదాం, గోదా చూ. గిడ్డంగి. సరకులు నిలువయుంచెడి కొటారు (కృ. గో.)—మలయా (శా. ఇం. తె. 534).

గోబి : చూ. కోబీ (మహబూబ్ నగరము)

గోవ (చెట్టు) : చూ. గొయ్యా (పండు) (MAMP, III. 333); కన్నడ. గోవ, గోవగిడ.

గోవా (పండు) : చూ. గొయ్యా (పండు) (మిశ్రశా.).

63.గ్రాది : కిటికి కమ్ములు; ఇనుపకటకటాలు, కటాంజనము (మిశ్రశా); ఇనుపగ్రాది. ఇనుపకటాంజనము (శా. ఇం. తె. 451)-బు. గ్రాది-ఇనుప చువ్వల వరుస; స్పా. గ్రాదా, గ్రాదో-మొట్లు; బంగాళీ మండియని మిశ్రశా. 31; (ఆంభాచ. 620)

చపాతు : చూ. చప్పాతి (కళ్ళి) (శా. రి. 405).

64.చప్పాతి (కళ్లి) : రూ. చపాతు. నాగజెముడు, Opuntia dillenii (అనంత.); చపాతివలె ఉండెడి కళ్ళియని కొందరి వ్యుత్పత్తి. కాలిఫోర్నియా ద్వీపకల్పము (ఉత్తర అమెరికా) నుండి 1786 ప్రాంతముల తెచ్చిన ముండ్లకంచెమొక్క(Flora of Madras I. 387)—బు. సపాతు-పాదుక; చెప్పు; ఫ్రె. సబో-కొయ్య పాదుక.

—చెయ్ : చూ. చెవి; తాళంచెయ్ (కృ., గుం., గో.) అను సమస్తపదములోనే ప్రయుక్తము.

—చెయి : చూ. చెవి. తాళపుచెయి; బీగము; (శా. 354).

—చెయ్యి : చూ. చెవి. బీగము; 'తాళపుచెయ్యి' (శా.రి. 429)

65.చెవి : రూ.—చెయ్,—చెయి, చెయ్యి,—చేయి, శావి.బీగము. వైకృతమని శ. ర., 'పరలోక రాజ్యము యొక్క

తాళపుచెవులు నీకిచ్చెదను' (మత్తయి. అధ్యా 16;) 'జ్ఞానమును తాళపుచెవిని ఎత్తికొని పోతిరి' (లూకా. అధ్యా. 11); తాళపుచెవి (బ్రౌ. 410); తాళముచెవి; **A key is more usually called** బీగపుచెవి (బ్రౌ. 616); బీగము చెవి (బ్రౌరి., 344); బీగము చెవులగుత్తి (పైడి; 132); చెవిమూర్కు మూనె; తాళం చెవులు;—బు. షవి; ఫ్రె. క్లే.

—చేయి : చూ. చెవి 'బీగంబు చేయిచే బీగముల్ దెఱచి' (ద్వి· పరమ. పు. 319); తాళంచేతులు—బహువ. (కృ., గుం., గో.)

జనలు : చూ. జన్నలు (చెంగల్పట్టు) 'బహుళః—జిల్మిల్ కిటికలు' (మిశ్రబ్రౌ.).

జనార్ల : చూ. జన్నలు. జనార్లగూడు (అనంత.).

జనాలు : చూ. జన్నలు (బళ్ళారి).

66.జన్నలు : రూ. జనలు, జనార్ల, జనాలు; 'జన్నల్' (ఆం. భా. వి., 608)—బు. జన్నెల—చిన్నతలుపు; జనెల—కిటికి; తక్కిన రోమాన్సు భాషలలో వివి వ్యాఖ్యము. గవాక్ష గృహాక్ష జాలక వాతాయనములు సంస్కృత పదములు. సొరణములు, సొరణ (గండ్ల) సం. సొరాయన (= సూర్యపథము),—ప్రా. సొరాయణ, సొరాణ, తె. సొరణ (ము) కావచ్చు; (సం. భోజన——ప్రా. భోయణ, భోణ— తె. బోనము—వలె); కిటికి (కీ) హిందీ 'ఖిడ్కీ' పదజన్యము; 'విండో' ఇంగ్లీషుమాట; 'జన్నలు' బుడతకీచులది. మఱి ప్రాచితెలుఁగులకు కిటికలు (కిటుకులు?) తెలియ నట్లే కదా:

67.జామొరిన్ : కోళిఖోడు పాలకుని పట్టపుపేరు. 'సాము ద్రిన్' శబ్దము 'జామొరిన్' అయినదని గుండర్టు; (గుండర్టు; also, MAMP. Vol. III, P. 1042); 'స్వామిశ్రీ'—సామితిరి, సామూతిరి; 'నంబూదిరి', 'అక్కతిరి', 'పొర్నత్తిరి' మొదలగు ఉన్నతకులముల పేరులలోని చివరిభాగము 'శ్రీ' శబ్దభవమగు 'తిరు'కు సంబంధించినది. (J. A. **Thorne, Royal Titles in Malabar, Appendix II (c) to 'Book of Duarte Barbosa).** 'స్వామిశ్రీ' యనఁగా రాజాధిరాజు అని యర్థము. 'సామూరి', 'సామూతిరి'కి వికృతి. 'సామూరి' యే బుడతకీచుల నోటఁబడి 'జామొరిన్' అయినది; అదే 'జామొరిన్'గా మనకు పరిచితము.

68. జాలపు (గుండ):—విరేచనకారియగు మందు (ఆంభాచ.) —బు. జలాప. మెక్సికోలోని 'Xalspa' అనుపట్టణమునుండి ఈపేరు సిద్ధించినదని ఊహ. డచ్చి. జల్ఫ—పైపూఁతమందు.

69. జెంతు:—తెలుఁగువాఁడు. తెలుఁగుభాష—బు. జెంతియు; —క్రైస్తవేతరుఁడు; అవిశ్వాసి; స్పా. జెంతీల్—క్రైస్తవేతరుఁడు. బుడతకీచుల వ్రాఁతలలో 'జెంతు' పదము హిందువులు అను నర్థమున ప్రయోక్తము. తెలుఁగను పరిమితార్థమున ప్రయోక్తమగుట ఇంగ్లీషు రికార్డులయందే. విలియం బ్రౌను తన నిఘంటువునకు వ్రాసిన ఉపోద్ఘాతములో తెలుఁగుభాష అను నర్థములో 'జెంతు' మాటను పలుతడవలు వాడినాఁడు.

70. తంబాకు:—రాగి, తుత్తునాగము కలిసిన ఒక మిశ్రలోహము. పొగుపా (మిశ్రబ్రౌ).—బు. తంబాకా—ఇండోచైనాలో తయారగు రాగి తుత్తునాగము కలిసిన మిశ్రలోహము; మలయా. తంబగం; ?సం. తామ్రక శబ్దభవము. 'అథ తామ్రకప్ శుల్బం మ్లేచ్ఛముఖం...' అని అమరము. చెం—, చెన్ను, చెంబు (=రాగిపాత్ర) లకు సంబంధించినదో?

71. తారము:—'కట్టలు తూచడములో గోనె, దారము మొదలైన వాటికి గాను తోసి యిచ్చేటిది. (మిశ్రబ్రౌ.) —బు. తారా—తూనికత్రోపుడు; స్పా. తారా; ఫ్రె. తర్; ఇం. టేర్; డచ్చి. తర్ర; అరబ్బీ. తర్హా.

తురుపు:—గుర్రపుదండు —బు. త్రూప్—సైనిక దళము.

తువాల(—లా—లు) : ఉ. తుఁవాల. రూ. తువ్వాల (—లా—లు). తుండుగుడ్డ (మిశ్రబ్రౌ.); '...యేసు... ఒక తువాలు తీసికొని నడుమునకు కట్టుకొనెను.....(యోహాను, అధ్యా.13); '.... తువాలుతో తుడుచుటకును.....' (పైడి); తుండువస్త్రమని వెల్నాల్మిప్రతి. —బు. తోవాల్యు; స్పా. తోవల్ల; ఫ్రె. తువ్వాయ్యే; ఇటా. తొవా లియోలో; కన్నడ. తువాల్—ఫ్రె. (కిట్టెల్ — 735); మల. తువాల—బు. (గుండర్టు 473); తమిళ. తువాలై—బు. (TL, 1996); సింహళీలోని 'తువాయ' ఫ్రెంచి 'తువ్వాయ్యే' శబ్దభవము; Port· Voc. లో తువాలా గుట్ట (పు. 346), తువాలాగుత్త (పు. 505) యని తప్పుగా అచ్చుపడినది.

తువ్వాల (—లా; లు.): చూ. తువాల (కృ.) టువ్వాలు (-ఇం.) అనంతపురము.

74.దినమార్గ : దేనుజాతి; వారి మాతృభూమి.'ప్రాంసు హింగ్లీషు దినమార్గ యొలందా..... (రంగరాట్....పీఠిక, 58): డెన్ మ్యారు (ఏనుగుల వీరాస్వామయ్య (క్రీ. శ. 1780—1836) కాశీయాత్రా చరిత్ర. పు. 268)—బు. దినమార్క—

డెన్మార్కు; దినమార్కిష్—డేనులు; స్పా—దినమర్కా—డెన్మార్కు; ఫ్రె. డెన్‌మార్; బెంగాలి. దినెమార్.

75. నొవేనా:—తొమ్మిది రోజులపూజ (క్రైస్తవ పరిభాష)—బు. నోవేనా; నోవి—తొమ్మిది. నోవెంతా—తొంబది. నోను—తొమ్మిదగు; స్పా. నోవేనా.

76. పటాలము:—రూ. పటాళము, పతాను. సైనిక దళము, దండు (మి.శ.కో.). ('........ఇటలీ పటాలము.....' (అపొస్తలుల. అధ్యా. 10)—బు. బతాల్లియం; స్పా. బాతల్లోన్; ఫ్రె. బతయ్యాం; వైకృతమని శ. ర., మూల రూపమేదో శ. ర. కారులు చూపలేదు. వైకృత దీపిక యందీ పదమేలేదు;—ఇం. (మిశ్ర కో.,..ఆంభాచ); —హిం. దిగవల్లి వేంకట శివరావుగారి వ్యవహార కోశము. పు. 254.

పటాళము: —చూ. పటాలము '.......పటాళముల్...(చెన్నపురీ. పు. 26.)

77. పంటాల్లము:—ఉ. పంటాల్లం. బిగుతయిన ఇజారు (కృ. గో. విశా)—బు. పంతలోనా; స్పా. పంతాలోన్స్. ఫ్రె. పాంతలో; ఇం. పాంటలూన్—ఇం. (ఆంభాచ).

పతాను:—చూ. పటాలము (బందరు).

పపయ:—చూ. బొప్పాయి (మి.శ.కో.)

పప్పళము:—చూ. పొప్పళి (మి.శ.కో.)

పప్పళి:—చూ. పొప్పళి. వస్త్రమునందలి చిత్రవర్ణవిశేషము; చిత్రవర్ణవస్త్రవిశేషము. (శుక.1—148. ఆంధ్రా. 2—154); °పచ్చడము (పాంచాలీ—3—77); దేశ్యమని శ. ర., ఆం. వాచ.

పప్పాయ (పండు)—చూ. బొప్పాయి (మి.శ.కో.,గాలెటి).

పప్పళి:—చూ. పొప్పళి; °చీర (మి.శ.కో.); °బట్ట (కో.ఇం. తె.).

78. పయాలు : అరుగు, తిన్నె; వేదిక (మి.శ.కో.)—బు పాయాల్—పంచటరుగు; తిన్నె; స్పా. పోయోరాతి అరుగు; ఇం. ప్యల్ (1873)-పంచటరుగు (దక్షిణ భారతదేశభాషలు — బు, G. V. Subbarao, Indian Words in English p. 130); ఆంగ్లో ఇండియానులోని 'పయల్'—బు., పాయాల్. (Hobson-Jobson, p. 703); పయల్ (pial; Anglo-Indian, గాలెటి, పు. 20.)

79. ? పరంగి:—పాశ్చాత్య జాతి (హంస. 1—231); ముఖ్యముగా బుడతకీచుజాతి; °కత్తులు (హంస. 5—360); °కాయ—బొప్పాయికాయ (అనంత), పర్యా. బొప్పాయి; °కొండ—శాంతోము కొండ (చెన్నపురీ, పు. 11.); °పేట(కువల 5-91); °పేట, °పేట వరహా, °మనిషి, °ముదాను (హంస, 4—427); °వరహా-ఒక నాణెము; °పరాంగులు—పరంగి స్త్రీలు(చెన్నపురీ. పు. 59); °వాడు-సంకర జాతియుడు; (Asiatic Journal, p. 445. 1823) °వెధవ-ఒక తిట్టు; సోమరి (విశా...శ్రీకా.); పరంగీలాగి; పరంగుల్ (చెన్నపురీ పు. 59); 'పరంగుల తోడి నెయ్యమున' (శుక. 1—196); పరంగులు (చెన్నపురీ. పు. 53); 'పరంగి' శబ్దము తొలుత 'బుడతకీచులు' అను పరిమితార్థముననే ప్రయుక్తము.

'And when he heard this he said that such man could be no other than the Frances, for by this name they call us in these parts' (Roteiro da Viagemde, p. 99, 1838;)

'Pointing out that since the Portuguese-Frangues, as they call them-were so powerful it would be no wonder if they enter this port...('Duarte Barbosa, Livro, p. 248.)

మల. పరంగిమావు, పోర్చుకీ మావు—జీడి మామిడి; తుళు. పెరెంగిపెలకాయి—బొప్పాయికాయ; కన్నడ. పరంగి హణ్ణు-బొప్పాయికాయ;—మొదలగునవి 'పరంగి' శబ్దమునకు బుడతకీచులతోగల అవినాభావ సంబంధమును వెలార్చునవి;—హిం. (ఆంభాచ); వై. వి. (శ. ర., ఆంవాచ); వైకృతదీపికలో లేదు.

80. పరంజ:—రూ. పరంజా, పరంజా. ఇల్లు కట్టునపుడు పనివారల కొఱకు కొయ్యలతోఁ గట్టిన కట్టడము, పారువ—బు. ప్రాంష్—పారువ; కొంకణి, గుజ. పరాంచ్; మరా. పరాంచి; తుళు. పరెంజి; వై. వి. (శ. ర., ఆం. వాచ); కాని వైకృత దీపికలో ఈ పదము కానరాదు; —హిం. (ఆంభాచ.)

పరంజా:—మ. పరంజి (కృ. గో.) °గూడు, °బొక్క (ఆం. వాచ) పారువ; కొయ్యలుంచెడి గోడ కన్నము.

పరంజా:—చూ. పరంజ (గుం.)

# చరమ గీతము

శ్రీ బొడ్డు బాపిరాజు

తొలగించండీ పువ్వులు
కలిగిస్తున్నాయి బాధ నాకు
పువ్వుదండలు—పెరిగిపెరిగి మేరువయ్యె
పూవులు కావివి—కటికిరాళ్ల ప్రోవులు
కదిలించండీ కటికిరాళ్లు
అదిమేస్తున్నాయి నన్ను.

నే నిప్పుడు కా నా తొలినాటి వయశ్శాలిని;
లే దనిలం, లేదు జలం, లేదు రశ్మి,
యీ శరీర మే కొంచెము సహియింపగ లేదు లేదు!
మరువ వలదు—నే నిప్పుడె
అమ్మవొడిని అనురాగపు పసికందును
సురిగి సురిగి కరిగిపోదు కడు సులువుగ

కదలండీ యోచించక—
వెలువడితిని తొలిప్రొద్దుకు మునుముందే
ఎత్తుటలో ఎగిరిపోయె సంజకాంత!
ఎందుకు నన్నాపుతారు యిట్లాగున త్రోవలోన?

చాలసేపు నిలిచి నిలిచి
సాగిం దాగుతూనే పూలరథము—
మలుపులోన—పువ్వులంగడివద్దను బేరం రద్దీ
లేస్తూ ఎవరిముఖం చూశాడో ఆ అబ్బి!

సరిగ్గా నే ననుకున్నట్లే
అన్నీ జరిగాయ్ అవే అవే
అగరొత్తులు—పన్నీరూ—పూలదండ—లూరేగుట—

తెల్లవారగానే యిక సాగుతుంది సభా గిభా—
విరిదండల మెడను వ్రేలు చీట్లపైన పేర్లు తప్ప
అన్నీ జరిగాయ్ అనుకున్నట్లే.
అందరి హృదయా లార్ద్రము లీ తరుణంలో.
ఔను యిదే సమయం మరి
కొంచెం చెయిచాస్తే మట్టిఖర్చు వెళిపోతుందీ.

చినిగి చీకు దుస్తులలో
పాడిపోయిన కన్నులలో
పండ్లు కరచి పొట్లంలా
కూర్చున్నా డొక మూల నొదిగి నా తనయుడు
మూఢుల్లా వున్నాడెక్కడో!
ఛిచ్ఛీ! వీడా అయేది వీరుడు?
ఇపుడిప్పుడే చలికాలం మొదలైనదో లేదో మరి
యిప్పట్నుంచే వొణికిపోతే యిక గడిచే దెల్లాగో?

* * * *

పూలచేత తేలికగా అసత్యం పలికిస్తాడు మనిషి.
అందుకనే పువ్వులంటే అసలిష్టం లేదు నాకు-
వాటికంటె ప్రియం చాల వహ్నిశిఖావిస్ఫులింగమాల.
అవి ఎవ్వరి మేలుముసుగులు కావెప్పుడు!

ఇట్లాగే అవుతుందని నాకు తెలుసు,
ప్రేమోత్సేకం పొంగి పొర్లుకొస్తుందని నాకు తెలుసు,
ఏ హృదయంలో ఏ విధాన నెలకొన్నా
అది నా ప్రేమే-నాదే-నాదే-అనవరతం!
ఎన్ని నిశీధుల కన్నార్పక చూశానో
ఎప్పుడెలా ప్రభాత మవుతుందో అని—.
తిమిర రహశ్ఛేదనలో తిరిపోయె దినము లన్ని.
ఒక్కదినం ఒక్కక్షణం సేపయినా,
విశ్రమించకుండ-జీవితసారమ్ము పిండి

నింపినాను హృద్భాండమ్ము ఖాండమ్మును;
ఉవ్వెత్తున పొంగిపోవుచున్నది నేడది.

మాటలతో కేవలమ్ము మనస్తృప్తి చెందలేను-
ఎచటినుంచి వస్తున్నవో? ఎచ్చోటికి వెళుతున్నవో?
ఈ మాటలన్ని--
ఆ మాటల తొలిపాదులలో—ఆ పేరుల తుదిమజిలీలో
పృథ్వీ జల వాయు పథాల్లో
కలిసిపోవుటకు కాంక్షిస్తున్నా.

భుజం మార్చుకోండి
కదల్లేని కట్టెను నన్నెత్తుకపోండి యిక-
సుందరాగ్నిశిఖాస్ఫులింగ మొకటే
మరపించును నా పువ్వుల బాధనమస్తం.

—సుభాష్ ముఖోపాధ్యాయ్ బెంగాలీ అనుకృతి.

# శ్రీనాథుని పాకనాటి కాల్పట్టణము

### శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

'శ్రీనాథుని జన్మస్థానమేది ? అను విషయమున తల కొక రీతిగా సిద్ధాంతములు బయలుదేరుచున్నవి. కాని, అతడు స్వయముగా తెలిపిన వాక్యములను బట్టి ఎక్కడివాడగు ననుట భావ్యమో నాకు తోచిన కొన్నిమాటలు తెలిపెదను. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బహుపరిశోధనము గావించి, శ్రీనాథుని జన్మస్థలము మచిలీపట్టణముదగ్గర నుండిన 'కాలీ పట్టణము' అని నిష్కర్షచేసి తెలిపి యున్నారు.

అచట ప్రభాకరశాస్త్రిగారు కాల్పట్టణ మనునది నెల్లూరు దగ్గరనుండిన కృష్ణాపురము (? కృష్ణా పట్టణము) గాని బందరు సమీపమున నున్న కలుపటము అనునదియు గాని కాక, 'వారిధితటీ కాల్పట్టణాధీశ్వరున్—గొల్చు మా యనుగుం దాత ప్రదాత శ్రీ కమలనాభామాత్య చూడామణిన్—' అను శ్రీనాథుని భీమేశ్వరపురాణ వాక్యమును బట్టి సముద్ర తీరము నంటియున్న కాలీపట్టణము అను గ్రామమే, కావలయునని 'శృంగార శ్రీనాథము' అను గ్రంథమున 7—10 పుటలలో చర్చించి తెలిపియున్నారు.

* * *

' .... తాత కమలనాభు డగుటచేతనే పితామహుని పేర మనుమడు శ్రీనాథుడై యుండునని యూహింప వచ్చును.

'ఆనాడు సముద్రతీరమందున్న పట్టణములు అనునవి అన్నియు ఓడరేవులే .... మచిలీపట్టణము, కాలీపట్టణము, .... కళింగపట్టణము, మొదలైన వన్నియు తూర్పు సముద్ర తీరము నంటియున్న ఓడల రేవుపట్టణములు. అట్టి వానిలో ఒకటి యీ కాలీపట్టణము. ఇది నేటి పశ్చిమ గోదావరిజిల్లాకు చెందిన తణుకు, భీమవరము మొదలైన గ్రామముల మీదుగా ప్రవహించిన 'గోస్తనీ నది' సముద్రములో గలిసినచోట నున్నది .... కృష్ణానది సముద్రమున కలిసిన చోటికి కాలీపట్టణము దగ్గరనే యున్నది. కనుకనే శ్రీనాథుడు కృష్ణ కావలి యొడ్డు నందున్న కొండవీటి ఆస్థానములో స్థానము సంపాదించుటకై యత్నించి యున్నాడు.

'శ్రీనాథుని బావమరిదియైన దగ్గుబల్లి దుగ్గన్న యింటిపేరయిన 'దగ్గుబల్లి' కూడా కాలీపట్టణము దగ్గరనే యున్నది. అందుచే, శ్రీనాథుని జన్మస్థలము గోస్తనీనది సముద్రమున గలసినచోట గోదావరీ, కృష్ణా మండల సంధిలో నుండిన కాలీపట్టణ మనుట సంశయింప నక్కరలేదని నా మనవి.'

—ఆంధ్రప్రభ, పుట 6,
(7—1—62, ఆదివారము).

శ్రీ చిలుకూరు పాపయ్యశాస్త్రిగారు 'శ్రీనాథుని జన్మస్థలం కర్ణాటకం కానేకాదు' అను వ్యాసము ప్రకటించు నప్పు డీ సిద్ధాంతము ప్రతిపాదించినారు. కాని, ఇది పరిశీలింపతగినవిషయము.

శ్రీ శాస్త్రిగా రీసిద్ధాంతము ప్రతిపాదించు నప్పుడు భీమఖండ కృతిపతి శ్రీనాథకవిని 'పాకనాటింటివాఁడవు, బాంధవుఁడవు, కమలనాభుని మనుమఁడవు' అనుటలో గల వ్యంగ్య శబ్దశక్తి చరిత్రను తిరస్కరించినట్లు నాకు తోచుచున్నది.

'పాక్నాటి శాఖీయుడవు, పాకనాటిలో ఇల్లు గలవాడవు, నాకు చుట్టమవు' అనుట శ్రీనాథుని జన్మస్థానమైన 'వారిధితటీ కాల్పట్టణ(ము)'న కన్వయించనిదే గోదావరిజిల్లా, కృష్ణజిల్లా కాలీపట్టణముల చరిత్ర సార్థకము కాదు. చుట్టాలందరు ఒక మండలములోనివారై యుండవలయు ననుట లోకాచార విరుద్ధము. కావున, పాకనాటిలో చేరని కృష్ణజిల్లా కాలీపట్టణము కాని, గోదావరిజిల్లా గోస్తనీ కాలీపట్టణము కాని శ్రీనాథుని కాల్పట్టణము కాదనుట నిశ్చయము.

కడపజిల్లా ప్రొద్దుటూరు కోట శిలాశాసనములో 'సింహపురి పా(? స్థ)ం కాల్పకనా' అను ప్రాచీన పాకనాటి—కాల్పట్టణము పేరు రేపేర్కొనబడి యున్నట్లు 7–6–59 తేది ప్రజామత పత్రికలో శ్రీ మల్లెం నారాయణగారు ప్రాచీనశాసనలిపిని చదివి మూలము ప్రకటించి యున్నారు. కాని, ప్రభుత్వచరిత్ర శాఖవారు శిధిల శాసనమూలము సంగ్రహించినట్లు కనబడుటలేదు. ఆ శాసన మూల మిప్పుడు చాలాభాగము అరిగిపోయినట్లు, శాసన ప్రతిబింబము తీయుట దుస్సాధ్యముగా ఉన్నట్లు తెలియుచున్నది.

కడపజిల్లా రేనాటి చారిత్రకునకు నెల్లూరుజిల్లా పాకనాటి విక్రమసింహపురి స్థలమగు కాల్పట్టణము పేరు

ప్రొద్దుటూరి ప్రాచీనశాసనములో లేకపోయినను, కూట కరణముచేసి సృష్టించినట్లు తలంచుటకు కవకాశము లేదు.

ప్రభుత్వ పురాతత్వపరిశోధకశాఖ వారికీ కలికాల చోడ శాసనవిషయము తెలిపి, శాసనమూలము సంపాదించవలసినదిగా కోరియుంటిని. అవసర మున్నట్లు తోచిన యీ చలికాలములో ప్రతిబింబప్రయత్నము చేసెదమని ఉంటి చరిత్ర శాఖాధికారి వ్రాసియున్నారు.

ప్రొద్దుటూరు గ్రామములో నడిబొడ్డున ఉన్న పాత కోట శాసనమును పరిశోధకశాఖవారు గుర్తించకపోయినను, ఆ గ్రామ శాసనమూలము లన్నిటిని సంపాదించినట్లును, అందీ సింహపురి స్థల కాల్పట్టణము లేదనుట వింతగా ఉన్నది. ఆ ఎర్రరాతి శాసన మిప్పటికిని అచ్చట కనబడుచున్నదట. ఇందలి సింహపురి-కాల్పట్టణ చరిత్రను నెల్లూరుజిల్లా పాక నాటి శాసనమూలములతో గుర్తింప వీలున్నదేమో పరిశీలింతము.

క్రీ. శ. 1256—57 తేదీ కృష్ణా పట్టణము సిద్దేశ్వ రాలయ శాసనములో 'కొల్లత్తురై యాన గణ్డగోపాల పట్టణమ్ (Kollatturai alias Gandagopalapa-ttanam)' అను రేవుపట్టణము పేరు అరవ లిపిలో చెక్కబడి యున్నది. ఇంతేకాక, క్రీ. శ. 1279—80 తేదీ కృష్ణాపట్టణము సిద్దేశ్వరాలయ శాసనములో 'ఇరుమడి తిరుక్కాలత్తి దేవర విజయరాజ్యమ్—కొల్లిత్తురై యాన గణ్డగోపాల పట్టణమ్ (Kollitturai gandagopa-lapattanam)' అను రేవుపట్టణము పేరు 'కొల్లి' రూపాంతరముగా అరవలిపిలో చెక్కబడి యున్నది.

నెల్లూరుజిల్లా శాసన సంపుటము[1] లో గూడూరు తాలూకాలో 39—45 సంఖ్యలుగా కృష్ణపట్టణ శాసనములు పేర్కొనబడినవి. కాని, ఇప్పు డీ కృష్ణా పట్టణము మజరాగండగోపాలపట్టణము నెల్లూరు తాలూకాలోనికి మార్చబడి యున్నది.

క్రీ. శ. 13 వ శతాబ్దములో అరవ శిల్పులు చెక్కిన 'కొల్ల—కొల్లి' రేవుపట్టణము ప్రాచీనరూపము 'కల్—కాల్' పట్టణనామ మనుటకు 'కనకక్ష్మాధర ధీరు వారిధితటీ—కాల్పట్టణాధీశ్వరున్' అను వృత్తయతి మైత్రి తోడ్పడుచున్నది. దీనిని అరవ శిల్పులుచ్చరించినట్లు కొల్పట్టణమని మార్చుట యతిభంగ దోషము. కావున, ప్రొద్దుటూరి శాసనమందును, శ్రీనాథుని పద్యయతియందును పేర్కొన్న 'కాల్పట్టణ (కాల్పతన)' నామమే ప్రాచీననామ మనుట నిక్కము.

కాల్పట్టణ మను రేవుపట్టణమునకు క్రీ. శ. 13 శతాబ్దములో గణ్డగోపాల పట్టణము అను ('యావ'—పరఫ్) మారుపేరు పెట్టబడినట్లు స్పష్టమగుచున్నది. కాని, ఇప్పు డీ ప్రాచీన పట్టణము పురమని వ్యవహరింపబడుచున్నది. చిన్న పల్లెగా ఉన్నది. సాల్టు కొఠారు కార్యాలయము, సిబ్బంది గృహములు, కొన్ని గుడిసెలు మాత్రము నిలిచియున్నవి. ప్రాచీన కట్టడములేమిన్ని లేవు. దీనికి తూర్పున మైలుదూరములో కొల్లత్తురై (రేవు) కలదు.[2]

షడ్భాషామంజరి—వ్యాపారపట్టికలో '(తె.) రేవు—(అ.) తురై, (క.) రేవుపట్టణ' మను సమానార్థక నామములు కలవు. కా 'గా, గండగోపాల పట్టణమను కాల్ + పట్టణము—కొల్లత్తురై—కాల్పట్టణము క్రీ. శ. 13 శతాబ్ది కంటె ప్రాచీనమైన రేవుపట్టణ మనుట నిశ్చయము.

అరవశిల్పులు కాళ్నేరు రేవుపట్టణమును కొళ్నేరుగా మార్చినట్లే శ్రీనాథాదులు కాల్రేవు పట్టణమును—కాల్పట్టణముగా సంస్కృతీకరించినట్లు తలంచినను దోషము లేదు.

ఇప్పటికిని కాళ్లేరు—కాళేరు సముద్రములో కలియు జలమార్గము ద్వారా ఓడ వ్యాపారము—ముడియిసపరాయి ఎగుమతి—అడపా దడపా సాగుచున్నది. ఏటిలో 40—50 అడుగుల లోతున్నను, సముద్రము మొగదల పూడి లోతు తక్కువగా ఉన్నది. అయినను, ఓడ వ్యాపారమున కడ్డు లేదు. స్టీమరు వ్యాపారము సాగదు.

శ్రీనాథుని 'బాల సఖుడవు శైవ ప్రబంధ మొకటి యవధరింపుము నా పేర నంకితముగ' అనిన అవచిదేవయ త్రిపురారి (అవచి తిప్పయ) 'సింహవిక్రమ పట్టణ శ్రేష్ఠుడైన సెట్టి' మనుమ డగుటచేత ప్రొద్దుటూరుకోట శాసనములో చెప్పినట్లు 'సింహ (విక్రమ) పురి స్థల కాల్పట్టణ' బాలకవితో సఖ్యతకు, కప్పలి జోగుల (—చీనా ఓడల)ఎగుమతి—దిగుమతి వ్యాపారమునకు దగ్గర సంబంధ మేర్పడుచున్నది.

కవి నెల్లూరు వచ్చినను, సెట్టి కాల్పట్టణము రేవు కొచ్చినను బాలసఖ్యత—పాకనాటి నివాస సంబంధము చెడదు కద !

---

1. 'కృష్ణాపట్టణము (కొల్లతూత్తై) శాసనములు తమరు ఒకమారు చూడ కోరిక' అని మొదట సూచించిన వారు శ్రీ బదరీనాథ్ గారు.

2. ఇప్పు డిది కృష్ణా పట్టణము పోర్టు (Port) గా చెల్లుచున్నది.

కాగా, కాశీఖండములో శ్రీనాథకవి పేర్కొన్న వేదాద్రి నరసింహ—కారణ—' సాహిత్య సాక్ష్యము కూడ నెల్లూరు పాకనాటి వేదగిరి నృసింహక్షేత్రమునే బలపరచు చున్నది.

'ఎగువ వేదగిరి—దిగువ జొన్నవాడ
నడుమ పెన్న దేవి—నడకివ్వవమ్మా.
...............'

ఈ పాటయందలి పెన్న పాకనాటిలోని వేదగిరి—వేదాద్రి యను నరసింహులకొండ నెల్లూరువాటికి 8 మైళ్ళ దూరములో పడమట కలదు.

కృష్ణపట్టణములో గండగోపాలాలయము, మజరా గండ గోపాల పట్టణములో కొల్లత్తురై అను కాల్పట్టణము (రేవు) నెల్లూరు వాడనగా నెల్లూరు పాకనాటికి 15 మైళ్ల దూరములో తూర్పు సముద్ర తీరమున కలవు.

ఇప్పుడా కొల్లత్తురై (కొల్లి-కొల్ల?) అనుకాలేవుపట్టణము-కాల్పట్టణము—కృష్ణ పట్టణము రేవుగా పేర్కొనబడు చున్నట్లే, కాళ్లేరు కండ్లేరుగా కూడా పేర్కొనబడుచున్నది. 'కొల్ల—కాల్' పేరే అరవ శిల్పుల నోటిలో, చెక్కడులో 'కొల్ల—కొల్లి' పేరుగా మారినట్లు విక్రమ'సింహపురి స్థల కాల్పటన' ప్రాచీన లిపి శాసన చరిత్రను బట్టి చెప్పక తప్పదు.3

నెల్లూరువాడను పాకనాటిలో కృష్ణ పట్టణ మను కాల్పట్టణము తూర్పు సముద్రతీరమున ఒకటిన్నర మైలు దూరములో కలదనుట 'వారిధితటీ కాల్పట్టణ' చరిత్ర కాకపోదు కద! దీనిని కాలిపట్టణ మనుట సరికాదు.

పరిశోధన (జూన్—జులై, 1954 సంచిక) లో 'శ్రీనాథుని కల్పట్టణం' అను వ్యాసము ప్రకటించినప్పు డీ కరికాలచోడుని శాసనము, కృష్ణపట్నం శాసనములు పరిశీలించనందుచేత సముద్రతీరమందలి వరగలి—ఒరగల్లు నుండి 'కల్+పట్టణము—కల్పట్టణము' సాధ్య మగునని సూచించుట నా పొరపాటు. అయినను, దీనికి ఉత్తరంగా 5—6 మైళ్లలోనున్న కృష్ణపట్టణమను కాల్పట్టణము (రేవు) గండగోపాల పట్టణ ప్రదేశములో సమీపమున కలదు.

తొలినాటి కాల్పట్టణము గండ గోపాల పట్టణ మైనను కృష్ణపట్టణమైనను అప్పు డవి మజరా గ్రామములగుట శ్రీనాథుని పాకనాటి నివాసస్థానము—పాకనాటింటి వాడనుట సార్థక మగుచున్నవి.

ఈ వ్యాసము వ్రాయుటకు కారకులైన ప్రొద్దుటూరు శ్రీ మల్లెల నారాయణగారికిని, నెల్లూరు శ్రీ బదరీనాథ్ గారికిని శాసనాధారములు చూపినందుకు ధన్యవాదము లర్పించుచున్నాను..

---

3. ఈ కొల్లత్తురై పేరిప్పటికిని నెల్లూరుజిల్లా మనుబోలు గ్రామములో 'కల్లేరు'గా వ్యవహరింపబడుచున్నది. సముద్రతీరములో ఇది గోపాలపుర మను గండగోపాలపట్టణము దగ్గరి కండ్లేరు—కళ్లేరు—కాల్లేరు—కాల్పట్టణము (—కృష్ణ పట్టణము) అనుట నెల్లూరి పాకనాటి చరిత్ర.

# సమ్మోహవిద్య: మరికొన్ని వివరములు

శ్రీ ఆర్. రాజగోపాల్

ఏప్రిల్ 1962 'భారతి'లో ప్రకటింపబడిన "సమ్మోహ విద్య"ను చదివితిని. విషయము సంగ్రహముగను, సులభ గ్రాహ్యముగను వివరింపబడియున్నది. ఆ వ్యాసమునకు అనుబంధముగ ఈ విషయములు గూడ చేర్చుకొనినచో సమగ్రమగునని భావింతును.

'హిప్నటిజమ్' అను పదము గ్రీకుపదము 'హుప్నాస్' అనగా నిద్ర — (GK. hupnos-sleep) నుండివచ్చినది. 'హిప్నటిజమ్' 'మెస్మరిజం' రెండును చాలవరకు ఒకే అర్థమును సూచించుపదములు. 'మెస్మరిజమ్' నకు మూలపురుషుడగు మెస్మర్ (Friedrich Anton Mesmer, 1734–1815) యొక్క జీవిత చరిత్ర చిత్రమైన సంఘటనలతో కూడినది. ఇతడు ఆస్ట్రియా దేశమున జనించి, వియన్నా నగరమున వైద్యవిద్యలో పట్టభద్రుడై ఆ నగరములోనే వైద్యవృత్తిని ప్రారంభించి, తన 'మెస్మరిజమ్' వలన 'హిస్టీరియా' వ్యాధితో (స్త్రీలకువచ్చు అపస్మార వ్యాధి వంటిది) బాధపడువారినిరక్షించుచుండ, ఆస్ట్రియాలోని వైద్యులు మెస్మర్ యొక్కవృత్తి మంత్ర, తంత్ర భూయిష్ఠమని అతనిని దేశభ్రష్టునిగావించిరి. మెస్మర్ 1778 లో పారిస్ నగరమునకు వెళ్లి, అచ్చట తన వృత్తిని మరల ప్రారంభించెను. అతనికి పారిస్ నగరములో విస్తారముగు ధనార్జనమున కవకాశము లేర్పడెను. కాని, ఫ్రెంచి ప్రభుత్వమువారు కూడ అతని చికిత్స మంత్ర, తంత్ర యుక్తమయినదని సంశయించి, ఒక విచారణ సంఘమును (కమిటీని) ఏర్పాటు చేసిరి. ఆ 'కమిటీ'లో విఖ్యాత రసాయన శాస్త్రజ్ఞుడైన లావైసర్ (Lavoiser) ఫ్రాన్సులోని అమెరికా రాయబారియగు బెంజమిన్ ఫ్రాంక్లిన్ (Benjamin Franklin) మున్నగువా రుండిరి. వీరి నివేదిక మెస్మర్ విధానమును నిరుత్సాహపరచెను. వీరందరును 'మెస్మరిజమ్'మీద తమ సందేహములను వెలిబుచ్చి యుండిరి. సమ్మోహ విద్య మంత్రవిద్యగాదు. సమ్మోహవిద్యను సాధించువానికెట్టి మానవాతీత శక్తులు ఉండవు. ఒక వ్యక్తి మనయెదుట కూర్చుండి ఆవులించినచో మనకును, ఆవులింతలు వచ్చునుకదా! అట్టి ప్రక్రియయే సమ్మోహ విద్యయందును నున్నది. ప్రజలు గుంపులు గూడి యున్నప్పుడు వారు వ్యక్తిగతముగ చేయని పనుల నెన్నియో చేయుదురు. అప్పుడు గూడ గుంపులోని యా ప్రజల నొక విధమైన 'హిప్నటిజమ్' ఆవరించి యుండును.

ఫ్రాన్సులో తన కాదరణ లేనందున మెస్మర్ కొన్నాళ్ళ స్విట్జర్లాండ్‌లోనుండి పిమ్మట తన వైద్యవృత్తిని విరమించుకొని స్వదేశమునకు మరలి 1815 లో పశువుల బాసెను.

'హిప్నటిజమ్'తో రోగినిసుప్తావస్థకు మరలించి శస్త్రచికిత్స (Surgery) చేయుటయు కలదు. అట్టి ప్రయత్నమును ప్రథమముగా ఇండియాలో చేసిన ఖ్యాతి డా. జేమ్సు ఎస్డైల్ (Dr. James Esdaile) కు 1845 లో దక్కినది. 'హిప్నటిజమ్' చేతగానివారు చేయుట వలన కొంతయుపద్రవము కలుగుటకు వీలున్నది. సమ్మోహమునకులోనై, సుప్తావస్థయందున్న వ్యక్తిని మరల జాగ్రదావస్థకు తీసికొని వచ్చునప్పుడు కొంతప్రావీణ్యము, అనుభవము నవసరము. లేనిచో సుప్తావస్థనుండి జాగ్రదావస్థకు మరలు వ్యక్తియొక్క నరములకు బిగువు హెచ్చి సడలును. అదే విధముగ ఒకే వ్యక్తిని పలుమారులు సమ్మోహమునకు లోనుగావించుటయు హానికరమే.

# కావ్యాలంకార చూడామణి

శ్రీ బండి నాగరాజు

'కావ్యాలంకార చూడామణి' లో ఏడు—ఎనిమిది యుల్లాసములు ఛందశ్శాస్త్రవిషయ ప్రతిపాదికములు. వాటిలో నా దృష్టికి దోషాలుగా భాసించిన వాటినిగురించి యిక్కడ క్లుప్తముగా వ్రాస్తున్నాను. తద్జ్ఞులు, పసివాడిని—నన్ను—మన్నించుతారని ఆశిస్తున్నాను.

క. ప్రవరాప సమమ సుప్ర
త్యపి నిర్ముదధి న్యుపాభ్య—దార్వ్యుత్యవ వ
ర్యుపవర్గ వింశతికి వళు
లు పరస్పర వర్ణయుక్తి—నుభయముఁ జెల్లున్.
(7—47)

ఇందులో చివరి పాదములో యతిభంగము జరిగినది. ఇది సమర్థనీయమేనా ? దోషమే ఐతే సవరణ యేమిటి ? పాఠాంతరము ఏదైనా కద్దా ? పెద్దలు సెలవియ్యవలె.

గీ. వెలయు సమసీసములు పంచ—విధము లయ్యె
నరయు నవకలి సీసాఖ్య—యంబుఁ బ్రాస

సీస మక్కిలి ప్రాస సీ—సాఖ్య సీస
ము వడిసీస మక్కిలివడిసీస—మును వనంగ.
(8—25)

దీనిలో మూడో పాదములో వడి కుదరలేదు. నాలుగో పాదములోను గణభంగము జరిగినది. 1. అవకలిసీస (అహ్వాయ)ంబు, 2. ప్రాస సీసము, 3. అక్కిలిప్రాససీస (అఖ్య, అనే టటువంటి పేరుగల—సీస) ము, 4. వడిసీసము, 5. అక్కిలివడిసీసము—అని "సమసీసము" ఐదు విధాలు. ఈభావము సరిపోయేటట్లుగానే క్రింది విధముగా— "......సీస, మక్కిలి ప్రాసమవ్—సీసము, వడి సీస, మక్కిలి వడియును—సీసము నన."
అని సవరించుకోవచ్చునా ప్రస్తుతానికి ? (పై పద్యము తేటగీతి.)

ఈ పద్యము సరిగా అర్థమగుటలేదు.

గీ. ప్రవళినాఁ బ్రసన్నపది నాఁగ గీతులు
సీసములను రెండు చెందుఁ దుదల
నాటవెలఁది యనఁగఁ దేటగీతి యనంగ
నాని పేళ్ల వేర నలయుఁ దెలియ. (8—37)

సమసీసముల చివర, ఆటవెలది గాని, తేటగీతి గాని అనుబంధముగా నుండడము సహజము. ఆ అనుబంధ గీతులను "ఎత్తు గీతులు" అని అంటాము. వీటికే "ప్రవళి" (=ఆటవెలది) "ప్రసన్నపది" ('ప్రసన్నపడి' అనిన్నీ పాఠాంతరము=తేటగీతి) అని క్రమంగా పేళ్లున్నాయని, విన్నకోట పెద్దన చెప్పినట్లు నేను అనుకొంటున్నాను. ఈ అనుకొన్నది సరి అయితే తంటా లేదు.

ఐనా, విషమసీసముకు అనుబంధముగా ఆటవెలది ఉండవలె గదా ? దాని నేమనవలెను ? 'ప్రవళి' అని అనవచ్చునా ? "ఎత్తు గీతి" అని అనవలెనా ? ఏది సంప్రదాయము ? అసలు 'ఎత్తుగీతి' అనే పద్యము ఒకటి ప్రత్యేకముగా ఉన్నదిగదా ! మరి, వీటిని ఎత్తు గీతులని ఎట్లా అంటాము ?

గలము రెండు నగణములును—గలసి ప్రాస మెఱయుఁ
జెలువు దోఁప నెత్తుగీతి—వెలయు గృతులయందు.
(8—40)

'గలము' అంటే 'హగణము' అన్నమాట; ఇది సూర్యగణము. దీనిని చెప్పడమువల్ల నగణము కూడా గ్రాహ్యము. కనుక, "ఎత్తుగీతి" పాదములో మొదట ఒక సూర్యగణము ఉండవలెను. తరువాత మరిరెండు నగణములు ఉండవలెనంటున్నాడు. అంటే మొత్తము మూడు సూర్యగణములలో ఒక ఎత్తు గీతి పాదము అవునా ? కాజాలదు—

"శ్రీదయితాధిప ! న
యోదయ నలిన వ్రత
యోదితమైన నెత్తు
గీతియ యొప్పుఁ గృతుల." (కవిజ. జాశ్ర.)

అంటే, ఒక యింద్రగణము, రెండు సూర్య గణములు కలిసి ఒక ఎత్తు గీతి పాదము అవుతుంది—అని లక్షణము. కనుక పై పద్యములో 'గలము' అని ఉండేచోట 'నలము' అని ఉండదగును. 'నలము' అనడముతో ఇంద్రము లారున్నా గ్రాహ్యము అవుతవి.

పై రెండు పాదముల పద్యము, ఎత్తు గీతికి లక్ష్యము కాజాలదు. అది 'మేళన గీతి' లక్షణమును బట్టి నడిచినది. మొదటి పాదములో "గలము' అని పఠించినప్పుడే యతి నియమము సరిపోతున్నది. రెండో పాదములో యతి లేనే లేదు. వీటికి ప్రాసయతి నియమము లేదు. కాబట్టి దీన్ని మేళనగీతి అనడము కూడా సరిపడదు.

ఇందుకొక పాఠాంతర మున్నది. అది యిట్లున్నది—

"నలము రెండు నగణములు గలసి ప్రాసంబు
చెలువు మై యెత్తుగీతి
వెలయు సత్కృతుల యందు."

ఇది సరిఅయిన లక్షణమును చెప్పుచున్నది. ఈ లక్షణముతోనే పై పద్య పాదములను పరిశీలించితే లక్ష్యముగా పూర్తిగా సరిపోవడము లేదు. మరిన్ని, ఇది మేలన గీతి కూడా కాదు. చాలామట్టుకు ఎత్తు గీతికే సరిపోతున్నది—

"నలము రెం డు నగ ణములు
గలసి ప్రా సంబు .... ..... .....
చెలువుమై యెత్తు గీతి
వెలయు స త్కృ తుల యందు."

"గ (న) లము రెండు నగణములును—గలసి ప్రాస మెఱయు" అని ఉన్న దానిలోని "మెఱయు" ను తీసుకొని, పైద రెండో పాదము చివర "మెఱయు (న్)" అని అతికించితే (మొదటి పాఠములో కూడా 'మెఱయు' నని ఉండడమే బాగు.) సరిపోగలదు. "చెలువు మైన్ + ఎత్తు గీతి=చెలువు మై నెత్తు గీతి" అని ఉండవలె. "చెలువము—ఐ .... —చెలువమై యెత్తు ...." అని ఐనా ఉండవలె. ఐతే, ఇది వ్యాకరణ విషయము.

అంటే, పరిష్కృత పాఠము ఈ విధముగా ఉండవచ్చు :

"నలము, రెండు నగణములఁ
గలసి, ప్రాసంబు మెరయఁ—
జెలువు మై, 'నెత్తుగీతి'
వెలయు—సత్కృతుల—యందు."

దీనికి యతి నియతి లేదు. అప్పకవి మతములో ఐతే ఉన్నది. కవిజనాశ్రయకారుడున్ను చెప్పలేదు. ప్రాసనియమము ఉన్నదే.

త్రిపది. త్రిపదికి నొకయంఘ్రి నింద్రులు నలువురు
ద్యుపతు లిద్దఱు సూర్యు లిర్వురొం
ద్యుపతి ద్వయార్కులు నౌల. (8—52)

మూడు పాదములతో 'త్రిపది' పద్యము సమాప్తము అగును. అందులో మొదటి పాదములో నాలుగు ఇంద్రగణములు ఉండవలెను. తక్కిన రెండుపాదములు వేరొక విధముగా ఉండును. వాటికి క్రమముగా రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణము ఉండవలె. ప్రాస మున్నది. యతి నియతి లేదు. ఇది త్రిపది లక్షణము.

పై పద్యములో రెండవ పాదమున ఛందోభంగము ఏర్పడినది: "ద్యుపతు లి | ద్దఱు సూర్యు | లిర్వు | రొల" అనడములో, చివర ఒకే సూర్యగణము ఉండవలసి ఉంటే రెండు సూర్యగణములు ఉండవలెనని చెప్పడము, అట్లా ఉండడము—ఇతర లాక్షణికుల మతానకు విరుద్ధముగా ఉన్నది. కనుక, పై పాదమును "ద్యుపతు లి ద్దఱు సూర్యుఁడొల" అని మార్చితే సరిపడును.

ఛందశ్శాస్త్రముమీద నాకు ఉన్న జిజ్ఞాసను బట్టి, పై నాలుగు మాటలు మనవి చేసినాను. పెద్దలు నా అజ్ఞతను పాటించక, విద్యార్థినైన నా సందేహాలను నివృత్తి చేస్తారని ఆశిస్తున్నాను.

# సాహిత్యంలో వేశ్యలు

## శ్రీ టి. రాఘవేంద్రరావు

కవి కుల చక్రవర్తి కాళిదాసు "శృంగార యేకయేవ రసః" అన్నాడు. సంస్కృత సాహిత్యంలో దేవవేశ్యలు నాయికలుగ శృంగార రసపోషణం జరిగింది. కాళిదాసుకేకాక, రవీంద్ర కవికి కూడ ఊర్వశి కావ్య వస్తువైనది. పూర్వ రచయితల కావ్యాలలో, నాటకాలలో దేవవేశ్యలు నాయికలయితే నేటి అధునాతన రచయితల రచనలలో సైతము వేశ్య పాత్రచిత్రణ వినూతన ధోరణులలో సాగినది.

విక్రమోర్వశీయంలో ఊర్వశి అద్భుత సృష్టి. పురూరవుడి హృదయంలో అనంతమైన కామనను రేకెత్తిస్తోంది. ఊర్వశీ గత విరహ బాధా పీడితుడైన పురూరవుడి చరిత్ర లోకవిదితమైనది. ఎందరో మునులు ఊర్వశీ సౌందర్యదర్శన మాత్ర విచలిత మనస్కులైనారు. ఈ ఊర్వశీ ఎందరో అధునాతన కవులకు కూడ కావ్య వస్తువైనది. కాళిదాసు హృదయాన్ని వలచిన ఊర్వశి రవీంద్రుడి భావనా ప్రపంచంలో మెరపులా మెరిపించింది. ప్రకృతి గతమయిన సౌందర్యానికి సంకేతంగా, ఆ సౌందర్యపు సూక్ష్మశక్తిగా రవీంద్రుడి హృదయంలో సాక్షాత్కరించింది. కృష్ణశాస్త్రిగారి కవిత్వంలో "అగమ్య తమస్వినీ గర్భ కుహరాలలోనికి" వెళ్ళిన ప్రేయసిగా విరహాగ్నిని ప్రజ్వలింప చేస్తోంది. చలంగారి ఊర్వశి అద్భుత సౌందర్య కాంతిపుంజమై కన్నీటి పూటలు ప్రభవింప చేస్తోంది పురూరవుడిలో. అతన్ని అడవులు, నదులు, కొండలు, తిప్పుతోంది. అతిలోక సౌందర్యంతో, అపురూప చమత్కార సంభాషణలో అందరి హృదయాలను దోచుకుంటోంది ఊర్వశి.

రంభ ఊర్వశికంటే తక్కువకాదు. కదళీ కాండాల్లాంటి ఊరువుల్ని జ్ఞప్తికి తెచ్చి, రసికుల కిట్టే ఆవేశాన్ని కలుగ చేస్తోంది. రంభ సౌందర్యం అసామాన్యమయినది. నృత్యకళా విశేషంతో రసికజన హృదయరంజకంగా సాక్షాత్కరిస్తోంది రంభ. వీరస్వర్గాన్నలంకరించిన వీరులు, యజ్ఞయాగాదులు చేసిన సోమయాజులూ, రంభ యింటిదగ్గర అవసోపాలు పడుతుంటారని చెప్పబడుతోంది. అందుకే పెద్దన్నగారివి వరూధిని "యజ్ఞకోటులం బావను లౌటకు ఫలము మా కవుగిళ్ళ సుఖించుటే కదా" అంటుంది. అంత సౌందర్యవతియైన రంభను రావణుడు బలాత్కరించే ఘట్టం, పాపరాజుగారి ఉత్తర రామాయణంలోకానీ, తిక్కన్నగారి నిర్వచనోత్తర రామాయణంలోకానీ చదివితే రంభపట్ల జాలి కలుగుతోంది. మత్తగజం దిగి కల్లోల పరచిన కొలనులా వుందిట రంభ. ఏ రసికుడి హృదయం జాలి పడదు. కళాపూర్ణోదయంలో రంభ పాత్రను పింగళి సూరన్నగారు అమోఘంగా చిత్రించారు. ఆమె రూపురేఖల్ని బహు సుందరంగా తీర్చి దిద్దారు. పై కావ్యాలలోని అనేక ఘట్టాలలో సురతానంతరం చెదరిన కురులతో, నలిగిన వస్త్రాలతో, తడబడుతున్న నడకలతో నడిచిన రంభను మరవడం కష్టం. కొనసరించుకొని వలపులు పచరించిన నలకూబరుడు ధన్యుడు!

మేనకను తలచుకుంటే శాకుంతలం జ్ఞాపకానికి వస్తోంది. తపస్సు చేసిన ఋషులకు దేవేంద్ర పదవిని తప్పించి, ఇంద్ర భోగాల ననుభవింప చేశారు అప్సరసలు. ఇనుప కచ్చడాలు కట్టుకున్న మునులు ముచ్చులై కాముని యాతి బాధలకు తాళలేక అచ్చరల శరణు చొచ్చారు. మేనక, హిమవంతునిలాంటి కొండ గుండెను కరిగింప చేసింది. విశ్వనాథవారి మేనక ఒక విచిత్ర సృష్టి. విశ్వామిత్రుడి హృదయాన్నేకాక, చదువరులందరి హృదయాన్ని ఆకర్షించిన పాత్ర మేనక. ఒక మధుర మనోహర మూర్తి. నన్నయ్యగారి మేనక బాహుమూల రుచులు కనపడేలా విశ్వామిత్రుడి కళ్ళముందు మెసలింది. "రావే, కావవే" అంటూ మేనక వెంటపడతాడు ముని.

ఎవరిని విస్మరించినా, తెలుగు చదివిన వారెవ్వరూ పెద్దన్నగారి వరూధినిని మరచి పోలేరు. "ఝళంఝళత్కటక సూచిత వేగ పదారవిందయై లేచి కుచంబులు తురుము లేనడు మల్లలాడ నయ్యెడం" బూచినపోక నునుబోదియ చెంత చేరిన వరూధిని విలోకన ప్రభా వీచికలను తప్పించుకున్న చదువరి అరుదు. ఇలా దేవవేశ్యలు సంస్కృత కావ్యాలలో, ప్రబంధాలలో వివిధ కవుల చేత చిత్రించబడ్డారు.

మానవ వేశ్యల పాత్ర చిత్రణ అధునాతన రచయితల రచనల్లోనేకాక, ప్రబంధ కవుల కావ్యాలలో, ప్రబంధాలలో కూడ

గమనించవచ్చు. పారంగు తమ్మయ్యగారి దేవదేవి విగత కంచు కయ్యై, విప్ర నారాయణుడి ధైర్య కవచాన్ని తునియలు చేస్తోంది. భట్టి విక్రమార్కుని కథలు, శుక సప్తతి కథలు, మదన కామ రాజకథలు, కాశీ మజిలీ కథలు మొదలయిన గ్రంథాల్లోని వేశ్యలు నెరజాణలు, చమత్కార సంభాషణాదక్షులుగ చిత్రించబడి యున్నారు. సంస్కృత కావ్యాలలో, ప్రబంధములలో చిత్రించ బడ్డ వేశ్యలకు, పారిశ్రామిక యుగంలోని వేశ్యలకు, అంటే ఆర్థిక దుస్థితివల్ల వేశ్యా జీవనాన్ని గడుపుతున్న పడుపుకత్తె లకు, యెంతో భేదం వున్నది. నాటి వేశ్యా జీవనం రసికత కుదా హరణం అయితే, నేడు హేరకమైన యాతనకు, దుర్భర జీవనా నికి నిలయం.

వసంతసేన తరువాత అలాంటి అద్భుతమైన పాత్రను గురజాడ అప్పారావుగారు సృష్టించారు. శూద్రకుడి వసంతసేన మధుర మనోహరమూర్తి. శకారుడు వెంటబడి పీడించాడు. చారుదత్తుడు సమస్తైశ్వర్యాన్ని పోగొట్టుకున్నాడు. దుర్భర దారిద్ర్యజీవితాన్ని గడుపుతున్న చారుదత్తుని వసంతసేన గాఢంగా ప్రేమిస్తోంది. మహోన్నత ప్రేమజీవి ఆమె.

ఆ పాత్ర కలాంటి గౌరవం మళ్ళీ మధురవాణిలో లభిం చింది. రామప్పంతుల్నీ, లుబ్ధావధాన్లుని చిన్న పిల్లలకు మల్లే ఆడిస్తోంది. గిరీశాన్ని ముప్పుతిప్పలు పెడుతోంది. సౌజన్యా రావుపంతు లంతటివాణ్ణీ కదిలిస్తోంది. మధురవాణి, మధుర భాషిణకాదు. సుందర సురుచిర రూప కల్పన.

"వేశ్యా కులం యెందుకు పుట్టిందీ?"అని తర్కిస్తూ, శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు లలిత కళలయిన సంగీత సాహిత్యాలు వృద్ధి పొందడానికని వాదిస్తారు. లలిత కళలకు కాణాచిగ పరిణమించిన యీ కులం సమాజ జీవనంలో యెంతో గౌరవాన్ని పొందిందన్నారు.

పెద్దన్నగారు అరుణాస్పదపురంలోని విప్రుల విద్యా ప్రౌఢిని, రాజుల పరాక్రమాన్ని ఉగ్గడించారు. ఆ సందర్భంలో వారితోబాటు వెలయాండ్ర నైపుణ్యాన్ని గురించి, "అచటి వెలయాండ్రు రంభాదులైన సౌరయ గాసెకొంగున వారించి గడవగలరు నాట్యరేఖా కళా ధురంధర నిరూఢి" అని అంటారు. ప్రబంధకవులు వేశ్యలలో రసికతను, కళా నైపుణ్యాన్ని చూడ గలిగారు. పారిశ్రామిక విప్లవంవల్ల, ఆర్థిక కారణాలవల్ల సమా జపు రూపురేఖలే మారిపోయాయ్. అందుచేత వేశ్యా జీవనాన్ని చిత్రించే నవలల్లో బీభత్సత, అసభ్యత వుంటే దానికి తగినన్ని కారణాలు కూడ వున్నవన్న విషయం విస్మరించలేము. వారి జీవ నంలో కళాత్మకత నశించి, ఆర్థిక దుస్థితి వారిని కామ దాసీ లుగ తయారు చేసింది. అప్పంగా కడుపుకోసం పడుపుకత్తెగా తయారయిన పీడిత దళిత స్త్రీ మనకు కనపడుతోంది. అందేత నేటి సాహిత్యంలో రచయితలు వేశ్యను కళాదృష్టితోగాక, ఆర్థిక, నైతిక దృష్టులతో చూడగలిగారు. అభ్యుదయ కవి శ్రీశ్రీ అందుకే "పడుపు కత్తె రాక్షస రతిలో భయంకర బాధల పాటల పల్లవి"ని విన్నారు.

అనుకూల పరిస్థితులు లభిస్తే యే స్త్రీ అయినా బాగా జీవించగలుగుతుందనీ, లేని పక్షంలో దారిద్ర్యపీడితయై కడుపు కోసం దేహాన్ని విక్రయించుకుంటుందనీ నేటి రచయితల విశ్వాసం.

వేశ్యా మనిషే. వేశ్యకూ, ప్రేమించగల హృదయం వుంది అన్న అభిప్రాయాలతో రచనలు వచ్చాయ్.

ఈ దృష్టితో రచించబడ్డ శ్రీ రాజమన్నారు, శ్రీ చలం గారి నాటికలు, నాటకాలు మేధావుల దృష్టిని ఆకర్షించాయ్. 'ఏమి మగవాళ్ళు' నాటికలో కనకాంగిపాత్ర చాల విశిష్టమైన సృష్టి. ఒక్క కనకాంగి పాత్ర ద్వారా యితర పాత్రల మనస్తత్వా లను చిత్రించారు రాజమన్నారుగారు. కనకాంగిని చూడగానే జావళీలు వినాలనిపిస్తోంది వృద్ధులకు. కృష్ణమూర్తిలాంటి యువకుడు మైమరచిపోతాడు. తాళికట్టినవాడు కనకాంగిని అనుమానిస్తాడు సరిగ్గా అర్థం చేసుకోలేక. మరినంకాని కన కాంగి హృదయం చివరి సన్నివేశంలో పడే బాధను శ్రీ రాజ మన్నారుగారు సుందరంగా చిత్రించారు. ఈ విధమైన పాత్ర లను విరివిగా సృష్టించినవారు శ్రీ చలంగారు. వేశ్యా జీవనానికి కారణం ఆర్థిక దుస్థితే కానీ, వేరేకారణం ఏమీ లేదనీ కొందరు రచయితల దృష్టి.

శ్రీ చలంగారు రచించిన "త్యాగం"లో వనకుమారి యే చదువరి హృదయాన్నయినా యిట్టే ఆకర్షించగలదు. శ్రీని వాసుల్ని హృదయమంతటితోనూ ప్రేమిస్తోంది. కేశవరావును డబ్బుకోసం వదల్లేదు. శ్రీనివాసులు దుఃఖిస్తే వనకుమారి హృదయం చెప్పలేనంత బాధ పడుతోంది. అతను ఎక్కడికో చెప్పకుండా వెళ్ళిపోతే వెర్రిదానిలా విలపిస్తోంది. వనకుమారి పాత్ర పట్ల అందరికీ సానుభూతి కలిగేలా చిత్రించారు శ్రీ చలం గారు.

నాటకాల్లోనే కాకుండా నవలల్లో సైతం యిలాంటి పాత్రల సృష్టి జరిగింది. తెలుగువారికి శరత్ రచనలు వచ్చినంత దగ్గరగా యే యితర రచయిత రచనలు రాలేదేమో నని పిస్తోంది. దేవదాసులోని చంద్రముఖి చిరస్మరణీయ స్త్రీ. దేవదాసుకోసం ఆమె పరితాపమూ, వేదనా ఎవరినయినా కది లిస్తోంది.

విశ్వనాథవారి వేయి పడగల్లో గిరిక అపూర్వ సృష్టి. పాప పంకంలో పద్మంలా, మేఘావృతమయిన ఆకాశంలో మెర పులా, జేగీయమానంగా ప్రకాశించే గిరికను మరవడం కష్టం.
వేశ్యాజీవనానికి సంబంధించిన నవల లెన్నో వెలువడి నయ్. శారదగారి మంచీ — చెడూ, పోతుకూచిగారి "అన్వేషణ" యీ కోవకు చెందిన నవలలు. కొందరు రచయితలు వాతావరణ సృష్టి చేసి, పాత్రల మనస్తత్వాల నావిష్క రించారు. మరికొందరు పాత్రల మనస్తత్వాల నాధారం చేసు కుని వాతావరణాన్ని సృష్టించారు.

బహుళ ప్రచారాన్ని పొందిన శ్రీ బుచ్చిబాబుగారి "చివ రికి మిగిలేది" నవలలో కోమలి వినూతన సృష్టి.

ప్రపంచ సాహిత్యాన్ని పరిశీలిస్తే, ఇదే విధమయిన యితివృత్తాలు కలిగిన రచన లెన్నో కనిపిస్తాయ్. రష్యాదేశపు నవలా కారులైన గోర్కీ, కుప్రిన్, టాల్‌స్టాయ్. డాస్టొయేవస్కీ నవలల్లో సామాజిక జీవనంలో వేశ్యాజీవనపు ప్రభావాన్ని గురించి పుష్కలంగా చర్చించబడింది. "ముగ్గురు మిత్రులు" "యమ కూపం", 'రిసరక్షన్' నవలల నుదాహరణంగా తీసుకోవచ్చు. ఫ్రెంచి రచయితలు మొపాసా, జోలాల రచనలు—ముఖ్యంగా "నానా"ను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతోంది. వేశ్యా జీవనంలోని తమి, దాహం, గాఢకామన ఆశ్చర్యకరమయిన రీతిలో చిత్రించబడింది. ఇటలీ రచయిత మొరేవియా రచించిన "ఉమన్ ఆఫ్ రోమ్" ఒక గొప్ప ఉదాహరణ. దాదాపు ఈ రచయితల ప్రభావం చాలవరకు మన నవలా రచయితల రచనల్లో కనపడుతోంది.

మహాత్ముని దృష్టి వీరిపై బడినది. **"I weep for the fallen sisters of Luckuow"** అంటూ దుఃఖదారిత హృదయు లౌతారు మహాత్ములు.

వేశ్యలను సంస్కరించాలనే ఉద్యమం బయలుదేరింది. దీని ఫలితంగా వేశ్యా సంస్కరణోద్యమం ఆధారం చేసుకుని, నాటికలు, నవలలు రచించబడ్డాయ్. మొదట్లో హేయమయిన వేశ్యాజీవనం గడిపిన చింతామణి చివరిదశలో విరాగిణిఅయి భక్తిజీవనాన్ని గడిపింది. పురాకృత సుకృతంవల్ల చింతామణిలో ఆ మార్పు వచ్చినట్లు కనపడితే నేడు రచయితలు, సంస్కర్తలను, వేశ్యలను వివాహ మాడడానికి ముందుకు వచ్చిన యువకుల పాత్రలను సృష్టించి రచనలు సాగించారు.

భారతీయ వివిధ సాహిత్యాలలో ఈ విధమైన దృక్పథం కనిపిస్తోంది. హిందీ, బెంగాలీ మొదలయిన సాహిత్యాలలో యెన్నో నవలలు, కథలు వేశ్యా జీవనాన్ని గురించి వ్రాయబడ్డాయ్. తెలుగు, కన్నడ సాహిత్యాలలో ప్రసిద్ధములయిన నవలలెన్నో వున్నయ్.

వసంతసేన మొదలుకొని మధురవాణిదాకా జరిగిన పాత్రల సృష్టిని పరిశీలిస్తే సాహిత్యసృష్టికి, సాంఘిక జీవనానికి వున్న సంబంధం అవగతమవుతోంది.

# నగరత్తారులు-నగరంవారు

## శ్రీ ఏ. ఎస్. గుప్త

తమిళ నిఘంటువులో "నగరత్తార్" అనగా "నగర వాసు" అని చెప్పబడినది. మద్రాసు బ్యాంకింగ్ ఎన్క్వయిరీ కమిషన్) వారు తమ రిపోర్టులో "నాటుకోటు చెట్టియార్లు" సాంఘిక ప్రయోజనాల నిమిత్తం, తొమ్మిది నగరముల వారుగా పేర్కొనబడి యుండుటవలన, "నగరత్తారు" (Nagarathars) అని పేరు బొంది వారని తెలిపి యున్నారు.[1] ఈ నగరములలో, నొక్కొక్క నగరమందు ఆధిపత్యము వహించే దేవాలయము గలదు.[2] ఈ రీతిగానే ఆంధ్రదేశములో ఆర్యవైశ్య లనబడే 'కోమటి శ్రేష్ఠులు' నగరం వారని అని పేర్కొనబడుచున్నారు. వీరు వైశ్య పురాణమును అనుసరించి 'అష్టాదశ' అనగా పదునెనిమిది నగరములవారు.

నగరత్తారులు 25 గోత్రములవారుగాను, నగరం వారు 102 గోత్రములవారుగా నున్నారు. నగరత్తారులకు వలె, నగరం వారికి, ఒక్కొక్క నగరానికి ఒక దేవాలయాధిపత్యము గలదు. నగరత్తారులు, నగరంవార లిరువురును శివ భక్తులే. ఇరువురును సామాన్యముగా శాకాహారులుగాను, వ్యాపార వాణిజ్యములను ముఖ్య కులవృత్తులు గలవారుగాను ఉన్నారు. ఇరువురును మితవ్యయులు, నిరాడంబరులునై, సాంప్రదాయ సిద్ధమైన దానధర్మముల చేయుట యందును, ప్రజోపయోగకరములగు కార్యములందు ధనము వెచ్చించుట యందును ప్రసిద్ధులు. కాని, నవనాగరికతా ప్రభావము వలన, నూతన పద్ధతు లవలంబింపబడి అనేక విద్యా సంస్థలకు దానధర్మములు చేయబడి యున్నవి. నగరత్తారులు 'చెట్టినాడు' బ్యాంకి, నగరంవారు 'వైశ్య బ్యాంకి' మొదలగు 'జాయింట్ స్టాక్' పద్ధతిలో స్థాపించిన వాణిజ్య సంస్థలు అనేకము లున్నవి.

వీరి ఒక్కొక్క దేవాలయమందు కుల పెద్దల సంఘ మొక్కటి వారిలోని అన్ని విధములైన 'కుల తగాయిదాలు' తీర్చుటకు ఏర్పడి యుండును. ఇట్టి 'నగరత్తార్' సంఘము లోని పెద్దకు 'కార్యకరన్' అనియు, నగరం వారి కుల పెద్దకు 'పెద్దసెట్టి' అనియు పేర్లున్నవి. నగరత్తారులు 'మహిమై' అనే పేరుతోను, నగరంవారు 'రుసుం' అనే పేరుతోను, వారివారి వ్యాపారలాభములనుండి, దాన ధర్మాల నిమిత్తము, కొంత డబ్బు వసూలు చేయుట వాడుకగా నున్నది. నగరత్తారులకు 'తమిళము', నగరంవారికి తెలుగు మాతృభాషలు. తమిళము, తెలుగు రెండును ద్రావిడభాష కుటుంబములోని భాషలే.

వీ రిరువురును ఆదికాలములో తమ తమ జన్మస్థానములనుండి, ఆయా స్థానికప్రభువుల దురాగతములనుండి తప్పించుకొనుటకు, తదితర ప్రాంతములకు వలస పోయినట్లు చరిత్రవలన తెలియుచున్నది. నగరత్తారులు మొదట తొండమండలములోని కాంచీపురమునకును, తరువాత చోళ దేశములోని వెల్లార్ నది యొక్క దక్షిణతీర ప్రాంతమునకును వలస పోయిరి. నగరంవారు కూడ మొదట కాంచీ

1. Vide. The Madras Banking enquiry Commission.

2. Vide-The Madras Banking Enquiry Commission—Report-Vol. III. p. 117$^{0}$.)

పురమునకు, తదనంతరం, ఆంధ్రదేశములోని పెనుగొండ మొదలగు వివిధ ప్రాంతములకు వలస పోయిరి.[3]

నగరంవారియందు గల మేనరిక మనే పద్ధతి, నగరత్తారుల యందు కూడా కలదు. వివాహాచారాలు సాంప్రదాయాలు కూడ చాలవరకు ఒకే రీతిగా ఉన్నవి. ఈ రెండు తెగల శ్రేష్ఠుల యందును, వారివారి వ్యాపారమునకు సంబంధించిన వారికి మాత్రమే అర్థ మగునట్టి సాంకేతిక భాషలు గలవు. నగరత్తారులు, నగరంవార లిరువురును, వారి వారి వ్యాపారసాంఘికవ్యవహారాది విషయములలో వారి కుటుంబము లందలి యువకుల మాటకు విలువ యిచ్చుట ఆచారమై యున్నది.

శ్రీనాథకవిసార్వభౌముని 'హరవిలాస' ప్రబంధమును అంకిత మందిన అవచి తిప్పయ శ్రేష్ఠి నగరంవారి తెగకు చెందినవాఁడు. ఇతడును, ఇతని తండ్రియు, తమ్ముండ్ను కూడ, క్రీ. శ. 14, 15 వ శతాబ్దములందు, ఆంధ్ర దేశములోని, కొండవీటి రెడ్డిరాజుల కాలమందు, ఆ నాటి రాజులతో సమానమైన, ఆర్థిక, రాజకీయ ప్రతిపత్తి గల వారు. ఈ అవచి తిప్పయ్యశ్రేష్ఠి వంశానికి మూలపురుషులుగా, తిరుక్కచ్చినంబి, సిరుతొండనంబి అను వైశ్య శ్రేష్ఠులు హరవిలాసమందు పేర్కొనబడినారు. తిరుక్కచ్చినంబి, 'సుధామణి పులవార్' చే రచింపబడిన వైశ్య పురాణములో, విశిష్టాద్వైతము స్థాపించిన రామానుజాచార్యులవారికి సమకాలికుడని చెప్పబడినది. సిరుతొండనంబి, పాలకురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమందును, తిరుజ్ఞాన సంబంధ రచితములగు 'తేవారము' లందును, అరువది మూడు శైవ నాయనారులలో ఒకడుగా పేర్కొనబడినాడు. వీ రిరువురును నగరత్తారుల అది నివాసస్థాన మగు, కాంచీపురములోని ప్రముఖ వర్తక శిఖామణులని హరవిలాస మందు చెప్పబడినది.

మొదట యీ శ్రేష్ఠులు, నాడు శ్రేష్ఠులు, నగర శ్రేష్ఠులు, నానాదేశ శ్రేష్ఠులని మూడు తెగలుగా నుండిరి. నాడు శ్రేష్ఠులు, 'న్యగ్రోధ జాతక' మందు చెప్పబడిన జానపద శ్రేష్ఠులై యుందురు. వీరు గ్రామీణ వ్యాపారమునకు పెన్నిధానములై యుండిరి. నగర వ్యాపారమునకు సంబంధించిన అవచిదేవయ్య, తిప్పయ్య శ్రేష్ఠి వంటివారు, నగరత్తారులు లేక నగరంవారని చెప్పబడే నగర శ్రేష్ఠులై యుందురు. నానాదేశ శ్రేష్ఠు లనబడేవారు, అనేక విదేశములతో ఎగుమతి దిగుమతి వ్యాపారవాణిజ్యములను సాగించుచుండిన శ్రేష్ఠులు. క్రీ. శ. 1417 వ సంవత్సరపు సేలము జిల్లా శాసనములో 'మహా ఓడ వ్యాపారి' యను బిరుదము గల అన్నామలై శ్రేష్ఠిని గురించి చెప్పబడినది.[4]

ఇట్టి వివిధ శాసనముల నుండి నగరమువారు ఆంధ్ర దేశమందును, నగరత్తారులు తమిళనాడు నందును, ఆ నాటి నగరములలో, వర్తక సంఘములుగా (Merchant guilds) ఏర్పడి, ఆయా నగర పరిపాలనా సంస్థలయందు ప్రముఖులుగా నుండినట్లు తెలియుచున్నది. నేటి సౌత్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ (The South Indian Chamber of Commerce) ను, 'ఆంధ్ర ఛేంబర్ ఆఫ్ కామర్స్ (Andhra Chamber of Commerce) ను, ఇండియన్ బ్యాంకు (Indian Bank), ఆంధ్రాబ్యాంకు (Andhra Bank) లును ఆనాటి నగరత్తారుల, నగరము వారల వర్తక సంఘములను దలపునకు దెచ్చుచున్నవి.

---

3. Vide-Turrston's Castes and Tribes of South India and Vysyapurana.

4. Vide. Inscription 116 of Salem Dist. in V. R. I. of Madras Presidency.

# గ్రంథ విమర్శనము

## తెలుగులో ఛందోరీతులు

(రచన: డాక్టరు గిడుగు వేంకటసీతాపతి, ప్రాప్తిస్థానము: ఆంధ్రా బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాదు 1. పుటలు 37+256, మూల్యము రు. 6, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి బహుమతి నందిన గ్రంథము.)

శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు 1919—20 నడుమ తమ తండ్రిగారును, వ్యావహారిక భాషోద్యమనిర్మాతలును, లక్ష్య పరిజ్ఞానమున నిరుపమానులు నగు శ్రీ వేంకట రామమూర్తి పంతులుగారు నిర్వహించిన "తెలుగు" పత్రికలో "ఛందో రహస్యములు', 'నన్నయ సీసములందుగల వడి ప్రాస నియమములు', 'అఖండవడి' మొదలయిన విషయములను గూర్చి వ్యాసములు ప్రకటించినారు. వావిళ్లవారు ప్రకటించిన అనంతుని ఛందోదర్పణమునకును, కాకునూరి అప్పకవి అప్పకవీయమునకును క్రమముగా 1921, 1922 సంవత్సరములలో ఉపోద్ఘాతములను రచించినారు. ఇట్లే వివిధ సాహిత్యపత్రికలలో నలువది సంవత్సరములకు పూర్వము తెలుగులోని ఛందోరీతులను పరిశీలించుచు వ్రాసిన వ్యాసము లిటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నిర్వహించిన స్పర్ధహేతువుగా సమీకృతములై ప్రకృత గ్రంథరూపమును తాల్చినవి.

ఈ గ్రంథమునం దాఱు ప్రకరణములున్నవి. మొదటి ప్రకరణమున ఛందశ్శాస్త్ర స్వరూపము, వృత్త లక్షణ ప్రస్తార విధానాదులు వివృతములు. రెండవ ప్రకరణమున పద్య రచనా నిర్మాణము చర్చింపఁబడినది. గేయ రచనము పద్యరచనకుఁబూర్వము ప్రవర్తిల్లియుండునను సర్వాంగీకృతసిద్ధాంతము స్పష్టమై, జానపదగేయములలోని వివిధగతులుదాహరణ పూర్వకముగా పరామృష్టములైనవి. మూఁడవ ప్రకరణమున మాత్రాగణ నిబద్ధములయిన ఛందోరీతుల పరిశీలనము జరిగినది. ఈ ప్రకరణమున కందషట్క లక్షణ నిరూపణము, నక్షర సంఖ్యా నియమము లేకపోవుటచే, వివిధగతుల నడుచు కందముల సునిశిత పరిశీలనము ప్రధానవిషయములు. నాలుగవ ప్రకరణమునం దుపజాతుల లక్షణము నిరూపితము. ఈ ప్రకరణమున ద్రావిడ భాషలలోని సూర్యేంద్రచంద్రగణముల తులనాత్మక పరీక్షణము, ద్విపద, తరువోజ, సీసము, తేటగీతి, ఆటవెలది పద్యములకుఁగల సంబంధమును గూర్చిన పరిశీలనము కానవచ్చుచున్నవి. నన్నయ్యగారు రచించిన సీసములు (251) సమగ్రముగా పరిశీలితములై తద్రచనమునందా మహాకవి పాటించిన నియమము లొక Table రూపమున పాఠకులకు సుగమము లొనర్పఁబడినవి. అనంతుఁడు, అప్పకవి మున్నగు లాక్షణికులు నిరూపించిన సీస భేదములలో నన్నయగారు పాటించిన నియమములు గతార్థములుగాకపోవుటచే నీ నిరూపణము సీతాపతిగారి ఛందశ్శాస్త్రమందలి గాఢ పరిశ్రమమునకు తారకాణముగుచున్నది. ఈ నిరూపణము సాధ్యసాధ పాఠ నిర్ణయమునకుపకరించుననుటకుఁ బ్రదర్శింపబడిన యుదాహృతులు ప్రమోదమును గొల్పుచున్నవి. అరణ్య పర్వము 2—231 పద్యమును (చూ. వావిళ్ల ప్రతి) నన్నయ్యగారు పూర్తిగా నడిసీసముగా నుద్దేశించిరి. కాని, ఎత్తుగీతిలో 'సుత చరిత్రుండైన ఋతుపర్ణుఁ గీర్తింప' ననుచో ప్రాసయతి కన్పట్టుచున్నది. ఈ పాదమునకు 'ఋజు చరిత్రుండైన' 'ఋషి చరిత్రుండైన' అను పాఠాంతరములు కానవచ్చుచున్నవి. ఈ పాఠాంతరములే స్వీకార్యములు. అప్పకవి ప్రభృతులు నిరూపించిన మధ్యాక్కర లక్షణము ననుసరించినచో నన్నయగారి మధ్యాక్కర లందు గణ విభజనము పొసఁగదు. విశ్రాంతి కుదురదు. ఇవి సమన్వితములగుటకు శ్రీ సీతాపతిగారు మధ్యాక్కరలో మూడవ గణముగానుండు సూర్యగణము 2 వ గణముగానో, 4 వ గణముగానో ఉండవచ్చునన్న అనుమతి పూర్వముండియుండునను ఊహను చేసినారు. (చన నింద్ర యుగళంబుమీఁద బలజావ్రు నొక్కని జేర్చి—అప్పకవీయము 4—277). ఈ సూచన సంగీకార్యముగానే తోచుచున్నది. ఐదవ ప్రకరణమున లాక్షణికులు నిరూపించిన యతిప్రాస భేదముల స్వరూపము సంగ్రహముగా వివరింపఁబడినది. ఆఱవ ప్రకరణమున దేశికవితకు ఛందస్సును, నూత్నముగా నిర్మింప వలసిన యావశ్యకత యుపదేశింపబడినది. ఈ గ్రంథమం దాయా ప్రకరణములలో వివరింపబడిన కొన్ని యంశములను సమగ్రముగా బోధపరచుకొనుటకు సంగీత పరిజ్ఞాన మావశ్యకమగుచున్నది. ఈ విధముగా గ్రంథము బహు విషయ వివరణాత్మకమై, సీతాపతిగారి గాఢ పరిశ్రమమునకు స్ఫోరకముగా నున్నది.

కాని క్రింది విషయములు మాత్రము విచారణీయములుగా నున్నవి.

1. 'అ ఆ ఐ ఔ లకు మఱి, ఇ ఈ లు ఋకార సహితమె ఏలకు నా, ఉ ఊ ల్దమలో నొడఁబడి, ఒ ఓ లకు వళ్లగు న యోన్నత చరితా' అను పద్యమందలి 'అ, ఇ, ఉ, ఎ, ఒ' అను హ్రస్వాక్షరములు గురువులుగా నుచ్చరింపఁబడినచో ఛందోభంగ మనివార్యము. ఈ ఉచ్చారణము (హ్రస్వమునకు దీర్ఘోచ్చారణము) పెక్కు శబ్దములలో వినఁబడుచుండుననియు దీనికి Glottal Stop అని పేరనియు సీతాపతిగారు వివరించి, ఈ ఉచ్చారణ మెట్లు కలుగుచున్నదో లాక్షణికులు నిర్వచింపలేదని వ్రాసినారు. (చూ. పు. 24, 25)

సర్వ లక్షణసారసంగ్రహమందలి విశ్రమ ప్రకరణమునఁ గానవగు క్రింది పద్యమును గాంచుడు.

'ఓలిన ఆలు నైకౌలు నొక్కటగును
లీల నీ ఈల్ ఋకారమే ఏలునొకటి
తలపఁ మా ఊలు వో ఓలు గలయు నొకటి
స్వర విరామంబులివి కరివదనజనక'—పు. 123.

దీర్ఘ స్యాద్వర్ణ నిర్దేశే (ఒకచో హ్రస్వంబు దీర్ఘంబగు— నిర్దేశ విధానంబులంగా రేఫ ప్రత్యయములు రానియెడల హ్రస్వమునకు దీర్ఘము వచ్చునని యర్థము. ఉ. ఆకు ఊ వచ్చును, కాకు గా వచ్చును, లాకు రా వచ్చును—(ప్రౌఢ వ్యాకరణము, సంజ్ఞా సూ 3) అను అథర్వణుని విధిచే నిర్దేశమున హ్రస్వాక్షరములకు దీర్ఘము ప్రాప్తించినదని సమన్వయింపవచ్చును. కావున పూర్వ లాక్షణిక మార్గానుసరణముననే ప్రకృత లక్ష్యము నిర్దుష్టమగుచున్నదని సీతాపతిగారికి సమాధానము.

2. యతి పర్యాయ పదములలో వడియనునది తెలుగు. దాని వ్యుత్పత్తి యూహ్యము—అని కీ. శే. జయంతి రామయ్య పంతులుగారు కవిజనాశ్రయ పీఠికలో వ్రాసినారు. వారు వ్రాసినట్లు వడియేకాదు వళి కూడా (ఆ యర్థమందే) తెలుగు పదమే—పుట—214.

ఈ యాక్షేప మనావశ్యకము. వడియను పదమునకు వళి రూపాంతరమేగాని, భిన్నపదము గాదు.

3. వర్ణభేదము లన్నియు సమాకలనము చేసికొని గుర్తులుంచి తెలియజేయుదురు:

అ = ఐ = ఔ = హ = య (=మైత్రికి గుర్తు. హ్రస్వ స్వరమునుబట్టి దీర్ఘస్వరము కూడ ఉన్నట్లే తెలిసికొనవలెను) —పుట 225. హ, య లకు మైత్రి చెల్లుటగాని, హ య లత్వమునకు చెల్లుటగాని స్వరయతులలో జేరినవిగావు.

"మొదలి యంతస్థవర్ణంబు తుదిని బొదలు
నూష్మమును ఋజుసంజ్ఞచే నొకటి కొకటి
యతులగు నపారశూర సంహారయనఁగ
హరముఖార్చిత పాద తోయజయనంగ'
అప్పకవీ 3—79

అట్లే హయలత్వమునకుఁ జెల్లుట సరస విశ్రామము (3—105). ఇవి రెండును వ్యంజనాక్షర విరతి భేదములు.

4. ఁ ంప్ = ఁ ంయ్ = వ్ (ఁయ్ అనగా, య, ర, ల, వ, శ, ష, స హలు 8 న్ని—ఁ అను నాసికములుకాక, తక్కిన వర్గాక్షరములు నాలుగు అని తెలియజేయుగుర్తు. ఈ నాలుగును అన్యోన్య మైత్రి గలవని అర్థము)—పుట—225.

పూర్ణబిందుపూర్వకములై పవర్గాక్షరములునాలుగు మ కారమునకు చెల్లును. ఇది బిందుయతి. అట్లే అది బిందుయుతములై అంతస్థములు, ఊష్మాక్షరములు మ కారమునకుఁ జెల్లును. ఇది మ వర్ణ విరామము. అది బిందు యుతములైన ప వర్గాక్షరములు, పూర్ణానుస్వార పూర్వకములైన య, ర, ల, వ, శ, ష, స, హలతో మైత్రిని పొందనేరవు. సీతాపతిగా రవలంబించిన సంకేతములచే నా భ్రాంతి అనివార్యమగుచున్నది.

5. ఁ ంత్ = న్; ఁ ంట్ = ణ్ అని బిందు యతుల క్రిందను న్—ణ్ అని సరస యతులక్రిందను అంద[illegible]ను చెప్పినారు. ఇవికాక ఁ ంత్ = ణ్, ఁ ంట్ = న్, ఁ ంత్ = ఁ ంట్—ఇవి వేఱు భేదములుగా అప్పకవి చెప్పెనుగాని, అనవసరము. బిందు సరస వర్ణలో చేరియున్నవి—పుట 227.

నకార ణ కారములకు మైత్రి సరసయతి అనుపేర అప్పకవిచే నిర్దేశింపఁబడుటచే ఁ ంత్ = ణ్, ఁ ంట్ = న్ అని అనునాసికాక్షరయతి నాతఁడు నిరూపించు టనవసరమనఁ జెల్లును. కాని ఁ ంత్ = ఁ ంట్ (అనుస్వార సంబంధ యతి) అనావశ్యక మెట్లగునో ఊహింప రాకయున్నది. బిందుమాత్రప్రయోగమున వ్యంజనములు సాజాత్యములు కావుగదా?

6. అనంతుఁడు సమప్రాసవిధులు చూపించి మరి 11 విధములైన ప్రాసములను గూర్చి చెప్పెను. అనంతుడు చెప్పిన 12 విధములేకాక, మరి యేడువిశేషములను అప్పకవి వివరించెను.

(1) వేఁడు, పండ్లకు
(2) లోక, (భా) షా క్ష్మప్తకు
(4) తమ్ములు, (భ) క్తిమ్మురు (భక్తిన్+మురు)లకు—పుట 235.

1—ఈ ప్రకారముగా ప్రాసము చెల్లునని అప్పకవి చెప్పలేదు.

రలలు తమ క్రింద జడ్డలైఁ గ్రాలు వ్రాలు
ప్రాసవర్ణంబులై నానిఁబాసియైనఁ
గూడియైనను బెఱియడుగులను నిలుచు
సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి 3—314
పాండి ద్రవ్వఁగ నిమ్ము నా తండ్రి కృష్ణ
వేండుకొనియెద సందాకఁ బండ్ల దినము
దుండగపు చేష్టలును నోటిగాండ్రతనము
మెండుగాఁ జొచ్చె నీకు నైదేండ్ల కనఁగ—3—315

తుది పద్యమున శ్రీరామమూర్తి పంతులు గారిచే పరిష్కృతమైన అప్పకవీయమున 'పాండి, వేండు' అను అర్ధ బిందుకములైన రూపములు కానవచ్చుచున్నవి. ఖండాఖండప్రాస మప్పకవికి సమ్మతము. పూర్ణా పూర్ణప్రాస మే లాక్షణికునిచేతను సమ్మతింపఁబడలేదు. ఇంతయేల రెండు పద్యములను పరిశీలించిచో 'దీర్ఘాచ్ఛేత్తి ఖండ ఏవ న క్షేయః' అను శబ్దానుశాసనుని విధి నతిక్రమించి, 'పాండి, వేండు' అను రూపములనే పద్యమున నిలుప వలయునని స్పష్టము గాకపోదు.

2—ఇది ముద్రా దోషముగావచ్చును.
4—తమ్ములు, భక్తిమ్మురు

ఈవిధముగా నప్పకవి చెప్పలేదు. చూడుఁడు.

తమకుఁ దాము ద్విత్వంబులై తనరు నవియుఁ
బూర్ణ బిందులు దాపలఁ బొరయు నవియు
గలసి యమునాసిక ప్రాసములను పేర
న మ లమరుఁ గావ్యముల యందుఁ దమకుఁ దాము
3—340.

భక్తిన్ + మురఁ అనుచో 'ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతంబునకు మకారా దేశంబగు' (కమ్మని లతాంతము లకు మ్మొనసి, భార. ఆది 5—137, వృష్టిజే, పెమ్మహానది దీర్ఘికా సరసీ నదంబులు నిండఁగాన్—అర—3—113) అను నర్వాచీన లాక్షణికుల నిరూపణము ననుసరించి అప్పకవి చెప్పిన దానికి విరుద్ధముగా లక్ష్య పద్యములలో ద్రుతమునకు మాఱుగా వీరి పీఠికతో వెలసిన అప్పకవీయమున మకారము నిలుపఁబడినది. సరళ స్థిరపరకత్వమున ద్రుతమునకుఁ గ్వాచిత్కముగా బిందువు వచ్చునని నన్నయ్యగారి ఆంధ్ర శబ్దచింతామణి. (బిందుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్—కాంచెంబావ, మెచ్చెం మాధవుడు— అని బాలసరస్వతి యుదాహృతులు). ఈ ప్రాచీన నియమమునే అప్పకవీయము అనుసరించెను. (చూ. ద్రుత ప్రకృతి కాంత బిందా దేశము, పు. 324, 325). కావున ప్రాసగత మకారమునకు ముందున్న ద్రుతస్థానమున పూర్ణబిందువు వచ్చును. అప్పుడు అప్పకవి లక్ష్యము క్రింది ప్రకారముగా నుండును.

తమ్ములను మల్లికాకుసు
మమ్ముల మరువాదిపత్రమాలికలను భ
క్తింమురసంహరు పూజలు
సంమదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్ 3—342

కావున ప్రాస చెల్లునది 'తమ్ములు, భక్తిమ్ముర'కుగాదు. తమ్ములు, భక్తింముర అనువాని కని స్పష్టము.

ఇట్లే సర్వ సమ్మతములుగాని కొన్ని విషయముల ప్రసంగమును ప్రకృత గ్రంథమునలేకపోలేదు. ఈ గ్రంథము ఛందశ్శాస్త్రాభిమానులెల్ల రవశ్యము పఠింపఁదగినది. రెండవ ముద్రణమున విరళగణేయములు కాకపోవుటచే విచారమును గొల్పుచున్న ముద్రాదోషములు సవరింపఁబడునని యాశింతుము. ప్రకృతగ్రంథమున శుద్ధాశుద్ధ పత్రిక కానరాకపోవుటకుఁ గారణము సీతాపతిగారు దీని నిరువదిమూఁడు దినములలో సిద్ధము చేయుట కావచ్చును.

ఏ. జి. కె.

## "ఖుతుబ్షాహీ సుల్తానులు - ఆంధ్ర సంస్కృతి"

[సంపాదకుడు—డా బి. రామరాజు, యం. ఏ. పి. హెచ్ డి. ప్రచురణ:—ఇదార-అద్బియాతె-ఉర్దూ. పంజగుట్టరోడ్డు. హైదరాబాదు; వెల, రెండు రూపాయలు].

భారతీయ సంస్కృతి యనగా హైందవసంస్కృతి యని యుద్ఘాటించువారు తప్ప మిగిలిన సమచిత్తు లందఱు మహమ్మదీయ సంస్కృతి ఏ విధముగా మనసంస్కృతిని పరిపోషించినదో అవగాహన చేసికొందురు. మహమ్మదీయ సంస్కృతితోడి ఆదానప్రతిదానములవలన భారతీయ సంస్కృతి బలిష్ఠమయినదని వైవిధ్యమును సంతరించి కొన్నదని పూర్వపక్షము లేకుండ చెప్పవచ్చును—దోషైక దృక్కులము కానివాడు మాత్రము. సమకాలీన రాగద్వేషములకు స్వస్తి చెప్పి చరిత్రము చదువ మొదలిడినచో ఆనాటి హస్తినాపుర మహమ్మదీయ ప్రభువుల నుండి, మొన్న మొన్న కూలిపోయిన హైదరాబాదు అసఫ్‌జాహి వంశీయుల దాక ఒకానొక రాగరంజితగాథ కన్నె గులాబుల తావులతో, అత్తరు వన్నెటి జల్లులతో, ద్రాక్షాసవ ధారలతో, లలితకళాలక్ష్మీ లాస్యములతో, నగారా నౌబత్తుల 'షెహనాయ్' సితారుల లయల సుతారాలతో మనకు సాక్షాత్కరించును. ఢిల్లీ సుల్తానులచరిత్ర, మొగలు పాదుషాల మోహనగాథలు, దక్షిణాపథ మహమ్మదీయ దర్ప విలాస కథలు పఠించి పరవశింపని వా రెవ్వరుందురు ?

బహమనీసామ్రాజ్యమువలన దక్షిణాపథచరిత్ర రక్తప్లావిత మగుట తప్ప అన్యప్రయోజనము సిద్ధింప లేదని విన్సెంటు స్మిత్తుగారి తీర్పు. ఈ బహమనీ సామ్రాజ్యము పంచబంగాళము కాగా గోలకొండ, బీజపూర్, బీదర్ మున్నగు పంచరాజ్యము లేర్పడినవి. అళియ రామరాజు కాలములో విజయనగర బహమనీ రాజ్య పంచక బాంధవ్యము ఒక కుదురు వారిదిగా కొనలు సాగి చివుళ్ళు తొడిగినది. కాని యేమిలాభము ? రాజ్యతంత్రము సమ్మోహపఱుపగా, ఏడేండ్లు విజయనగరములో కుడిచి కొలువు సింగారమై కూర్చున్న ఇబ్రహింకుతుబ్‌షా తదితరమహమ్మదీయ ప్రభువులు గత గాథను విస్మరించి తళ్లికోట యుద్ధములో రామరాయల కుత్తుకను ఉత్తరించిరి. విజయనగరమును నిర్ధూమధామము చేసిరి. బహమనీరాజ్య పంచకములో గోలకొండ చరిత్ర యుదాత్తమైనది. ఆ రాజ్యము పాలించిన ఖుతుబ్షాహి సుల్తానుల మన్నెరికము జాతి మత భేదాతీతమై కొనసాగినది. ఆ సుల్తానులు దృఢచిత్తులై—రాజ్యసంక్షోభమార్గమయినప్పటికి—ఆంధ్ర సంస్కృతిని అభివృద్ధి చేసిరి. సరోజనీ నాయుడు ఆ సుల్తానుల సమాధులను గూర్చి యిట్లు గానము చేసినది.

"Though Centuries falter and decline
Your proven strongholds shall remain
Embodied memories of your line
Incarnate legends of your reign."

ఆంగ్లరాజ్యము సుప్రతిష్ఠితమగు వఱకు ఆంధ్రభూమండలమును ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించి ఆంధ్రసంస్కృతి విచ్ఛిన్నముగాకుండ పాటుపడినవారు గోలకొండ—ఖుతుబ్షాహీ సుల్తానులు. విజయనగర సామ్రాజ్యమునకు, ఆంగ్ల రాజ్య

మునకు మధ్య కాలికి పూనవలె నుండునది గోలకొండ రాజ్యము. ఖుతుబ్షాహీ సుల్తానులు ఏ విధముగా ఆంధ్రసంస్కృతి వ్యవసాయము చేసి అంబారమును సేకరించిరో "ఇదార—అద్బియాతె—ఉర్దూ" సంస్థవారు ప్రచురించిన "ఖుతుబ్షాహీ సుల్తానులు—ఆంధ్ర సంస్కృతి" యను నూటయెనుబది పుటల గ్రంథము చాటుచున్నది. ఈ గ్రంథమునకు సంపాదకులు డాక్టరు బి. రామరాజుగారు. రామరాజుగారు తెలుగు వారికి క్రొత్తవారు కాదు. ఇదివరకే వారు సంపాదకులుగా నుండి తమ విద్యార్థులచే ఆంధ్ర సంస్కృతి చరిత్రలను సమగ్రసుందరముగా వ్రాయించిరి. ఈ విధముగా వర్తమాన రచయితలగు శిష్యులకు ప్రోత్సాహ మిచ్చువా రెందరో యుండరు.

"ఖుతుబ్షాహీ సుల్తానులు—ఆంధ్ర సంస్కృతి" యను గ్రంథములో పది ఆంధ్రవ్యాసములు, మూడాంగ్ల వ్యాసములు గలవు. దివాకర్ల వేంకటావధానిగారు "వైజయంతీ విలాసము", "ప్రథమాంధ్రయక్షగానము" అను వ్యాసములు రచించిరి. వైజయంతీవిలాస సుగ్రీవ విజయముల విమర్శ సమగ్రముగా నున్నది. వేంకటావధానిగారి వ్యాసములలో కావ్యాత్మ విమర్శకంటె, అంగి విమర్శ కంటె— కావ్యాంగ విమర్శ యెక్కువ. వారి వ్యాసములు రెండును ఈధోరణిలో నడచినవి. ఇ. వసుమతిగారు "అద్దంకి గంగాధరకవి—తపతీ సంవరణోపాఖ్యానము" అను ఆంధ్రవ్యాసమును, "ఇబ్రహీం ఖుతుబ్‌షా అండ్ టెలుగు పొయెట్స్" అను ఆంగ్లవ్యాసమును రచించిరి. వసుమతిగారు తపతీ సంవరణోపాఖ్యానమును గూర్చి రచించిన వ్యాసము సాంకేతిక పద్ధతిలో సాగిన పరిపూర్ణ విమర్శ. ఈ విమర్శలో అభినివేశము అధికము. రచయిత్రి గంగాధరకవి న్యాయ తర్క శాస్త్రపాండిత్యములను గూర్చి యుత్యుక్తులు వ్రాసిరి. "ఆ పల్లవాధరకివా, కేవట్టున వెంచి చూడ నేకగ్రీవం బీ పనికి సంశయింపకు" అను 2 ఆ. 70 పద్యము విజయ విలాసమందలి "మా కలకంఠియు నీవును, నేకగ్రీవముగ నుండు రివ్వాళ్ల నయో" యను పద్యమును బోలియున్నది" అని వసుమతిగారు వ్రాసిరి. ఇబ్రహిం కుతుబ్‌షా క్రీ. శ. 1550 మొదలు క్రీ. శ. 1580 వరకు రాజ్యమేలినవాడు. చేమకూర వేంకటకవి రఘునాథ నాయకుల ఆస్థానకవి. రఘునాథ నాయకుడు క్రీ. శ. 1614 మొదలు 1633 వరకు తంజావురాధీశుడైనవాడు. అట్టిచో గంగాధర కవి చేమకూర వేంకటకవిని అనుసరించుట యెట్లు పొసగును ? ఒకవేళ వసుమతిగారు చేమకూర వేంకటకవియే గంగాధర కవిని అనుసరించినాడని చెప్పుచున్నారని యనుకొనుటకు "ఇతని భావములకు మూలములయిన యితర పూర్వకవుల భావములు కొన్నిట సూచింపబడుచున్నవి" యన్న వాక్యము (పుట 60) ప్రతిబంధకముగా నున్నది. వసుమతిగారి రెండవవ్యాసము మల్కిభరామును గూర్చి భట్టులు, తదితరులు చెప్పిన చాటువులు ఆధారముగా రచింపబడినది. విశేషము లేమియు లేవు.

"వింధ్యదేశాధీశు వెల్లి వల్యాల మీద, గౌళీశు వస్త్రాల గద్దె మీద, పాంచాలభూమీశు పట్టువల్లముమీదః బాంధ్య భూపతి వెండిబరణి మీద" యని ప్రభాకర శాస్త్రిగారి "చాటుపద్య మణిమంజరి" లో (పుట. 44) నున్నది. కాని వసుమతిగారి వ్యాసములో (ఆంగ్ల భాగము. పుట. 39) "వింధ్యదేశాధీశు వెల్లివల్యాల మీదః, బాంధ్య భూపతి వెండిబరణి మీద" యని మాత్రమే యున్నది. ఇది ముద్రణ స్ఖాలిత్య మనుకొందును.

బి. రామరాజుగారు "భాగీరథీ పట్టణము—భాగ్య నగరము" "సౌబతి కృష్ణయామాత్యుడు" అను వ్యాసములు సమకూర్చిరి. రెండవవ్యాసము చక్కగా నున్నది. దీనిలో రామరాజుగా రెన్నో నూతనవిషయములు వెలుగునకు తెచ్చిరి. ప్రథమవ్యాసము గోలకొండ, హైదరాబాదులకు భాగీరథీ భాగ్యనగర నామధేయములు కల్గుటకు హేతువులు పరిశోధింపబడినవి. ఆదిరాజు వీరభద్రరావుగారు రచించిన "ఖుతుబ్షాహీ సుల్తానుల కాలములో ఉర్దూ సాహిత్యము" అను వ్యాసము, కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి "ఖుతుబు షాహీల ఆంధ్రభాషాపోషణ" మను వ్యాసమును ఖుతుబ్షాహీ సుల్తానుల ఉర్దూతెలుగుభాషాపోషణమును స్థూలముగా వివరించుచున్నవి. నిడుదవోలు శివసుందరేశ్వరరావుగారివి రెండువ్యాసములు. అవి "గోలుకొండ ఖుతుబ్షాహీలు—ఆంధ్రదేశపు సంస్థానాధీశ్వరులు" "అచ్చతెనుగు పాదుషా—అమీను ఖాను" అనునవి. నేలటూరి వేంకటరమణయ్యగారు "ది ఖుతుబ్‌షాహీస్" అను నాంగ్లవ్యాసమును తీర్చిదిద్దిరి. ఈ మూడు వ్యాసములు కేవలము రాజకీయ చరిత్రకు సంబంధించినవి. డా. డి. వి. సుబ్బారెడ్డిగారు "మొహమ్మద్ కులీ్ ఇంటరెస్ట్ ఇన్ పీపుల్స్ హెల్త్ అండ్ మెడికల్ ఎయిడ్" అను నాంగ్లవ్యాసము మహమ్మద్ కులీ కట్టించిన వైద్యచికిత్సాలయమును, దాని ప్రణాళికను ఎక్కువగా వర్ణించినది.

రామరాజుగారు "ఇదార—అద్బియాతె—ఉర్దూ" సంస్థ జన్మాభ్యుదయములను పదునెన్మిదిపుటలలో వివరించిరి. ఆ సంస్థకృషి ప్రశంసాపాత్ర మయినదే ! కాని ఆ కృషి "ఖుతుబ్షాహీ సుల్తానులు—ఆంధ్ర సంస్కృతి" ప్రచురణమువలన సార్థకము కాలేదనియే చెప్పవలయును. జాతీయ సమైక్యము కొఱవడిన యీనా డిట్టి గ్రంథముల ప్రయోజన మెంతయో యున్నది. కాని యీ గ్రంథము అసమగ్రము. విషయవిభాగములో క్రమనియమములు లేవు. ఈ గ్రంథ ప్రచురణమం దొక విధమయిన తొందఱపాటు కన్పించుచున్నది. కుతుబ్షాహీలలో ఇబ్రహీం పాదుషా కిచ్చిన ప్రాముఖ్యము మిగిలిన పాదుషాలకు లేదు. అబుల్ హసన్ తానాషా వ్యక్తిత్వవర్ణన మసంపూర్ణము. అక్కన్న మాదన్నల సాచివ్యమును గూర్చి, కంచర్ల గోపన్న జీవితవిశేషములను గూర్చి యిందేమి వ్రాయబడలేదు. సందర్భోచితముగా వీరి పేరు లుదాహరించిన చాలునా ? ఈనాడు తానీషా గోపన్నల గాథను తడవుట యుచితము గాదని సంపాదకులు

భావించిరో యేమో! వైజయంతీవిలాసము పీఠిక వ్రాయించినట్లు ప్రథమాచ్ఛాంధ్రకావ్యమగు "యయాతి చరిత్ర" పయి గూడ సంపాదకులు విమర్శ వ్రాయించిన బాగుగా నుండెడిది. భాగమతీ మహమ్మదుషాల ప్రణయగాథకు సంబంధించిన పూర్వ చరిత్రకారులవాక్యములను యథాతథముగా అనువదించినచో మేల్తరముగా నుండెడిది. ఈ గ్రంథములో సాహిత్యమునకు రాజకీయచరిత్రకు నెక్కువ చోటు చూపిరి సంపాదకులు. సంస్కృతి యనగా సాహిత్యపోషణమే కాదు గదా! గ్రంథనామము అతిగంభీరము. కాని కుతుబ్షాహీ సుల్తానుల పరిపాలనము, కవిత్వేతర లలితకళా పోషణము, ఆ నాటి సాంఘిక మత పరిస్థితులు దీనిలో మచ్చున కయినా వివరింపబడలేదు. కొన్నివ్యాసము లాంధ్రభాషలో, కొన్ని యాంగ్లభాషలో నుండుటవలన ఒఱిగున దేమియు లేదు. అన్నివ్యాసములు ఆంధ్రభాషలో నున్నచో ప్రచురణసంస్థ లక్ష్యము పరిపూర్ణముగా సిద్ధించును. సంపాదకీయము చదివినతరువాత "ఇదార—అద్బియాతె—ఉర్దూ" సంస్థవారిట్టిగ్రంథములను ఇంతకంటె పరిపుష్టముగా ప్రకటింపగలరనుఆశ బలీయ మగుచున్నది.

## కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి డైరీ—ఉత్తరాలు

సంకలన కర్త :—[కె. వి. రమణారెడ్డి. ప్రచురణ :— కవికోకిల గ్రంథమాల. సెమ్మారెడ్డిపాళెం, ఎల్లాయపాలెం (పోస్టు), నెల్లూరు జిల్లా, మూల్యము రెండురూపాయలు.]

కవికోకిల దువ్వూరిరామిరెడ్డిగారు సాహితీ ప్రపంచములో చిరకీర్తి గాంచికొన్నవారు. సార్థక బిరుదాంకితులైనవారు. రామిరెడ్డిగారి నూతన కవితా కుహూకారము వలన నవీన సాహితీచైత్రవనము పులకించినది. వారి కవిత్వములో ప్రాచీన నవీనాంధ్రకవితా సంప్రదాయములతోబాటు పాశ్చాత్య కవితా జీవము, పారసీ భాషా మాధుర్యము మేళవించినవి. రామిరెడ్డిగారి కవనము ఒక "పానశాల". వారు కవియే కాదు. విమర్శకులు నైరి. రామిరెడ్డిగారు ఖండ కావ్యములు, కావ్యములు, నాటకములు రచించిరి. పారసీ భాషా కావ్యములను అనువదించిరి. కావ్యరచనాస్పర్థలో పాల్గొని "వనకుమారి" రచించి విజయనగరాధిపుల యొడ్డోలగములో ఉడుగర లందుకొనిరి. సమకాలీనుల ప్రశంసలను పొందిరి. రామిరెడ్డిగారివలె ప్రకృతి వర్ణనములు చేయగలవారు, అన్వయాపత్తి లేకుండ పద్యములు వ్రాయగలవారు, సొగసులు పిసాళించు పలుకుబడులను ఒలుకబోయువారు నవీన కవులలో ఎందరో లేరు. నవ్యతపేర నీరసకవితాసృష్టి గావించి వా రేనాడు లోకమున వెలయింపలేదు. వ్రాసిన నాలుగు ముక్కలు రసభావపారవశ్యములో వ్రాసి యుత్తమ కవితా కళ నుపాసించినవారు రామిరెడ్డిగారు.

ఇట్టి రామిరెడ్డిగారి అంతర ప్రవృత్తి యెట్టిది? వారి కవిత కుద్బోధకము లేవి? యను ప్రశ్నలు వారి కావ్యములను పఠించిన పాఠకుల మనసులలో జనించుట సహజము. ఆ ప్రశ్నలకు రామిరెడ్డిగా రయిన సమాధానము చెప్పవలె. లేక వారికావ్యము లయిన సహాయము చేయవలె. రామిరెడ్డిగా రీనాడు లేరు. కావ్యములు కొంతవఱకు మాత్రమే రామిరెడ్డిగారి హృదయాంతరాళమును పరిశీలించుటకు పాఠకులకు తోడ్పడును. ఇక గతి యేమి? ఈనాడు మన కా లోపము గూడ తీఱినది. దువ్వూరి వేణుగోపాలరెడ్డిగారు రామిరెడ్డిగారి "డైరీ—ఉత్తరాలు" ప్రకటించి సాహితీ జిజ్ఞాసువుల కృతజ్ఞతకు పాత్రులైరి. ఈ "డైరీ—ఉత్తరాలు" ప్రకటించుటయందు కే. వి. రమణారెడ్డిగారు సంకలన కర్తగా నున్నారు. గురజాడ అప్పారావుగారి డైరీలు, ఉత్తరాలు యిదివరకే ప్రకటింపబడినవి. రామిరెడ్డిగారి "డైరీ—ఉత్తరాలు" తజ్జాతి గ్రంథములలో రెండవది.

బ్రహ్మానందసహోదరమయిన రసానందమును వాంఛించిన భారతీయులకు జీవితచరిత్రలు, డైరీలు, లేఖలు వ్రాయుటలో గాని, వానిని తరువాతి తరముల వారికి సంస్కృతి సంపదగా అందిచ్చుటలో గాని శ్రద్ధాసక్తులు లేవు. జీవిత చరిత్రాదులు మోక్షసాధనములు కాదుగదా! డైరీలు వ్రాయుట పాశ్చాత్యసంప్రదాయము. ఒకానొక వ్యక్తి దైనందిన చర్యలు, తన్మీమాంసలు డైరీలో నిక్షిప్తములై యుండును. ఇతరులు దినచర్యవ్రాయువానికి చెప్పిన వృత్తాంతములు గూడ ఇందు చేరవచ్చును. పాశ్చాత్యదేశములలో ముఖ్యముగా ఆంగ్లదేశములో ఈ డైరీలు సాంస్కృతిక పునరుజ్జీవనయుగాంత మందుగాని కావ్య గౌ రవ మం ద లే దు. సామ్యూల్ పెప్స్ (1633—1703) దినచర్యా గ్రంథము సామాన్య మయినది. ఆంగ్లేయులు దానిని కావ్యముగా సంభావింతురు. జోనాథన్ స్విఫ్ట్ డైరీ ఆవేశజనిత మయినట్టిది. బాస్వెల్ రచించిన "జర్నల్ ఆఫ్ ఎ టూర్ టు హెబ్రిడ్స్" (1785) సుదీర్ఘమయిన దినచర్యాగ్రంథము. ఈ డైరీ లన్నియు తత్కర్తల మరణానంతరమే ప్రకటింపబడినవి. ఫ్రాన్సు దేశములోకూడ ఈ సంప్రదాయము ప్రబలినది. జూల్స్, ఎడ్మండ్ అను సోదరులిరువురు పదునాల్గవ లూయీ పరిపాలనమునాటి ఫ్రాన్సు పరిస్థితులు ప్రతిబింబించు డైరీలు వ్రాసిరి. ఇరువదవశతాబ్దములో వెలువడిన డైరీలలో "జర్నల్ ఆఫ్ కేథరీన్ మేన్‌ఫీల్డ్" కున్నంత కీర్తి దేనికిని లేదు.

రామిరెడ్డిగారి ఆంతరంగిక భావావేశములు వారి డైరీలో స్పష్టముగా కన్పడును. వారు తీవ్రభావావేశములు అనుభవించిన వేళలలో గాని కావ్యనాటకాదులు వ్రాయరు. "వానకాలమున అందు ముఖ్యముగా కలుపుదీయు కాలమున" రామిరెడ్డిగారు కృతికి శ్రీకారము చుట్టుదురు. తీవ్ర భావావేశములో నిద్రాహారము లెఱుగక వారు కావ్యరచనము గావించిరి. "మాధవ విజయము" రచించు రామిరెడ్డిగారు రసపారవశ్యములో శోకించిరట! సాయంకాలము వయాళికి వెళ్లినప్పుడు ఆ నాటకగత సన్నివేశములు కనులముందు

ప్రదర్శింపబడు చున్నట్లు వా రనుభూతి పొందిరట! నాటకగత సంభాషణములు వాడుక బాసలో నుండుట యుత్తమమనియు, గ్రామ్యగ్రాంథికభాషలను సందర్భోచితముగా సమాదరింప వలయు ననియు రామిరెడ్డిగారు తలంచిరి. వారు "ఎంకిపాట" లను గూర్చి సత్యము చాటిరి. 'వెంకి పాటలకు తెలుగు వాఙ్మయమున నొక స్థాన మొసంగ వలయును. లేకున్న కల్పింపవలయును. సంతోషమును గల్గించు ఏ ముక్కనైనను త్యజింపరా" దనుటలో రామిరెడ్డిగారి సత్యదృష్టి అవగతమగుచున్నది. ప్రియావియోగసమయమున రామిరెడ్డిగారెంత వేదనపొందిరో వారు వ్రాసిన పద్యములు మూకసాక్షులై చాటుచున్నవి. వారు భగ్నప్రణయజీవిగా కన్పడుచున్నారు. జేమ్సు హెచ్. జి. కజిన్సు గారు రామిరెడ్డి గారిపై ఎంతో ప్రభావము చూపిరి. కజిన్స్ లండన్‌లో నవీన భారత కవితోద్యమములనుగూర్చి యుపన్యసించుచు రామిరెడ్డిగారి యాంగ్లకావ్యమగు "వాయిస్ ఆఫ్ రీడ్" నుండి కొన్ని పద్యము లుదాహరించిరి. ఆ యుపన్యాసమును పత్రికాముఖమున పఠించిన యొక అమెరికా దేశీయుడు, ఈజిప్టులో విజ్ఞానయాత్ర చేయువాడు, "వాయిస్ ఆఫ్ రీడ్" చదువనిచో బ్రతుకజాలననియు, ఆ గ్రంథమును పంపుడనియు కజిన్స్ గారికి లేఖ వ్రాసెనట! తన దగ్గరనున్న యొక ప్రతిని కజిన్స్‌గా రా యమెరికాదేశీయునకు పంపిరట! "బ్రిటిష్ ఎంపైర్ ఎడిషన్ ఆఫ్ ఇంగ్లీష్ పొయిట్రీ" లో రామిరెడ్డిగారి పద్యములు మూడుదాహరింపబడినవి. రామిరెడ్డిగారికి చిత్రకళ యున్న, నాట్యకళయన్న నెంతో యభిమానము. సమకాలీనులగు కవులను గూర్చి పండితులనుగూర్చి, నటులను గూర్చి వారు విశిష్టాభిప్రాయములు డైరీలో వ్రాసికొన్నారు. ఆ కవు లింకను జీవించియున్నారు. రామిరెడ్డిగారు తన నాటిసర్వసాంస్కృతికోద్యమములలో పాల్గొంచికొన్నారు. ఇంతయేల? 1924 వ సంవత్సరమునుండి 1935 వ సంవత్సరమువఱకు రామిరెడ్డిగారి ఆంతర ప్రవృత్తిని, సుఖదుఃఖాత్మక మయిన దానిని, ఆంధ్రదేశ సాంస్కృతికజీవనముతో పెనవైచికొని పోయిన దానిని, 153 పుటల యీ "డైరీ—ఉత్తరాలు" బాహిరము చేయుచున్నవి.

రామిరెడ్డిగారు కవి యయిన రైతు. వారికి కళలయందే గాక శాస్త్రవిజ్ఞానమందు పరమాభిమానము కలదు. ఫొటోగ్రఫీ, రేడియో ఇంజనీరింగ్, జ్యోతిశ్శాస్త్రము, శిల్పవాస్తుశాస్త్రము మున్నగు వానిలో రామిరెడ్డిగారికి గొప్ప చొఱవ యున్నది. వారు రేడియో సెట్స్ నిర్మించిరి. రామిరెడ్డిగారు బహుభాషా కోవిదులు. వారికావ్యములు నెల్లూరి నెఱజాణలు. అట్టి కావ్యాలు రచించిన శ్రీ రామిరెడ్డి మనఃప్రవృత్తికి ఈ "డైరీ—ఉత్తరాలు" దర్పణము వంటిది.

## తెలుఁగు రచయిత్రులు

[కర్త: మోచర్ల రామకృష్ణకవి. ప్రాప్తిస్థానము: మోచర్ల రామకృష్ణయ్య, అడ్వకేట్. కవితానికేతనము. అత్తితోట అగ్రహారము, నెల్లూరు. వెల: మూడు రూపాయలు.]

రాగద్వేషములకు అగపడకుండ యథార్థ కథనమునందే యభినివేశముకలిగి విమర్శచేయువారు తెలుగునాట ఏ కొలదిమందియో యున్నారు. ఆ కొలదిమందిలో మోచర్ల రామకృష్ణకవిగా రొకరు. మోచర్ల రామకృష్ణకవిగారు "తెలుఁగు రచయిత్రులు" అను సాహితీవిమర్శనావ్యాసగ్రంథము రచించిరి. కవిజీవితములను వివరించు గ్రంథములలో మాత్రమే కవయిత్రుల ప్రస్తావన యున్నది. ప్రత్యేకముగా కవయిత్రుల జీవితములను, వారి గ్రంథవిశేషములను తెలియజేసిన రచయిత్రి యూటుకూరి లక్ష్మీకాంతమ్మగారు. మఱి కేవలము కవయిత్రుల కృతి విమర్శచేసినవారు మోచర్ల రామకృష్ణకవిగారు. "తెలుఁగు రచయిత్రులు" గ్రంథములో మొల్ల, ముద్దుపళని, రంగాజమ్మ, తరిగొండ వెంగమాంబ, కాంచనపల్లి కనకాంబ, చేబ్రోలు సరస్వతీదేవి, కనుపర్తి వరలక్ష్మమ్మ, స్థానాపతి రుక్మిణమ్మ, పొణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, చిలకపాటి సీతాంబ రచించిన కావ్య నాటకముల విమర్శ చేయబడినది. కాంచనపల్లి కనకాంబగారి కృతి విమర్శనమే యెక్కువ. నూటయేబది పుటలు గల ఈ గ్రంథములో కనకాంబగారి కావ్య నాటకముల విమర్శ అరువది యేడు పుటలకు పరివ్యాప్తమయినది. రామకృష్ణకవిగారు తాళ్లపాక తిమ్మక్క రచించిన "సుభద్రా కల్యాణము"ను త్యజించిరి. లఘుకావ్యమని యనుకొన్నారో యేమో! రంగాజమ్మ రచించిన "మన్నారుదాస విలాసము" మాత్రమే విమర్శింపబడినది. ఆమె రచించిన "ఉషా పరిణయము" ఏనాడో అచ్చయినప్పటికి రామకృష్ణకవిగా రెందులకో దాని నుజ్జగించిరి.

రామకృష్ణకవిగారు ప్రాచీనగ్రంథములను ప్రాచీన దృష్టితో, నవీన గ్రంథములను నవీనదృష్టితో విమర్శించిరి. వారు కవితాశక్తి యెట యెంతవరకున్నది యని వివేచించిరి. ఈ వివేచనము శబ్దసాధ్వసాధు విచారముతో కూడ కూడియున్నది. ఒక్కొకచోట ఇదియే యెక్కువయినది. రామకృష్ణకవిగారు మొల్ల రామాయణ మందలి ధ్వన్యలంకార విశేషములను అవాల్మీకములను వివరించిరి. "సోమగ్రహతారక శెల్లను" అనుచోట సువర్ణము గురువని భావించి, గణభంగము జరిగినదన్నారు గ్రంథకర్తగారు. "సంస్కృత పదములయందు సంయుక్తాక్షరమునకుఁ బూర్వాక్షరము లఘువని భావింపదగు" నన్న రామకృష్ణకవిగారి వాక్యము (పుట—17.) సిద్ధాంతముగా నున్నది. మఱొకమారు వా రీ వాక్యమునందలి సామంజస్యమును పరిశీలింతురుగాక! ఇట్టి పట్టులలో ప్రాచీన కవిప్రయోగములనుజూచిగాని, యిట్టి వాక్యములు వ్రాయరాదు. సంయుక్తాక్షరమునకు పూర్వమందున్న యక్షరము లఘువుగానున్న ప్రయోగములు నన్నయభారతమునందే యున్నవని విమర్శకులు పేర్కొనుచున్నారు. నన్నయానంతర ప్రామాణిక కవికృత కావ్యములలో గూడ నిట్టి ప్రయోగములు కలవు. అఖండయతులును భారతమందు కలవని విమర్శకుల తీర్పు. వ్రేలు చూపిన చేయి మ్రింగు నవీనులు లక్ష్యము లున్నవిగదా యను ధైర్యముతో తమ కావ్యములలో దోయింపు కలుగునట్లు పై ద్వివిధ ప్రయోగములు చేయుచున్నారు. ముద్దుపళని కవితావైదుష్యము రచనా కళ వివరింపబడినవి.

“అబాల గోపాలము తెలుగువారు నిశ్శంకముగాః జదువుట కనుకూలముగా ఈ రసవత్కావ్యము నిర్దుష్టముగా సంస్కరింపబడి, ముద్రితముగునట్లు” ప్రభుత్వము సాయపడవలయునని రామకృష్ణకవిగారు కోరినారు. ఇట్లయినచో ఎన్నోప్రాచీనకావ్యములు పరిష్కరింపబడవలసియున్నవి. ఎప్పుడయినను ప్రాచీన కావ్యములను—శృంగార కావ్యములయినను—కొందఱె పఠింతురు. ఆ కొందఱు కావ్యమునందలి యశ్లీలపద్యములవలన అంతగా ప్రభావితులుకారని అనుకొనుచున్నాడ. “మన్నారు దాస విలాస” విమర్శలో విశేషములేదు. వేంకటాచల మహాత్మ్య విమర్శ కూడ అట్టిదే. వెంకమాంబ “రచనములో భాషావ్యతిక్రమము” ఉన్న వన్నారు కవిగారు (పుట—56.). అట్టి భాషా వ్యతిక్రమములు, వైరిసమాసములు ప్రసిద్ధ ప్రాచీనకావ్యము లన్నిట నున్నవి.

కనకాంబగారి “హంపవిజయము”లో లక్ష్యశుద్ధి లేదని రామకృష్ణకవిగారు సోపపత్తికముగా నిరూపించిరి. ఆమె చేసిన శాకుంతలానువాదమునందలి మంచి సెబ్బరలను కవిగారు చక్కగా పరిశీలించిరి. మూల శ్లోకానువాదములో పరిపూర్ణ భావావతారము, రమ్యత యున్నవా? లేవా? యని కవిగారు శ్రద్ధగా సమీక్షించిరి. 123 వ పుటనుండి విమర్శ “కవనము మంచి ధారాశుద్ధి కలదై, సరళమై, రుచులీనుచుండు” నన్న పద్ధతిలో సాగినది. ఇది యంత యుత్తమ విమర్శగాదు. కొందఱు కావ్యములవిమర్శలో కథను వివరించుటయందే యెక్కువ శ్రద్ధ చూపిరి కవిగారు. వరలక్ష్మమ్మగారి కథలలోని పాత్రల మనస్తత్త్వము నిశితముగా పరిశీలింపబడినది. స్థానాపతి రుక్మిణమ్మగారి “గీత” వ్యాఖ్యానము మనోహరము. ఇట్టివ్యాఖ్యానము తోడివిమర్శ గ్రంథ మందెక్కువగాలేదు. అట్టి విమర్శయే యుండవలయు. పాణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మల కావ్యముల విమర్శలో శబ్దశుద్ధి పరామర్శ యెక్కువ. స్థానాపతి రుక్మిణమ్మ రచించిన “సముద్ర మథన” నాటక విమర్శలో క్రొత్తదనము కానరాదు. “పరిశిష్టము” కేవలము కవయిత్రుల జాబితా.

రామకృష్ణకవిగారి విమర్శ అలంకారశాస్త్ర సంప్రదాయబద్ధమయిన విమర్శ. అది పక్షపాత రహితమై, సత్యప్రీతి కలిగినట్టిది. విమర్శలో ఆదియందు కన్పించు బలము అంతమునందు శూన్యమయినప్పటికి, “తెలుగు రచయిత్రులు” విమర్శ సాహిత్య ప్రక్రియా లోకములో ఉచిత స్థానము పొందగలదు.

## “ప్రణయసౌధం”; “మిన్నేటిపొంగులు”

రచన : మోరియా హిరాలాల్‌రాయ్; తెలుగు: దాశరథి. ప్రాప్తిస్థానము:—జిల్లారచయితల సంఘం, మోహన్‌రోడ్, ఖమ్మం. (ప్రతిపుస్తకము మూల్యము రూపాయ.)

“ప్రణయ సౌధం”, “మిన్నేటి పొంగులు” అను ఈ రెండు లఘుకావ్యములను రచించినవారు శ్రీ మోరియా హిరాలాల్ రాయ్. శ్రీ మోరియా హీరాలాల్‌రాయ్ సుప్రసిద్ధుడయిన కవి. కథకుడును. వారిరచనలు ఉర్దూ, హిందీ సాహిత్యముల కలంకారములు. శ్రీ రాయ్ సాంఘిక రాజకీయ రంగములలో సేవలు శ్రమించు కవి. వారి జీవనము, తెలంగాణ రాజకీయోద్యమము అభిన్నములు. అందువలన హీరాలాల్‌రాయ్‌గారు రచించు ప్రతి గీతములో వారి యనుభూతి కొట్టవచ్చినట్లు కన్పడును. లోకమునకు దూరముగా చంద్రశాలలలో అసూర్యంపశ్యులై విహరించుచు, కవితలల్లినవారుగాదు శ్రీ మోరియా. ఈ రెండు కావ్యములను తెలుగు చేసినవారు శ్రీ దాశరథి. దాశరథి మోరియాలు ఏకగర్భ జనితులుగా బ్రతికినవారు. ఇరువురిలో దౌష్ట్యమును సహింపని తత్త్వదర్పము, ఆదర్శమునకు అక్షరరూపమొసగు కవితావేశము కావలసినంత యున్నవి. మోరియా రచనలకు దాశరథి యనువాదములవలన బంగారమునకు తావి యబ్బినట్లయినది.

“ప్రణయసౌధం” భిన్నోపాధులను ఆశ్రయించిన ప్రణయమును వర్ణించు చిరుకబ్బము.

“ఈనశ్వర ప్రపంచంలో వున్నాయి కొన్ని
అవి నశించి కూడా కోల్పోవు తమలోని తేజాన్ని
తమ ఔన్నత్యాన్ని వ్యక్తిత్వాన్ని కోల్పోవు—
బ్రతుకునుండి విడివడి కూడా బ్రతికివుంటాయి
నిండుగా” (పుట—6.)

అని అన్నారు శ్రీ మోరియా. అట్టివాని ప్రణయతత్త్వమే “ప్రణయసౌధం” నకు వస్తువయినది. ఏ పురాణ ప్రదేశమును వీక్షించిన, ఏ పురాతన నిర్మాణమును చూచిన మోరియాగారికి

“హృదయ వీణలు మ్రోగు చప్పుట
మానవుని ఔన్నత్య మచ్చట
మరుగుపడక ప్రదర్శితంబగు
మానవుని కృషికానిపించును'

అని తెలిసినది. అందుచే ప్రాచీ నిర్మాణావశేషములను చూచినపుడు మోరియాగారు పొందిన అనుభూతి వైయక్తికము గాక, విశ్వజనీనమయినది. “ప్రణయసౌధం” లో వివిధప్రణయ చంద్రశాలలు కలవు. ఇందు “ప్రణయసౌధం” తాజమహలు. ఈ కవితాఖండము, “చార్‌మినార్”భార్యాగత ప్రణయము వర్ణించినది. “ఖులీఖుతుబ్ షా” ప్రజాభ్యుదయ ప్రణయము చూపును. “అజంతా శిల్పి”, “నాగార్జున నాగరికత” సర్వ మానవ ప్రణయము చాటును. “నేస్తగాడా!” యనునది తత్త్వబోధ చేయును. “స్మృతి” వియోగగీతిక. మోరియాగారు దర్శించిన ప్రణయము లోకోత్తరమైనది.

“ప్రేమ యనగ మహా పరీక్ష
ప్రేమ యనగ మహా త్యాగం
ప్రేమ యనగ సంఘర్షణ
ప్రేమే జగదాకర్షణ” (పుట—19.)

అని ప్రేమను నిర్వచించి

“అందముకొఱకై అఱ్ఱులుసాచుట
యౌవనమునకై ఆకలిపొందుట
నిజమగు ప్రణయము కాదెన్నటికీ
మనోవికాసమె ప్రణయ విలాసము (పుట—32.)

అని చాటినారు శ్రీ హీరాలాల్ రాయ్. ఇట్టి ప్రణయమువలన "మానవతా నామమ్మున మానవత" నశించిన లోకము, "ఏమడే ఘనుడై వెలుంగు" "దయ్యములు గూడను" "ధర్మబోధను సేయుబూను"లోకము సుసంపన్నవ్రతమగునని గ్రంథకర్త యాశ.

"మిన్నేటిపొంగులు" కేవలము దీనార్తుల హృదయమ్ము ప్రతిబింబించిన, అచ్చముగా శ్రీ. శ్రీ "మహాప్రస్థానము"న్ను పోలిన కావ్యము. "పరమాత్ముని ఈ లోకంలో నరుడే దానవుడై లేచెను" అని శ్రీ హీరాలాల్‌రాయ్ ఆక్రోశించిరి. ఈ దానవత్వము సంఘ దేశ ప్రపంచములలో ఎన్ని రూపములతో వికటాట్టహాసము చేయుచున్నదో ఆ రూపముల నన్నిటిని చూచి, తీవ్రావేదనమును పొంది, ఆ యావేదనమునకు అక్షరరూప మొసగిరి. హాహాకార ములతో నిండిన లోకమును చూచి ద్వేషించి క్రుంగి కూలిపోక, గుండె దిటవుతో నిలబడి ప్రగతి పథములో పయనించుట మానవా భ్యుదయచిహ్నము. ఆ చిహ్నము "మిన్నేటి పొంగు"లలో సర్వత్ర యున్నది. సర్వసంహార సందేశముకాక, స్వర్గసృష్టి సందేశమం దిచ్చువాడే చిత్తశుద్ధి కల కవి. అట్టి కవి శ్రీ హీరాలాల్ రాయ్.

శ్రీ దాశరథి యనువాదము సులభగుణము గలది. వారు ఎట్టి క్లిష్టత లేకుండ, భావానుకూలముగా పదగతిమార్చి, ఝుటితి స్ఫూర్తి గల శిష్ట వ్యావహారిక భాషలో అనువాదమును సాగించిరి. "ముందుకే నడవాలి, సందులే గడవాలి" (మిన్నేటి పొంగులు పుట—28) అనుచోట అనువాదము శబ్దాలంకారము నాశ్రయించి, నిర్జీవమయినది. ఇట్టి పట్టులు పెక్కులు.

—శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు.

## మూడు నాటికలు

1. భువన విజయము:—రచన: తిమ్మావజ్ఝల కోదండ రామయ్య. ప్రచురణ: సరస్వతీ కుటీరము, మద్రాసు—21. 40 పేజీలు. వెల: రూపాయి.
2. గడ్డిపూలు: రచన: కొండముది శ్రీరామచంద్ర మూర్తి. ప్రచురణ: సాహితీప్రచురణలు, అశోక నగర్, ఏలూరు. 51 పేజీలు. వెల: యాభై నయాపైసలు.
3. ధనుర్దాసు:—రచన: కొండముది శ్రీరామచంద్ర మూర్తి. ప్రచురణ: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురము, ఉల్లిపాలెముపోస్టు, దివి తాలూకా, కృష్ణాజిల్లా. 32 పేజీలు. వెల: యాభై నయాపైసలు

వీటిలో 'గడ్డిపూలు', 'ధనుర్దాసు' నాటికలను కొండముది శ్రీరామచంద్రమూర్తి రచించారు. 'గడ్డిపూలు' నాటిక సాంఘిక నాటిక. రజని అనే అభాగ్యురాలి కథ. ఈ అభాగ్యురాలు రజని గిరిధరరావువల్ల మోసగించబడి, విశ్వనాథం ప్రాపున జేరుతుంది. విశ్వనాథం, కుమారుడు రఘుపతి ఆమెను చిదరించుకుంటాడు. విశ్వనాథం, రఘుపతి ఆమెను విడిచిపెట్టి వెళ్ళిపోగా, గిరిధరరావు మళ్లావచ్చి, ఆమెను తనతో రమ్మంటాడు. అలోగా, ముత్యాలు (నమ్మకంగల నౌకరు) వెళ్లి వాళ్లిద్దర్నీ తీసుకొస్తాడు. వాళ్ళు వచ్చేసరికి గిరిధరరావు ఇక్కడ వుండటంవల్ల, రజనిని, 'ఛీ' అని తిరిగి వెళ్ళిపోతారు. ముత్యాలు మాత్రం ఇంకా ఆమె కోసం తాపత్రయపడుతూవుంటే, రజని "ఈ జీవిత చరమాంకంలో రేకులు రాలిన నాబోటి పూలమీద ఎవ్వరూ సానుభూతి చూపనక్కరలేదు. వెళ్ళండి, అందరూ వెళ్లండి, వెళ్లండి, వెళ్లండి......" అని తెర వేసుకుంటుంది. చాలాచోట్ల విజయవంతంగా ప్రదర్శించబడ్డ ఈ నాటిక ప్రదర్శనానుకూలమైనది. ఐతే, ఆద్యంతం ఈ నాటికలో విషాదం మరీ విషాదంలో సాగటంవల్ల, దుఃఖరసాన్ని ఆస్వాదించగల ప్రేక్షకులకు మాత్రమే ఈ నాటిక రసవత్తరంగా కనిపించవచ్చును. రచయిత, సంభాషణలను క్లుప్తంగా వాడటంవల్ల—నటించే వారికి, నటించేందుకు ఎక్కువ అవకాశం కనిపిస్తుంది. సంభాషణల్లోనూ, దృశ్యంలోనూ 'సింబాలిజమ్' చూపించారు రచయిత.

ఈయన రాసిన 'ధనుర్దాసు' నాటిక కేవలం వైష్ణవ మతానికి సంబంధించినది. ధనుర్దాసుకు, భార్య హేమపై మోహం ప్రబలంగా వుంటుంది. 'ఇది ఐహికమైన ఆనందం, క్షణికం' అంటుంది హేమ. వీ రిద్దరూ రామానుజుల కుటీరానికి వస్తారు. అక్కడ కూడా ధనుర్దాసు భగవదారాధనకు బదులు భార్యసౌందర్యారాధనే ముఖ్యమని అంటూ వుంటాడు. కాని, రామానుజుల తత్వబోధవల్ల భగవంతుని తెలుసుకుంటూ వుంటాడు. ఒకనాడు, హేమ నిద్రిస్తూ వుండగా, ఆమె నగలను తీసుకురమ్మని రామానుజాచార్యులవారు తన శిష్యులకు ఉత్తరు విస్తారు. శిష్యులు తస్కరిస్తూవుండగా, ఆమెకు మెలకువ వస్తుంది. ఆ సంగతి తెలుసుకుని, ధనుర్దాసు "వైష్ణవ భక్తులు చేస్తున్న పనికి, ఆటంకం కలిగించా"వని భార్యను దూషిస్తాడు. ఆ తర్వాత తప్పు తెలుసుకుని, రామానుజుల దగ్గరకుపోయి, తన భార్య చేసిన అపరాధాన్నీ, విష్ణుచిత్తయగు తన భార్యను దూషించినందువల్ల తన అపరాధాన్నీ క్షమించమంటాడు ధనుర్దాసు. పశ్చాత్తాపానికిమించిన శిక్ష లేదనీ, విష్ణు కీర్తనలు పాడుకొమ్మని ఆదేశిస్తాడు రామానుజులు.

నాటిక ఆద్యంతం తత్వ తర్కాలతో, గంభీరమైన శైలిలో సాగింది.

## భువన విజయం

ఇహ, తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు రచించిన 'భువన విజయం' నాటిక. ఈ చిన్ని నాటకంలో 'రంగాలు' ఆరు వుండటంచాత, ప్రదర్శించేవారు కొన్ని సాధక బాధకాలకు లోనవుతారు.

'కవితకు పెండ్లి పందిళ్లు వేసిన' కృష్ణరాయల కాలంనాటి వైభవంలోని ఒక్కటైన కవితా సామ్రాజ్యం ఈ నాటికలోని ముఖ్యాంశం. రాయలవారి సాహిత్యగోష్ఠులన్నీ 'భువన విజయ'సభాభవనంలో జరిగేవని సర్వులకూ విదితమే. ఈవైభవాన్ని కోదండరామయ్యగారు కళ్ళకు కట్టినట్లు చూపించారు. అసలు, రాయలవారి కాలంలో జరిగిన ముఖ్య కవితాఘట్టాలను దాదాపు అన్నింటినీ, ఈ 'భువన విజయం'లో వారు చెప్పారు. పెద్దన గారి 'నిరుపహతి స్థలంబు..........' పద్యం మల్లికార్జునుడు అనే కన్నడ కవి రాసిన కన్నడ పద్యానికి అనువాదం అనీ, రాయలవారు గండ పెండేరాన్ని బహూకరిస్తానంటే, పెద్దనగారులేచి, 'పెద్దన బోలు పండితులు' అని చెప్పటం, కృష్ణరాయలవారు 'ఆముక్త మాల్యద' రచించటానికి కారణమూ, ఏ సందర్భంలో రాయల వారు 'దేశ భాషలందు తెలుగులెస్స' అని అన్నారో— పెద్దన గారి పల్లకిని రాయలవారు స్వయంగా మోయటం—వంటి ఘట్టాలూ, ముఖ్యమైన సాహిత్య గోష్ఠులూ సరళంగా, క్లుప్తంగా ఈ నాటికలో చెప్పారు. సందర్భానుశుద్ధిగా పద్యాలను వాడటం కూడా బాగున్నది. సంభాషణలు ఎంత చిక్కగా వున్నయ్యో ముద్రణకూడా అంతచక్కగా వున్నది!

—సుకుమార్.

## నివేదన

(వేంకటేశ్వర శతకము)

(రచయిత : శ్రీ కోటగిరి విశ్వనాథరావు, గంపగూడెము, కృష్ణాజిల్లా. వెల : 50 నయాపైసలు.)

ఈకాలంలో ఏ గ్రంథం చూచినా పీఠిక లేకుండా వచ్చింది కాన్పించడంలేదు. కొన్ని కొన్ని పుస్తకాలలో అసలు గ్రంథం కంటే, పీఠిక బరువు ఎక్కువగా ఉండటం, గ్రంథాన్ని చదివే పాఠకుడికి ఆగ్రంథాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలో, అందులో ఏమి ఏమి అర్థాలు ఉన్నాయో చెప్పడం పరిపాటి అయిపోయింది. అట్టి నగిషీలు లేకుండా వెలువడిన పుస్తకం 'నివేదన' అనే "వెంకటేశ్వర శతకం."

శతకం సంస్కృతంనుంచి తెలుగులోకి వచ్చిన కావ్య ప్రక్రియలలో ఒకటి. అందులో అనాది నుంచీ కవుల తమ ఎద సొదలను వెలయించుకోవడం ఉంది. కొందరు శతకం, కవి కావ్య రచనా ప్రారంభదశనాటి "తయారు తినడం" గా భావించడం ఉంది గాని, అది అటు సంస్కృత శతకాలను పరిశీలించినా, ఇటు తెనుగు శతకాలను పరిశీలించిన నిజం అని తోచదు. అనుభవం బాగ పండినా తర్వాతనే కవులు శతక రచనకు పూనుకొంటూ ఉండినట్లు కన్పిస్తుంది. ప్రారంభ దశలో వ్రాసిన శతకాలు అంటూవుంటే అవి కాలంలో నిల్వలేదు.

కాని శ్రీ విశ్వనాథరావుగారి ఈశతకం ఆ కోవకు చెందిందికాదు. ఇందులో ఎద సొదను సొదలించుకొనడం ఉన్నా, అనుభవపరిపాకం లేదు. అందువల్ల శతకానికి రావలసిన బిగువు రాలేదు. ఇంకో విచిత్రం ఏమంటే, ఈ శతకానికి వేంకటేశ్వరశతకం అన్న పేరును పురఫ్‌గా తగిలించి, "నివేదన" అన్న పేరును ప్రధాననామధేయం చేయడంలో గూడా కొంత అనుకరణ ఉంది. విశ్వనాథవారు తమ విశ్వేశ్వర శతకానికి 'మా స్వామి' అన్న పేరు పెట్టడం ఇట్టి అనుకరణకు ఆధారమైందని అనుకుంటాను.

ఇక శతకంలో కవిత్వవిషయం; అది సాఫీగా సాగింది. అక్కడక్కడ కొన్ని దీర్ఘసమాసాలు ఉన్నా, లలితంగా ఉన్నాయి. ప్రతిపద్యంలో కవియొక్క వినయం కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది. తనకు కవిత్వం రాదంటూ "శ్రీ తిరుపతి స్వామికి" విన్నవించుకుంటూనే గడుసుపోకడలు పోయిన తావు లున్నాయి. కవి తత్వదృష్టి గూడా గడుసుగా ఉంది. విశిష్టద్వైతియైన దేవుణ్ణి, అద్వైత రీతిని సంప్రార్థనం చేయడం మరి ఏమవుతుంది.

ఇందులో కొన్నిభావాలు, అలంకారాలు అందంగా ఉన్నాయి. సూర్యుడు ఉదయించాడని చెప్పడానికి "భావము లోన పెల్లుబుకు భక్తిని తెల్పుచు భక్తకోటి నీ సేవల కోసమై యుడిన స్మేరకుసుంభకరండ మట్లునై, వనజాత మిత్రుడుద యాద్రిని తోచెను" అనటం ప్రౌఢంగా ఉంది. అట్లాగే తుమ్మెదలను "నీరజకన్యకామణి వినీల కనీనికల" తో పోల్చడం సొగసుగా ఉంది. ఆంధ్ర సాహిత్యంలో శతక వాఙ్మయానికి శ్రీ విశ్వనాథరావుగారి ఇూ చిరుకబ్బం ఒక నూతనాలంకారం కాగలదు.

హో. శి.

# వార్తలు

ఏప్రిల్ 1:—రచయితల గోష్ఠి బొంబాయిలో జరిగింది. ఉపరాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ దానిని ప్రారంభించారు.

ఏప్రిల్ 2:—లఘు పరిశ్రమల సంయోజనాన్ని గురించి ప్రతి రాష్ట్రంలోను సలహా సంఘాలను ఏర్పాటు చేయడానికి కేంద్రం నిశ్చయించింది.

ఏప్రిల్ 2:—పశ్చిమ ఇరియన్‌లో ఇండొనేషియా తన గెరిల్లా బలాలను దింపింది.

—దేశంలో నాల్గు రాష్ట్రాలకు క్రొత్త గవర్నర్లను రాష్ట్రపతి నియమించారు—మహారాష్ట్రకు డా. సుబ్బరాయన్; బీహారుకు శ్రీ అనంతశయనం అయ్యంగార్; రాజస్థాన్‌కు డా. సంపూర్ణానంద్; ఉత్తరప్రదేశ్‌కు శ్రీ బిశ్వనాథ్ దాస్.

—డా. హెమర్‌షెల్డ్ విమానానికి విమానసారథి తప్పిదం వల్ల ప్రమాదం సంభవించినట్లు సమితి అధికారులలో ఒకరు చెప్పారు.

—కెనడాకు పంచదార ఎగుమతి చెయ్యడానికి సరాటా ఒప్పందం కుదుర్చుకోబడినట్లు భారత ప్రభుత్వం ప్రకటించింది.

ఏప్రిల్ 3:—కృష్ణా—గోదావరీ జలాల పంపిణీ విషయంలో మైసూరు వైఖరి క్రొత్త ముఖ్యమంత్రి శ్రీకాంఠి శాసనసభలో వివరించారు.

ఏప్రిల్ 4:—నిరాయుధీకరణాన్ని గురించి అమెరికా నూతన పథకాన్ని జనీవాలో శ్రీ అర్థర్‌డీన్ ప్రతిపాదించారు.

ఏప్రిల్ 6:—రాష్ట్రాలలో ప్లానింగ్ బోర్డుల స్థాపనను గూర్చి ప్రణాళికాసంఘం రాష్ట్రాలకు వ్రాసింది.

—కాశ్మీర్‌లో తిరిగి బక్షీ గులాం మొహమ్మద్ ప్రధానిగా మంత్రివర్గం ఏర్పడింది.

—వర్జీనియా పొగాకు అమ్మకంపై పన్ను విధింపును గూర్చి, ఆంధ్రప్రదేశ్ చట్టం రాజ్యాంగ విహితం అని సుప్రీం కోర్టు తీర్పు ఇచ్చింది.

—పశ్చిమ ఇరియన్‌లో సమితి పరిపాలన కొంతకాలం సాగాలని శ్రీ థాంట్ చేసిన సూచనను ఇండొనేసియా బలపరిచింది.

ఏప్రిల్ 7:— అమెరికా ప్రతిపాదనలుఆధారంగా పశ్చిమ ఇరియన్‌పై మంతనాలకు ఇండొనేసియా ఆమోదించింది.

—సర్వాధికారాలు జనరల్ డిగాల్‌కు ఇస్తూ, ఫ్రెంచి ప్రజలు రిఫరెండంలో ఆయన అల్జీరియా విధానానికి అనుకూలంగా వోటు చేశారు.

ఏప్రిల్ 9:—17 మంది మంత్రులతో శ్రీ నెహ్రూ నూతన కేంద్రప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. శ్రీ గోపాలరెడ్డిని క్యాబినెట్ మంత్రిని చేశారు.

—యుద్ధప్రచారనివారణకు జనీవాలో అమెరికా అష్ట సూత్ర ప్రణాళికను ప్రవేశపెట్టింది.

ఏప్రిల్ 10:—నూతన భారతప్రభుత్వం ప్రమాణ స్వీకారం చేసింది.

—కేంద్ర మంత్రివర్గంలో చేరడానికి శ్రీ మనూ భాయ్ షా నిరాకరించారు.

ఏప్రిల్ 11:—జనాభా, ఆయువు విషయంలో కేంద్ర ప్రభుత్వం విధానం ఏమిటో ప్రకటించబడింది.

—శ్రీ మనూభాయ్ షా మనస్సు మార్చుకొని, కేంద్ర మంత్రివర్గంలో చేరారు.

ఏప్రిల్ 12:—కృష్ణా—గోదావరీ జలాల విషయంలో మద్రాసు కోరికలనుగురించి ప్రభుత్వ ప్రతినిధులు గుల్హాతీ సంఘంతో చర్చించారు.

ఏప్రిల్ 13:— సరిహద్దులవిషయంలో భారతదేశం విధానం శాంతియుత పరిష్కారానికి అనుకూలంగాలేదని చైనా ప్రకటించింది.

—పశ్చిమ ఇరియన్ సమస్య యుద్ధంలేకుండా పరిష్కారంఅయ్యే ఎత్తు కన్పించడంలేదని ఇండొనేషియా ప్రకటించింది.

ఏప్రిల్ 15:—డా. మోక్షగుండం విశ్వేశ్వరయ్య బ్రహ్మైక్యం చెందారు.

—రాష్ట్రపతిపదవికి డా. రాధాకృష్ణన్, ఉప రాష్ట్రపతి పదవికి డా. జకీర్ హుస్సేన్‌ల తరఫున నామినేషన్‌లు దాఖలు చేయబడినాయి. ఉప రాష్ట్రపతి పదవికి శ్రీ ఎన్. సి. సామంత సిన్హా గూడా పోటీ చేస్తున్నారు. ప్రతిపక్షాలవారు శ్రీ జయపాల్ సింగ్‌ను నిల్పాలని ఆలోచిస్తున్నారు. మే 7 వ ఎన్నికలు జరుగుతాయి.

—జెనీవాలో సమాలోచనలు సాగుతున్నంతకాలం అణ్వస్త్ర పరీక్షలను ఆపాలన్న భారతదేశం సూచనకు రష్యా సుముఖత ప్రకటించింది.

ఏప్రిల్ 16:—బెర్లిన్‌సమస్యపై తిరిగి వాషింగ్టన్‌లో రష్యా రాయబారి, అమెరికా విదేశాంగమంత్రుల మధ్య సమాలోచనలు ప్రారంభమైనాయి.

—విశాఖపట్టణంజిల్లాలో క్షామపరిస్థితులు ఏర్పడుతున్నట్లు వార్తలు వస్తున్నాయి.

ఏప్రిల్ 16:—లోక్‌సభ సమావేశం ప్రారంభమైంది.

—కేంద్ర ప్రభుత్వోద్యోగులకు కరువుభత్యం హెచ్చించారు.

—అణ్వస్త్రపాటవపరీక్షల నిలుపుదల సందర్భంలో పర్యవేక్షణనుగురించి తటస్థరాజ్యాలు ఆరు సూత్రాలను జనీవాలో సభలో ప్రతిపాదించాయి.

—సముద్రానికి తొమ్మిదివేల అడుగులఎత్తున క్రొత్త రకం కోతిని రష్యాలో పట్టుకున్నారు.

ఏప్రిల్ 17:—లోక్‌సభ సభాపతిగా సర్దార్ హుకుం సింగ్ ఎన్నిక అయినారు.

—అమెరికాకు పంచదార ఎగుమతి కలకత్తా రేవునుంచి ప్రారంభమైంది.

—పోర్చుగీసు ఖైదీలను తీసుకుపోవడానికి పాంజార్ ప్రభుత్వం ఆమోదించింది.

—నేపాల్ విప్లవంలో భారతదేశానికి సంబంధం వున్నదంటూ, ఆ దేశం ప్రభుత్వం ఒకప్రకటనచేసింది. తూర్పు నేపాల్‌లో విప్లవకారులు పోటీ ప్రభుత్వాన్ని పెట్టినట్లు తిరుగుబాటుదార్ల రేడియో ప్రకటించింది.

ఏప్రిల్ 18:—చైనా "బిగ్‌లీప్" విధానం తల్లక్రిందులైనట్లు ప్రథమపర్యాయం అధికారికంగా పెకింగ్ అధిపతులు వెల్లడి చేశారు.

—నేపాల్‌రాజా ఢిల్లీకి వచ్చారు.

—రాష్ట్రపతి పార్లమెంటును ప్రారంభిస్తూ ప్రసంగిచారు.

—నిరాయుధీకరణ విషయంలో మూడు దశల పథకాన్ని అమెరికా ప్రతిపాదించింది.

ఏప్రిల్ 19:—లఢాక్ ప్రాంతంలో చైనా క్రొత్త దూరాక్రమణకు దిగింది.

—రైల్వే బడ్జెట్టును లోక్‌సభలో సర్దార్ స్వరణ్‌సింగ్ ప్రతిపాదించారు. రైలు కేవులు, ప్రయాణపు ఛార్జీలు అధికం చేయబడినాయి.

—సెప్టెంబరు 10 ని కామన్‌వెల్తు ప్రధానుల సమావేశం జరుగుతుందని బ్రిటిష్ ప్రధాని ప్రకటించారు.

—శ్రీమతి వైలెట్ ఆల్వా రాజ్యసభ డిప్యూటీ చైర్మన్‌గా ఎన్నికఅయినారు.

ఏప్రిల్ 20:—మాజీ జనరల్ సలాన్‌ను అరెస్టు చేశారు.

—రష్యా—చైనాల తగాదా పరిష్కారం అవుతున్న దాఖలాలు కన్పిస్తున్నాయి.

—అణ్వస్త్ర పరీక్షల విషయంలో తటస్థ రాజ్యాల పథకంపట్ల రష్యా, బ్రిటన్‌లు సుముఖతను ప్రకటించాయి. అమెరికా పరీక్షలు ప్రారంభిస్తే, సమావేశంనుంచి పోతామని రష్యా ప్రకటించింది.

ఏప్రిల్ 23:—కేంద్ర బడ్జెట్టును ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ లోక్‌సభలో ప్రతిపాదించారు. ఇందులో మొత్తం 7170 లక్షల రూపాయల అదనపు ఆదాయం వచ్చే పన్నులు విధించారు. ఆదాయాన్ని 132087 లక్షలుగాను, ఖర్చును 138165 లక్షలుగాను అంచనా చేశారు. 1961—62 లో ఆదాయం 107911 లక్షలు. ఖర్చు 104515 లక్షలు.

ఏప్రిల్ 24:—అణ్వస్త్ర పరీక్షలను ఆపాలని అగ్రరాజ్యాలకు శ్రీ నెహ్రూ విజ్ఞప్తి చేశారు.

—చైనా దురాక్రమణను అరికట్టేందుకు సరిహద్దు పోలీసు బలాలకు అధిక అధికారాలు ప్రసాదించబడినాయి.

—రష్యా ప్రధానిగా తిరిగి శ్రీ కృశ్చేవ్ ఎన్నికఅయినారు.

ఏప్రిల్ 25:—అమెరికా తిరిగి అణ్వస్త్ర పరీక్షలను ప్రారంభం చేసింది.

—కాశ్మీర్ విషయంలో భారత ప్రభుత్వ విధానాన్ని వివరిస్తూ, విదేశాంగశాఖ ఒక కరపత్రాన్ని ప్రకటించింది.

—చైనా సరిహద్దులను భారతదేశం అతిక్రమిస్తున్నదని పెకింగ్ ప్రభుత్వం ఆరోపించింది.

ఏప్రిల్ 26:—కాశ్మీర్ వివాదంతో మధ్యవర్తిత్వం వహించి, పనిచేయవలసిందిగా సమితి కార్యదర్శిని అమెరికా, బ్రిటన్‌లు కోరుతున్నట్లు వార్త వచ్చాయి.

—రైలు ప్రయాణాలను సుఖవంతం చేయడం ఇప్పుడప్పుడే సాధ్యంకాదని రైల్వేమంత్రి ప్రకటించారు.

—ఎన్నికలలో తమ పార్టీ జయాపజయాలనుగూర్చి కమ్యూనిస్టుపార్టీ చర్చ ప్రారంభం చేసింది.

—జనీవా సమాలోచనలనుండి రష్యా వెళ్ళిపోలేదు.

—ఒప్పందం కుదిరేదాకా అమెరికా అణ్వస్త్ర పరీక్షలు చేస్తూనే వుంటుందని అమెరికా విదేశాంగమంత్రి ప్రకటించారు.

ఏప్రిల్ 27:—ఫజ్లుల్‌హక్కు చనిపోయారు.

—ఫ్రెంచి ప్రధానిగా శ్రీ పాంపిదో ఎన్నికఅయినారు.

ఏప్రిల్ 28:—భద్రతా మండలిలో కాశ్మీర్‌చర్చ ప్రారంభమైంది. శ్రీ జఫ్రుల్లా మాట్లాడినతర్వాత సభ వాయిదా పడింది.

—ఆంధ్ర, తెలంగాణా భూమిశిస్తుల సమన్వయంపై అనంతరామన్ కమిటీ సిఫార్సులను అమలు జరపాలని రాష్ట్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

ఏప్రిల్ 29:—ఊటీ చర్చలలో కృష్ణ—గోదావరుల జలాల పంపిణీ విషయంలో ఆంధ్రకు అన్యాయం జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. నాగార్జునసాగర్ రెండో దశకు, తుంగభద్ర ఎగువకాల్వ రెండోదశకు దాదాపుగా ఎగనామం పెట్టినట్లే విదితం అవుతున్నది. ఇవి ఇదివరకే మంజూరైనా, వీటిని రెండు, మూడు ప్రణాళికలలోలేని పథకాల జాబితాలో చేర్చాలని గుల్హాతీ సంఘం నిర్ణయించినట్లు తెలుస్తున్నది.

—గుల్హాతీసంఘం పరిశీలనాంశాలు పురస్కరించుకొని, కృష్ణా గోదావరీ జలాలను పంచేందుకు కేంద్రం వేరే ఇంకో సంఘాన్ని వేయుగలదని వార్తలు వస్తున్నాయి.

—భారత పశ్చిమ సరిహద్దులలో చైనా సేనలు సమీకరింపబడుతున్నట్లు వార్తలు అందుతున్నాయి.

—ఫలితంవుంటే అధినాయకసభలో పాల్గొనటానికి అమెరికా, బ్రిటన్‌లు ఒప్పందలను కుదుర్చుకున్నాయి.

ఏప్రిల్ 30:—కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షుడుగా శ్రీ డాంగే, కార్యదర్శిగా శ్రీ నంబూద్రిపాద్ ఎన్నిక అయినారు.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**